# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

*

సంపుటము : 66 మార్చి 1989 సంచిక : 3

విడిపత్రిక వెల ఐదురూపాయలు

---

## విషయానుక్రమణిక

### మార్చి 1989

# శ్వాస్ మింట్స్




అమృతాంజన్ లిమిటె
వారి మరొక గొప్ప తయారి

**Amrutanjan Limited**

# స్వవిషయం

విద్యారణ్యస్వామిని సాంస్కృతిక సజీవరూపంగా మాదిరాజు రంగారావుగారు దర్శించిన తీరు ఎక్కువమంది పాఠకులకు ఆమోద యోగ్యం కాగలదు.

తురగా కృష్ణమూర్తిగారి ఏఱువ, మైలమ భీముల వ్యక్తి నిరూపణ వ్యాసం చారిత్రిక పరిశోధకులకు ఆసక్తికరంగా ఉండగలదు.

వేంకట పార్వతీశ్వర కవుల గురించి తెలుసుకోవడం సాహితీ సుగతులకు ఎంతో ఉత్సాహంగా ఉంటుందనడంలో సందేహం లేదు. అలాగే తుమ్మలవారి రచనల గురించి కూడా తెలుసుకోవాలన్న కుతూహలం ఉండడంలో ఆశ్చర్యంలేదు. ఈ రెండు అంశాలకు సంబంధించి ఈ మాసం భారతిలో అందిస్తున్న వ్యాసాలు సాహిత్యకారు లకు ఆనందదాయకం కాగలదు.

శిలాశాసనములవంటివి సామెతలని మరోసారి ప్రభులింగదేవర గారి వ్యాసం స్పష్టం చేస్తే, "కన్యాశుల్కం"లోని హాస్యం తపస్సిద్ధి పొందిందని కాలువశ్రీగారు మళ్ళీ చెప్పారు.

"కథాప్రియుల కోసం పాలడుగు వేంకటేశ్వరరావుగారి "అడవులు పిలిచాయ్" అందిస్తున్నాము. విలక్షణమైన ఇతివృత్తంతో ఇది అందరినీ అలరించగలదనే నమ్ముతున్నాము.

ఇక కవిత్వానికి పుట్టినిల్లు భారతి అన్న లోకోక్తిని ఎవరూ ఎవరికీ గుర్తు చేయనక్కరలేదు. ఈసారి కవిత్వంలో ఒక "విరూపిక" కూడా ఉంది. విమర్శకుల ముందు అది ఎంతవరకు నిలుస్తుందో వేచి చూడాలి.

విశిష్టమైన ఇతివృత్తం కల కథలకోసం, మాన్య మానవ భావాలు వెల్లివిరిసే విలువైన కవిత్వంకోసం, సామాజిక శ్రేయస్సును ఆకాంక్షిస్తూ వాస్తవాలను వెలికితీసే నిష్పక్షపాతమైన విమర్శ కోసం భారతి ఎదురుతెన్నులు చూస్తోందని – రాసేవారూ, చదివేవారూ గమనించవలసిందిగా మనవి.

# ప్రకృతి స్వరాలు

శ్రీ వేముగంటి నరసింహాచార్యులు

గీ॥ ఓ యుషస్స్వర్ణరూపిణీ! ఓ మనోజ్ఞ
సాంధ్యరాగిణీ! నైశ ప్రశాంతనిలయ!
ప్రకృతి లీలావతీ! కళారాధనీయ!
ఋతువు లన్నియు నిన్నాశ్రయించి తిరుగు

గీ॥ తావకీన వినూత్న సౌందర్యగరిమ
మలచుకొన్నట్టి మధుమాస విలసనమ్ము
రెమ్మలై, కొమ్మలై చిగురించి, పూచి
మధుపరాగ పరిమళ సంపన్నమగును

గీ॥ నీ కవోష్ణ దీర్ఘనిశ్వాస పవమాన
వీచికలు స్పృశింప విహ్వలించి
కన్నెవాగు గొంతు సన్నమై లోలోన
గొణుగుకొనును జాలిగొన్న పాట

గీ॥ నీ వినీల నేత్రాల క్రీనీడలందు
మెఱపుతీగలు పందిళ్ళు పరచుకొన్న
తొలకరి మొయిళ్ళ కౌగిళ్ళ పులకరించి
నేల, సౌభాగ్యరేఖలన్ దిద్దుకొనును

గీ॥ నీ దరస్మితామృతపు వేణికల దేలి
మబ్బు కాటుక రేకలు మలిపివేసి
శుభ్ర శారద కౌముదీ సురుచిరమ్ము
లై, దిశల్ రెల్లుపూల మాల్యములు దాల్చు

గీ॥ మురిసి నీవు ముత్యాల జాలరులవంటి
తెలి జిలుగు మంచు ముత్యాల తెరలు దీర్చ
పచ్చ చేమంతిరేకుల పసిడిమేడ
నవతరించు హైమవతి శీతాంతరంగ

గీ॥ నీవు చూపిన అనురాగ భావదృష్టి
లక్షణమ్మున శిశిరవేళా విఘాత
శూన్యవన జీవితమ్ము విస్ఫుటపలాశ
పుష్పరాగ నవోదయమ్మును వహించు.

శ్రీ మాదిరాజు రంగారావు

# సాంస్కృతిక సజీవరూపం శ్రీ విద్యారణ్యస్వామి

శ్రీ విద్యారణ్యులు పద్నాలుగో శతాబ్దిలో దక్షిణ భారత దేశంలో గొప్ప సాంస్కృతిక పునరుజ్జీవనానికి హేతుమూర్తి. పూర్వాశ్రమంలో మాధవాచార్యులు, హరిహర 1 మరియు బుక్కరాయల కులగురువులు విజయనగర సామ్రాజ్య వ్యవస్థాపకులూ, ఆదిశంకరుల అద్వైత సిద్ధాంతవ్యాప్తికీ, వేదమార్గ ప్రచారానికీ జీవితాన్ని అంకితం చేసిన మహాపురుషులు. ఆది శంకరుల తరువాత యుగంలో వేదాంత మత క్షేత్రాల్లో విద్యారణ్యులతో పాటు ఆతని సోదరులు సాయణుడూ భోగనాథుడూ కృషి చేశారు. వీరు కర్నాటబ్రాహ్మణులు. తండ్రి మాయణుడు. తల్లి శ్రీమతి విజయనగర సామ్రాజ్యం తొలి రాజులకు సాచివ్యం ఆచార్యకం నెరపారు. నారాయణాచార్యులు కంపభూపతివద్ద అమాత్యుడుగా ఉన్నారు. మాధవాచార్యులే తురీయాశ్రమం స్వీకరించాక, శ్రీ విద్యారణ్యులయ్యారు. భారతీ తీర్థుల తరువాత శ్రీ విద్యారణ్యులు శృంగేరీ పీఠాధిపత్యాన్ని స్వీకరించారు. హరిహర బుక్కరాయల కాలంలో మరొక మాధవాచార్యులున్నారు. ఈయన శివభక్తుడు. సంస్కృతంలో తాత్పర్యదీపిక (సూత్ర సంహితకు వ్యాఖ్యానం) శైవామ్నాయ సారం అనే గ్రంథాలు వ్రాసారు. ఈయన వేరు.

సాయణుడు, మాధవుడు (తురీయాశ్రమంలో విద్యారణ్యులు) కలిసి 'వేదార్థ ప్రకాశిక'- వేదాలకు భాష్యం వ్రాశారు. సాయణుడు 'ధాతువృత్తి' వ్రాసి అగ్రగణ్యుడై మాధవుని పేరు పెట్టినట్లు తెలుస్తోంది. భోగనాథుడు సంస్కృతంలో ఉదాహరణ మాల అనే గ్రంథం వ్రాసాడు. ఈ సోదరులు ముగ్గురూ వేదమార్గాన్ని అనుసరించి అద్వైతమతాన్ని ప్రబోధించారు. వీరిలో విద్యారణ్యుల వ్యక్తిత్వం సాచివ్యం ఆచార్యకం గ్రంథరచన, పీఠాధిపత్యంచేత విశిష్టమయింది. భౌమమూ, పరమమూ సమన్వయించి ఆదర్శరూపాన్ని సాధించిన మహనీయుడు.

వేదభాష్యంతో పరాశర స్మృతి వ్యాఖ్యానం జైమినీయ సూత్ర మాలా విస్తరణం, కాలమాధవీయం, వ్యవహార మాధవీయం, వివరణ ప్రమేయం సంగ్రహం, జీవన్ముక్తి వివేకం సర్వదర్శన సంగ్రహం, దృక్‌దృశ్య వివేకం, శంకర విజయం పంచదశి గ్రంథాలు పూర్వాశ్రమంలో వ్రాసినవి. వీటిలో కొన్నిటి కర్తృత్వాన్ని గురించి వాదోపవాదాలున్నాయి. ఈ స్థితి ముఖ్యంగా సంస్కృత వాఙ్మయంలో ఎందరో ప్రాచీన కవుల గ్రంథాలకు వర్తిస్తుంది. కారణం వారి దృష్టి భౌతికం కాకపోవడమే. వారికి విజ్ఞాన విషయమూ చర్చ ప్రతిపాదనం వ్యాఖ్యానంపట్ల ఉన్న శ్రద్ధ కర్తృత్వం గురించి లేకపోవడమే. కాలంపై పరంపరగా సాగుతూ వచ్చే ఈ స్థితిలో ఒక్కొక్కప్పుడు మూలకర్త మరుగున పడిపోవచ్చు. ప్రాచీనకాలంలో విద్యా విషయంలో పరంపరగా విజ్ఞాన అభివృద్ధి చెందుతూ ఒకరి తరువాత మరొకరికి కొలది మార్పులతోనో చేర్పులతోనో అందుతూ పరిణామ క్రమంలో ఇద్దరు ముగ్గురిదాకా భాగస్వాములతో రూపొందడం లేదా కర్తృత్వచర్చకు అవకాశం కలగడం ఉంది. దీన్ని ఎవరూ అంతగా పట్టించుకొనేవారు కాదు. వారి దృష్టి విజ్ఞానంపై తప్ప కర్తృత్వంపై స్వనామ ప్రచారంపై అభిలాష ఉండేది కాదు. ఉపనిషత్ విజ్ఞానం ఈ విధంగా వచ్చిందే. ఇదే పద్ధతిలో మౌలికంగా శ్రీ విద్యారణ్యుల ఆలోచన, అభిప్రాయాలతో తరువాత ఇతరులచే వ్యాఖ్యాన విలసితాలు కావచ్చు. లేదా ఈ పరంపరంలో శ్రీ విద్యారణ్యులు ప్రముఖ స్థానం వహించి

ఉండవచ్చు. ఈ విధంగా అతనిపేరిట కొన్ని గ్రంథాలు వ్యవహృతం కావడం సహజం. ఇది ఈనాటి పరిశోధనలో ప్రత్యక్ష పరోక్ష సాక్ష్యాధారాలతో ఎంత ప్రయత్నించినా ఎన్నో అంశాలు సందేహాస్పదంగానే ఉన్నాయి. ఉదాహరణకు దృక్ దృశ్య వివేకం ఈ స్థితిని పొందింది. దీనికి వాక్య సుధ అని మరో పేరు ఉంది. ఇదే పేరు వ్యాఖ్యానంవల్ల ఈ పేరు వచ్చిఉంటుంది. దీనితో కర్త పేరు సులభంగా మారే అవకాశం వుంది. ఇది వేదాంతతత్త్వం యొక్క ప్రకరణ భాగానికి చెందింది. జీవ బ్రహ్మైక్యాన్ని ప్రతిపాదించేది ఇక్కడ మనం చర్చించే విషయం ఏమంటే, బ్రహ్మానంద భారతి అనే వ్యాఖ్యాత దీన్ని భారతీతీర్థుల కృతిగా భావించాడు. ఆనందజ్ఞుడనే మరో వ్యాఖ్యాత దీన్ని శంకరాచార్యుల కృతిగా భావించాడు. నిశ్చలదాసు తన వృత్తి ప్రభాకరంలో దీన్ని పంచదశికర్త విద్యారణ్యులదిగా పేర్కొనడం జరిగింది. ఆదిశంకరులు స్థాపించిన శృంగేరీ పీఠాధిపతి (క్రీ.శ. 1328-1380) జగద్గురు శ్రీ భారతీతీర్థులు, విద్యారణ్యులకు గురువు. (1340లో విజయనగర ప్రభువులు హరిహర 1 ఆయన సోదరులు. శ్రీ భారతీతీర్థులకు శృంగేరీ మఠ నిర్వహణకు కొంత భూమిని దానం చేసిన శాసనం ఉంది.) విద్యారణ్యులు వీరి శిష్యులు కావడంవల్ల ఇరువురూ పరస్పరం విజ్ఞాన విషయాలను గురించి ఆలోచన చెయ్యడం, చర్చించడం, సిద్ధాంత ప్రతిపాదనం జరపడంలో ఒకే విధమయిన భావధార కలిగి ఉండడంవల్ల, కర్తృత్వ విషయంలో అభిప్రాయభేదాలకు తరువాత తరువాత అవకాశం కలిగింది. ఇంకా వైయాసిక న్యాయమాల, పంచదశి విషయంలోనూ కొన్ని భాగాలు భారతీ తీర్థులవిగా పేర్కొనడం జరిగింది. ఏమైనా ఈ మహానుభావులీ సాధారణమైన (వారి దృష్టిలో) కర్తృత్వాభిలాష కతీతులన్న విషయం మరచిపోకూడదు. శంకర విజయం విషయంలోనూ ఇటువంటి అనుమానం రాకపోలేదు. కాని ఇది వ్రాసింది పూర్వాశ్రమంలోని మాధవులే అన్నదానికి ఆధారమూ ఉంది. గ్రంథంలో సర్గ చివర-

"ఇతి శ్రీ మాధవీయే తదుపోద్ఘాత కథాసంక్షేప
శంకర విజయే సర్గో యం ప్రథమా భవత్"

ఇది పదహారు సర్గల మహాకావ్యం. ఆదిశంకరుల జననం, విద్యాభ్యాసం, స్వమత ప్రబోధం, అన్యమత ఖండనం, విజయయాత్రతో కూడింది. ఈ సందర్భంలో మరో విద్యారణ్యుని గురించి పేర్కొనడం అవసరం. ఈయన బుక్కరాయల సేనాపతి. ఇంచుమించు ఇదే కాలానికి చెందినవాడు, శైవుడు, ఉపనిషత్ మార్గంపై విశ్వాసం కలవాడు. ఇతడు వేరు. ప్రకృత విద్యారణ్యులు అద్వైతి; వేదమార్గాన్ని ప్రతిష్ఠాపనం చేసే అభిలాష కలవాడు.

"పద వాక్య ప్రమాణానాం సార దృశ్వా మహామతిః
సాంఖ్య యోగ రహస్యజ్ఞో బ్రహ్మ విద్యా పరాయణః
వేదార్థ విశదీకర్తా వేదవేదాంగ పారవిత్ విద్యారణ్యమతిః"-

## 2

పంచదశి అద్వైత వేదాంత తత్త్వాన్ని ప్రబోధించే గ్రంథం. ఇది శ్రీ విద్యారణ్యుల కృతుల్లో మహనీయమైంది. సంస్కృత వాఙ్మయంలో అద్వైత తత్త్వాన్ని బోధించే గ్రంథాలు రెండు విధాలుగా కనిపిస్తాయి. ఒకవిధం; ఈ మార్గాన్ని అనుసరించేవాళ్ళకు విషయం స్పష్టంగా తెలిసే విధంగా చక్కగా ప్రబోధించేవి. మరోవిధం, ఈ మార్గానికి వ్యతిరేకమైన సిద్ధాంతాలను పూర్వపక్షం చేస్తూ, ఖండిస్తూ తర్కసహితంగా విషయాన్ని ప్రతిపాదిస్తూ ప్రవచించేవి. పంచదశి మొదటి విధానానికి చెందింది. పంచదశి పదిహేను అధ్యాయాల గ్రంథం. కాబట్టే దీనికీ పేరు వచ్చింది. ఇది మూడు భాగాలుగా విభజింపబడింది. (1) వివేక పంచకం (2) దీప పంచకం (3) ఆనంద పంచకం. వివేక పంచకంలో సత్యం నుండి అసత్యాన్ని వేరు చేసే అంశాలతో కూడిన విషయం ఉంది. (2) దీప పంచకంలో శుద్ధమైన చైతన్య రూపం, ఆత్మలక్షణం గురించీ ఉంది ఆనందపంచకంలో బ్రహ్మంయొక్క ఆనంద స్వరూపం, వివరింపబడింది. ఈ మూడుభాగాలూ క్రమంగా సత్, చిత్, ఆనంద అనే మూడు అంశాలపై దృష్టిని కేంద్రీకరింపజేసేవి ఇది స్థూలమైన విభజనం మాత్రమే. ఇంకా సూక్ష్మానికి పోతే అద్వైత సిద్ధాంతంయొక్క ప్రధానలక్షణాలు మూడింటిలో విడివిడిగా, సమయోచితంగా యోజితమై, ప్రసక్తమై కనిపిస్తాయి. ఈ మహాగ్రంథంలో విద్యారణ్యులు అద్వైత సిద్ధాంతాన్ని శాస్త్రం; హేతుదృష్టి; అనుభూతి అనే మూడు ఆధార తలాలపై నిర్మించడం కనిపిస్తుంది. అద్వైతం జ్ఞాన మార్గానికి చెందింది ఇది శ్రవణ మనన నిధి ధ్యాసనంతో కూడింది. ఆత్మతత్త్వం, చైతన్యరూపం. ఇది పరివర్తన చెందనిదీ, విభజింపబడనిదీ, అంతం లేనిదీ, చావు పుట్టుకలు లేనిదీ, స్వయంప్రకాశం కలిగిందీ. సనాతనమూ, శాశ్వతమూ, అనంతమూ అయింది "అణోరణీయాన్ మహతో మహీయాన్"

జీవుని చివరి లక్ష్యం మోక్షం. ఈ తత్త్వం "అహం బ్రహ్మాస్మి", "తత్త్వమసి" మొదలైన మహావాక్యాల సముచిత వివరణంతో ఆవిష్కృతమైంది. ఇందులో శ్రీ విద్యారణ్యుల ప్రతిభా స్పర్శ స్పష్టంగా కన్పిస్తుంది. వీరు బాగా వివరించి మనల్ని ఆలోచింపచేసే మరో అంశం ఉంది. స్వప్నరహిత మయిన గాఢనిద్రా స్థితిలోనూ ఒక చైతన్యతత్త్వం ఉంది. ఇది ఈ స్థితికి సాక్షీభూతమయింది. నిద్రనుండి మేల్కొన్న తరువాత స్వప్నం అనుభవ-జ్ఞాపకంవల్ల ఇది ఒకటి ఉందనీ, మన అవగతికి వస్తుంది. ఇదే సాక్షి. ఇది శాశ్వతమైందీ, ఆనంద చైతన్య సత్యమయమైందీ, అవిద్య ఆనందరూపాన్ని కప్పేస్తుంది. ఇంకా శ్రీ విద్యారణ్యులు స్వయంను అహంనుండి వేరు చేసి సూక్ష్మ సూక్ష్మాంశాలపై మన దృష్టిని ఆకర్షిస్తారు. స్వయం అనేది సర్వ సాధారణమైంది. అహం సాధారణమైంది కాదు. ఇది ఉత్తమ పురుషులకు మాత్రమే పరిమితమైంది.

సాక్షిని నాల్గవ చైతన్యరూపంగా భావించడమైంది. బ్రహ్మము, ఈశ్వరుడు, జీవుడూ, తరువాత సాక్షి. ఇదీ క్రమం సాక్షి లక్షణాన్ని వివరించేందుకు. ప్రత్యేకంగా ఒక అధ్యాయాన్ని వినియోగించడం చూస్తే, వీరు దీనికిచ్చే ప్రాధాన్యాన్ని గుర్తించ వచ్చు. సాక్షిని స్థూల సూక్ష్మ రూపాలకు అధిష్ఠానంగానూ భావించడం జరిగింది. ఇంకా మాయకూ అవిద్యకూ గల సూక్ష్మ భేదాన్ని గుర్తించడమూ కన్పిస్తుంది. మాయ ఈశ్వర సంబంధమైంది. అవిద్య జీవ సంబంధమైంది. ఈశ్వరుడూ జీవుడూ బ్రహ్మముయొక్క ప్రతిబింబాలే.

ఇది ఇట్లా ఉంచి శ్రీ విద్యారణ్యులు, సంగీతశాస్త్రంలో కృషి చేశారు. ఆ కాలంలో ప్రచారంలో ఉన్న పదిహేను మేళములకు, మరో ఐదు మేళములు చేర్చి, ఇరవై (20) మేళములు వివరించారు. వాటి జన్యరాగాలను, డెబ్బయిమూడు పేర్కొని వీటిలో నలభైమూడింటికి (43) రాగాల లక్షణాన్ని వివరించారు. ఈతని స్వర మేళకళానిధి కర్నాట సంగీత పరిణామ చరిత్రలో పేర్కొనదగినదిగా సంగీతజ్ఞులు అభిప్రాయం. సంగీతసారముచే గ్రంథాన్ని రచించినట్లు చెబుతారు.

### 3

వ్యక్తి జీవితంలో భౌతికమూ ఆధ్యాత్మికమూ- అనే రెండూ స్థితులూ తమ పాత్రల్ని నిర్వహిస్తుంటాయి. ఒక్కొక్కరి జీవితంలో వీటి నిష్పత్తి ఒక్కొక్క విధంగా రూపొంది జీవిత స్వరూపాన్ని ఏర్పరుస్తాయి. ఎప్పటికప్పుడు సమాజంలో వచ్చే అనేక పరిణామాలవల్ల సమయ సమయానికీ చరిత్రలో కొత్త సమన్వయం కొత్త ముఖం కొత్త దిశారూపం అవసరమవుతుంది. ఈ చారిత్రకమైన అవసరాన్ని గుర్తించి ఆ కాలంలో కొత్త సమన్వయ భావంతో సాంస్కృతికమైన ఉజ్జీవనానికి శ్రీ విద్యారణ్యులు కారణభూతులయ్యారు. కొత్త జీవశక్తితో ముఖ్యంగా దక్షిణ భారతదేశాన్ని తరంగితం చేశాయి. ఇది ఆ పైన సర్వ భారతదేశానికి ప్రసరించింది. ఈయన మహా వ్యక్తిత్వం ఇందుకు ఎంతో దోహదం చేసింది. ఈ వ్యక్తిత్వం, ముఖ్యంగా (1) సాచివ్యం (2) ఆచార్యకం (3) వేద వేదాంత తత్త్వప్రబోధకం (4) పీఠాధిపత్యం.

మొదటిది విజయనగర రాజ్యస్థాపనకూ, రాజకీయ సుస్థిరతకు ఉపకరించింది. రెండోది సరియైన దిశను చూపిస్తూ హిత పర్యవేక్షణ నెరపింది. మూడోది మత తాత్త్వికక్షేత్రాన్ని సంపన్నం చేసింది. నాల్గోది ఆదర్శప్రాయమై నిలిచింది. ఇవి అన్నీ కలిసి సంపూర్ణమైన ప్రభావశక్తిని ప్రసరింపజేసి, సమాజాన్ని ఉచ్చస్థితికి తీసుకొని వెళ్ళాయి. ప్రజల్లో మన సంస్కృతిపట్ల తత్పరత జీవితానికి లక్ష్యమూ, ఇది పొందడానికి ఎన్నుకొనే సాధనాల మార్గాల ఉత్తమత్వమూ భావింపజేస్తూ చరిత్రలో ఒక మహోజ్వలమైన యుగాన్ని నిర్మించాయి. చరిత్ర పరిణామంలో ఉదాత్తమై సంస్కృతీశిఖరంగా నిలచింది.

ఈ ప్రేరణ శక్తికి నిలయాలుగా శంకర రామానుజ మధ్వ ఆచార్యులతో శ్రీ విద్యారణ్యులనూ పేర్కొనవచ్చు. ఆ కాలంలో పరస్పర వ్యతిరేక ధోరణులతో ఆశావహమైన సాంస్కృతిక రూపాన్ని ఆధారశక్తిగా శ్రీ విద్యారణ్యులు సమర్పించారు. ఈ సత్క్రియ భౌతికమైన సమాజ సుస్థితికీ, నైతికమైన జీవనపుష్టికీ, ఆధ్యాత్మికమైన పవిత్ర వాతావరణ సృష్టికీ ఉపకరించిన మాట వాస్తవం. అది, పూచిన పూలవల్ల, పండిన ఫలాలవల్ల చెట్టు సంగతి తెలుస్తుందన్న రీతిగా తరువాత కాలంలో ఇది సంపూర్ణంగా అనుభవానికి రావడమేగాక, ఉన్నతమైన విలువల అవిచ్ఛిన్నమైన రూపానికీ దారితీసింది.

మతం అంటే భగవంతునికీ ఆత్మకూ మధ్య సంబంధాన్ని స్థాపించేది. నేలకూ జీవితానికీ గల అనుబంధాన్ని పవిత్రం చేసేది. వ్యక్తికీ సమాజానికీ గల ఆశ్రయ లక్షణాన్ని పరస్పరావగాహనతో సుస్వరతతో దృఢతరం చేసేది. ఈ అభిప్రాయాన్ని జీవితంలో అనుభవపూర్వకంగా పరివర్తితం చేసిన మహాపురుషులు శ్రీ విద్యారణ్యులు దీనిచేత ఈయన సాధించింది:

(1) రాజకీయమైన సుస్థిరత

(2) మత సామరస్యం

(3) వైదికమైన శాశ్వతమైన విలువల స్థాపనం

(4) సాంస్కృతికమైన ఉజ్జీవనం

జాతిని సంకుచితమయిన, ఒంటరితనం ఆవహించిన శుష్కమైన వ్యక్తిత్వంనుండి, విశాలమైన అనంతమయిన సజీవ వ్యక్తిత్వంలోకి అర్థవంతంగా పరివర్తనం చేసారు. ఇది చారిత్రక పరిణామంలో భాగమైందీ, సాంఘికంగా ఉన్నతమైన విలువల్ని ప్రతిఫలింపజేసేదీ. ఈ విధంగా పధ్నాలుగో శతాబ్దిలో దక్షిణ భారతదేశంలో సాంస్కృతికమైన సజీవశక్తికి ప్రతిరూపమే శ్రీ విద్యారణ్యస్వామి.

# ఎక్కట్లు

### శ్రీ సూర్యదేవర రవికుమార్

కవిత యొక తీయ మామిడికాయ దాని
మధురిమను గ్రోలదలచిన మానవునకు
రీతి నెరిగింతురే కాని చేతనిడుచు
నమిలి యిత్తురె లోకులు నవ్వుకొనగ 1

చెరువులోని చేప జెట్టుకొమ్మకు జేర్చి
ముంపు కాచితనుచు మురియు కోతి
ఎల్లెరుంగు ప్రకృతి; నిన కాంతిగనినంత
నుబ్బ డేగ, ద్రాగు గబ్బిలంబు 2

కాలగతికి తగిన లీల మారుట ఒప్పు
సంప్రదాయమేని, చదువు లేని
వ్యక్తి ననుసరించి వస్త్రఖండముగాని
వైపరీత్య మగునె వసుధ మీద. 3

ఎపుడు శిష్యులు తనయంత ఎదుగుదురను
చింతతో నుండు సతతము శ్రీగురుండు
శిష్యులెప్పుడు పాదాల చెంతనుండ
కోరుకొనుచుండు కుత్సిత గురుడు సతము 4

తత్త్వవేత్తయైన దైవదూతయె యైన
పంచవన్నె కలల భ్రమల మునిగి
నిద్ర జెందువాడు నిరుపయోగియె కాని
ఉద్ధరింపలేడు ఉర్విజనుల 5

ఒకరి కొకర మనెడి ఊహయే సంపద
ధనము, పసిడి కాదు దంపతులకు
ఆత్మతృప్తికన్న అధికమైనది లేదు
అని యెరింగి మసలుకొనుట లెస్స. 6

జీవితపు తత్త్వమెరిగిన జీవులెపుడు
బ్రతుకుదురు నిరాడంబర పథమునందు
మరి నిరాడంబరులయిన మానవాళి
సర్వులును తత్త్వమెరిగిన జనులు కారు 7

సంఘమున మార్పు తేవలె చాలననుచు
బద్ధకంకణులైనట్టి ప్రజలు కనరు
ఎంత మార్పును తామొంది రింతకునని
తాను మారని వాడెట్లితరుల మార్చు? 8

# హరుమంజి హవణిక

## శ్రీ వఝ్ఝల కాళిదాసు

కలలు కావివి గుండె కొండల
మలచ మొలిచిన ధ్వజస్తంభాల్;
పలుకు ఉలులన్ సానబట్టితి
పదనుగా నా మెదడులో.

అణువు పేల్చే శాస్త్రవేత్తల
కసువు లిచ్చే రైతు నాగలి
ఆగిపోతే రగిలిపోతాయ్
ఆర్పబడని దవానలాల్!

దైవమన్నది సత్యమైతే
ధైర్యముగ సత్యమునె నమ్ముము:
హృదయ వహ్ని ధరాధరమ్మున
మెదలు లావా వాస్తవం!

ఆశయాల్లో ఆదినుండే
ఆశలన్నీ ఉన్నతాలే
కాయకష్టపు కొలిమిలో నవి
కార్యరూపము తాలుచున్.

నేను శంఖం ఊదినంతనె
సత్యభామలు సబలు లౌదురు,
రిక్కలన్నీ రెక్క తొడుగును,
గరుత్మంతుడు సుధలు కురియున్;

మరలు తిరుగును విశ్రమించక
పవలు రేలూ పరిశ్రమలన్,
ధరాధరములు తలలు వంచును,
నివురు కప్పదు నిప్పులన్.

రాజధానీ నగర వీధుల
రక్తపాయిలు తిరుగుతున్నవి,
అంబరంబున పసిడి బొమ్మలు
ఆడుకుంటూ ఉన్నవి!

గాలిలోపల తేలి తూలీ
క్షుధా కంకాళాలు రుధిర
ప్రవాహాల్లో ములిగిపోతూ
పక్కుమంటూ నవ్వుతాయ్!

గుడుల్లోనా గోపురాల్లో
గోవు చర్మపు కోట్లు తొడిగిన
పులుల గుంపులు పొంచి ఉన్నవి
పలల మృగయాసక్తితో

భద్రకాళీ మందిరాల్లో
క్షుద్ర జీవాస్థులకు మధ్యన్
బుద్ధ విగ్రహ దళిత శీర్షం
పొర్లుతున్నాది!

పంట భూముల్లోన భవనాల్
ఆకసాన్నే అంటుతుంటే
రాజవీధుల పూరిపాకలు
తలలు వొంచేయి!

కోట బురుజుల గృధ్రలోకం
గూళ్లు కట్టుక కులుకుతున్నది;
స్మశానంలో కాలరుద్రుడు
తాండవించేడు!

ఆశలెత్తిన అంపశయ్యల
మీద భీష్ములు వేచి చూచిన
ఉత్తరాయణ పుణ్యకాలం
ఊడిపడలేదు!

రామరాజ్యపు కలలు కాంచిన
ప్రజాబంధువు లంధకారపు
అంబరాల్లో మబ్బు మరుగున
చుక్కలైనారు!

నడిబజార్లో నగ్నసుందరి
పురాణాలకు బూజు దులిపెను;
రాజనర్తకి పెంటకుప్పల
నాట్య మొనరించెన్!

చెమట నదులై పారుతుంటే
నోట్లకట్టలతోడ కట్టిన
నావలందున్ తిమింగిలములు
తిరుగుతున్నాయ!

ఇంద్రసభలో అప్సరాంగన
పాడుతున్నది, ఆడుతున్నది;
ఎడ్లబండీ ఇరుసు లోపడి
చచ్చెనొక కూలీ!

శాంతి సందేశాల ఇటుకలు
సౌమనస్యపు సిమెంట్ కూరిచి
సృజిస్తున్నారోయి ప్రభువులు
సమ సమాజ సమాధులన్!

మనం ప్రజలం, మనం ప్రజలం,
ఎండుపుల్లలు కుళ్లు నీళ్ళూ
నిండిపోయిన పంజరాల..
ప్రాణమున్న శవాలమోయ్!

మనుషులందరు ఒక్కమైతే!
మతాలన్నీ ఏకమైతే!!
సర్వమానవ సమానత్వం
స్వప్న గత సంతర్పణం!!!

# ఒక విరూపిక

మరాఠీ మూలం :

శ్రీ విందా కరందికర్

ఇంగ్లీషునుంచి అనువాదం :

శ్రీ గాలి నాసరరెడ్డి

యవ్వనంలో వుండగా
అతనోసారి
సముద్రంలో మూత్రం పోశాడు.

అందువల్ల సముద్ర మట్టం
ఎంత పెరిగిందో కొలవడంలోనే
అతని జీవితం ముగిసిపోయింది.

('విరూపిక' ఒక విధమైన వ్యంగ్యకవితా ప్రక్రియ)

కాలువ శ్రీ

# "కన్యాశుల్కం"లో తపస్సిద్ధి పొందిన హాస్యం

"నాకు హాస్యప్రియత్వమే లేకుండిన యెడల నేనెన్నడో ఆత్మహత్య చేసుకొని యుండెడివాడను...." అంటాడు మహాత్మా గాంధి. హాస్యం టానిక్ లాంటిది. సమస్త బాధలను మరచి పోవడానికి నవ్వు సంజీవినిలా పనిచేస్తుంది. అత్యంత గంభీర సన్నివేశాల్లోనూ హాస్యపుజల్లు కురిపించి పరిస్థితిని తేలిక చేయడానికి గొప్పవాళ్ళు హాస్యాన్నుపయోగించుకోవడం చూస్తుంటాం. మహనీయుల వ్యక్తిత్వాలలో హాస్యం విడదీయరాని భాగంగానే వుంది. పోగా హాస్యము ననుభవించెడు సౌకర్యము ఏ జంతు జాలంలోనూ లేక ఒక్క మనిషికే వుంది....జీవితంలో హాస్యం చాలా ముఖ్యమైంది. బహుకార్యవ్యగ్రమై, అత్యంత వేగంతో గడిచిపోతున్న ప్రస్తుత కాలంలో కడుపార నవ్వుకోవడానికి హాస్యం మరింత అవసరముంది. హాస్యంయొక్క ప్రాముఖ్యాన్ని తెలుసుకున్నవారు కాబట్టి కవులు ప్రాచీన కాలంనుండియు సాహిత్యంలో హాస్యానికి సముచిత స్థానం యిచ్చారు.... నవ రసాల్లో హాస్యం ఓ స్థానాన్నాక్రమించుకుంది. "హాస్యం ఏవ ఏకోరసః" అన్న లాక్షణికులు కూడా వున్నారు.

సామాజిక వాస్తవికతకు ప్రతిబింబంగా, జీవితానికి 'ఎక్స్‌రే'గా నిలిచిన కన్యాశుల్కం నాటకం తెలుగులోనే కాదు భారతదేశంలోని ఏ ఇతర భాషల్లోని నాటకాల్లోనైనా అగ్రగామిగానే నిలుస్తుంది.... "సంకెళ్ళను ప్రేమించేవాళ్ళు మాత్రమే, గ్రాంథిక భాషను ఆరాధిస్తారు. నా మట్టుకు నా మాతృభాష సజీవమైన తెలుగు. 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్" అని మాండలీక భాషలో మొదటిసారిగా నాటకాన్ని రాసి ప్రజల భాషకు సాహిత్య గౌరవం తీసుకొచ్చారు గురజాడ. కన్యాశుల్కం పేరునుగాని, పాత్రల పేర్లనుగాని, ఏదో సంభాషణను గాని, సంఘటననుగాని ఉపయోగించుకోకుండా తెలుగు పత్రికల్లో (ఏదో ఒక పత్రికలోనైనా) ఒక్కరోజు కూడా ఉండదంటే అతిశయోక్తి కాదేమో.... ముప్పాతిక ఏళ్ళపైగా సజీవంగా నిలిచి, భవిష్యత్తులో కూడా భారతీయ భాషల్లోనే కాకుండా ప్రపంచ సాహిత్యంలోనే గణించదగ్గదిగా వున్న కన్యాశుల్క నాటకంలో హాస్యం పుష్కలంగా వుంది. ఇది హాస్యరస ప్రధానమైన నాటకం కాకున్నా ఇందులో హాస్యానికి సముచిత స్థానముంది. ఇందులోని పాత్రల పేర్లే ప్రత్యేకంగా వుంటాయి. సంభాషణలు నవ్వింపజేస్తాయి. ఇందులోని పాత్రలు ఒకర్నొకరు మారుపేర్లు పెట్టుకొని పిలుస్తారు. గిరీశం అగ్నిహోత్రావధానిని అగ్గిరాముడంటాడు. కరటకశాస్త్రి అగ్నిహోత్రావధానిని మూర్ఖపుగాడిద కొడుకంటాడు. గిరీశంను అగ్నిహోత్రావధాని హనుమాన్లు, తురక అంటాడు. గిరీశం కరటకశాస్త్రిని రాస్కెల్, స్కౌండ్రల్ అని బిరుదులు తగిలిస్తాడు. అగ్నిహోత్రావధాని తనకుతానే బారికరావున్నంటాడు. సౌజన్యరావు గిరీశంను నెపోలియన్ ఆఫ్ ది ఆంటీనాచ్, డెవిల్ అని పిలుస్తాడు. ఆషాఢభూతి అంటాడు. లుబ్ధావధాని ముసలి గాడ్దెకొడుకుగా, త్వాష్ఠ్రంగా పేర్లు పెట్టబడతాడు. ఇలా వాళ్ళు ఒకర్నొకరు అడ్డుపేర్లతో పిలుచుకోవడం నవ్వు తెప్పిస్తుంది. జంధప్పోగు వినియోగం గూర్చి గిరీశం మాటలు, టుబాకోప నిషత్తు, సుబ్బిపెళ్ళి తప్పించడానికి అతడు గ్రాంథికంలో రాసిన లేఖ, తాంబూలం యిచ్చేసాను ఇహ తన్నుకు చావండి, రెయిల్లూ గియిల్లూ అన్నీ మన వేదాల్లోనే వున్నాయష అని చెప్పే అగ్నిహోత్రావధాని మాటలు ఇలా ఒకటేమిటి అడుగడుగునా ఈ నాటకంలో నవ్వు తెప్పించే సంభాషణలున్నాయి. అయితే సామాజిక వాస్తవికతకు ప్రతిబింబంగా నిలిచి, సార్వకాలీనతను, సాధించిన ఈ నాటకం కేవలం పొద్దుపోనివారిని నవ్వించ

డానికి మాత్రమే రాసింది కాదు. ఇందులో వున్న హాస్యం కేవలం నవ్వుకొని వదిలిపెట్టేది మాత్రమే కాదు.

సామాజిక బాధ్యత కల్గిన రచయిత నేల విడిచి సాము చేయడు. తన రచనలను నిర్దిష్ట ప్రయోజనాన్నాశించే రచనలు చేస్తాడు. రచనామార్గంగా వ్యంగ్యాన్ని తీసుకున్నా, అధిక్షేపాన్ని తీసుకున్నా తన ప్రయోజనాన్ని దృష్టిలో వుంచుకుంటాడు. అప్పటి సమాజంలో వున్న కన్యాశుల్క సాంఘిక దురాచారాన్ని తీసుకొని గొప్ప సాంఘిక ప్రయోజనాన్నాశించి నాటకాన్ని రాసిన గురజాడ కన్యాశుల్కంలోని హాస్యంయొక్క స్వరూప స్వభావాలను పరిశీలిద్దాం.

సౌజన్యారావు పంతులుగారిచే డెవిల్, ఆషాఢభూతి అని పిలువబడ్డ నెపోలియన్ ఆఫ్ ది ఆంటీ నాచ్ వేషభాషల్లో ఆధునికుడే అయినా అతన్ని ఆధునిక అగ్నిహోత్రావధానులని చెప్పవచ్చు. గిరీశం ఈ నాటకంలో నాయకుడు కాదు. నకిలీ నాయకుడు. ఈతని ఆగమనంతో మొదలైన నాటకం, నిష్క్రమణతో ముగుస్తుంది. ఈతడు జీవితంలో అనేక అవమానాల నెదుర్కొంటాడు. అవకతవక వ్యాఖ్యానాలతో నవ్విస్తాడు. తన మాట వింటే సురేంద్రనాథ బెనర్జీ అంతటివాన్ని చేస్తానంటాడు వెంకటేశంతో. బెంగాలీ కుర్రాడయితే తాతను, తండ్రిని చమ్డాతెక్కగొడతాడంటాడు.... మీవల్ల నాకొచ్చిందల్లా ఒక్క చుట్ట కాల్చడమే అన్న శిష్యునితో చుట్ట పంపిణీమీదే సీమ యంత్రం తెల్లవాడు కనిపెట్టాడని, పొగ తాగనివాడు దున్నపోతై పుడ్తాడని సిద్ధాంతీకరిస్తాడు. ఈ మాటలు, వ్యాఖ్యానాలు పాఠకులకు (ప్రేక్షకులకు) నవ్వు తెప్పించినా ఇవి గిరీశం తన జానెడు పొట్ట నింపుకోవడానికి వాడినవే. కూటికి గూటికి ఠికాణా లేని ఈ నకిలీ హీరో అందర్నీ మోసంచేసి బుట్టలో పడవేసుకుంటూ ఏ పూటకాపూట గడుపుకోవడానికి ప్రయత్నిస్తాడు. తన యజమాని పొగటిరాపుల బాకీ చెల్లించమని వచ్చిన బంట్రోతును చుట్ట యిచ్చి వశం చేసుకుంటాడు. రేపొద్దున డబ్బులిస్తానని జంధం పట్టుకొని ప్రమాణం చేస్తాడు. అతడు పోయింతర్వాత "ఇన్నాళ్ళకు జంఝప్పోస వినియోగంలోకి వచ్చింది. థియాలజిస్టులు చెప్పినట్టు మన ఓల్డు కష్టమ్సు అన్నిటికీ యేదో ఒహ ప్రయోజనం ఆలోచించే మనవాళ్ళేర్పరిచారు. ఆత్మానుభవం అయితేకాని తత్వం బోధపడదు...." అంటాడు. ఆతని ఉద్దేశ్యంలో గాయత్రియొక్క వినియోగం తప్పుడు ప్రమాణాలు చేయడానికి.

గిరీశం మాటిమాటికి బెంగాలీల ప్రసక్తి తెస్తాడు.... బాబు అంటాడు. బెంగాలీల ఉపన్యాసం గూర్చి చెబుతాడు.... గురజాడ ఈ పాత్రద్వారా ఆంధ్రుల భావదాస్యం, అంధానుకరణం గూర్చి చెబుతాడు

మధురవాణి ఇంట్లో పూటకూళ్ళమ్మచే చీపురుదెబ్బలు తప్పించుకొని బయటపడ్తాడు గిరీశం. ఇక ఆ ఊళ్ళో గడపడం సాధ్యం కాదని వెంకటేశంకు చదువు చెబుతానన్న నెపంతో అతన్ని వలలో వేసుకొని సెలవుల్లో గడపడానికి కృష్ణరాయపురం అగ్రహారంలోని అగ్నిహోత్రావధాని ఇంట్లో అడుగు పెడతాడు. తన స్థానాన్ని అక్కడ సుస్థిరం చేసుకోవడానికి మొదట కరటకశాస్త్రిని, తర్వాత అగ్నిహోత్రావధానిని, అటు తర్వాత వెంకమ్మను బుట్టలో వేసుకుంటాడు. మొదట బాల్య వివాహాల గూర్చి, ముక్కుపచ్చలారని పసివాళ్ళను ముసలివాళ్ళకిచ్చి చేసే కన్యాశుల్క వివాహాలగూర్చి వ్యతిరేకించిన గిరీశం అగ్నిహోత్రావధాన్లు తన మాటలకు వ్యతిరేకని తెలియగానే ప్లేటు ఫిరాయిస్తాడు. అడ్డ దిడ్డ వాదంతో కన్యాశుల్క వివాహాలే శ్రేష్ఠమంటాడు. "కుంచం నిలువునా కొలవడానికి వీల్లేనపుడు తిరగేసైనా కొలిస్తే నాలుగ్గింజలు నిలుస్తాయి. బాగా ఆలోచిస్తే ఇన్ఫెంటు మ్యారేజెస్ కూడుననే తోస్తుంది" అంటాడు గిరీశంతో. బుచ్చమ్మ అత్తవారిమీద కేసు వేయాలన్న అగ్నిహోత్రావధాన్లను రెచ్చగొట్టి కోర్టు పనుల్లో సాయం చేస్తానని తన స్థానాన్ని ఇంట్లో సుస్థిరం చేసుకుంటాడు. గిరీశం పనులు వెంకటేశంతో చెంచే లెక్చర్లు, బాట్లిరుసు. ఇంగ్లీషు ప్రయోగాలు నవ్వును పుట్టించకపోవు. కాని తరచి ఆలోచిస్తే ఆ మాటల వెనుక అతని పొట్ట నింపుకోవడమనే అవసరం కనబడుతుంది. ఏం చేసైనా సరే బ్రతుకాలన్న ఆతని నక్కజిత్తులమారితనం అగుపడుతుంది. ఆ పాత్రపై కొంత జాలీ కలుగుతుంది. బుచ్చమ్మను 'వదినా' అని, వెంకటేశంను 'బావా' అని వరుసలు కలిపి పిలుస్తాడు. ఆమెను తన వాక్చాతుర్యంతో నవ్వించి, కవ్వించి, కరిగించి సుబ్బి పెండ్లి తప్పించడమనే ఎరచూపి తనతో లేచిరావడానికి ఒప్పిస్తాడు. సుబ్బి పెండ్లి తప్పించడానికి గిరీశం లుబ్ధావధానికి గ్రాంథికంతో రాసిన లేఖ నవ్వు తెప్పిస్తుంది. అవకతవక వ్యాఖ్యానాలతో, ఏనుగులు లోటపిటలు తేవాలని అగ్నిహోత్రావధాన్లు రాసినట్టు సృష్టింపబడిన లేఖ కడుపుబ్బ నవ్వించినా అప్పటి సమాజంలో వున్న మిధ్యాడంబరాల గూర్చి, సానిమేళంవంటి దురాచారాలగూర్చి పాఠకునికి తెలిసి నవ్వుతోపాటు ఆ సమాజంపై అసహ్యమూ కలుగుతుంది.

చిక్కుల్లో పడిన వేలువిడిచిన అన్నగారైన లుబ్ధావధాని దగ్గరకొస్తాడు. "నీ బంధువుల్లో యింగిలీషు వచ్చినవాన్నీ,

వ్యవహారజ్ఞానం కలవాన్నీ నేనొక్కన్నే గద! నాకో పవరాఫ్ టర్నా మా గొలికిమిచ్చెయ్యి" అంటాడు... అలా అయితే కోర్టు విషయాల్లో సాయం చేస్తానంటాడు. హెడ్ కానిస్టేబులుతో "లోకో భిన్నరుచిః" అంటాడు. "కొందరికి కందిపప్పు పచ్చడి, కొందరికి పెసరపప్పు పచ్చడి రుచి.... కొందరదృష్ట వంతులకు రెండు పచ్చళ్లూ రుచి. అలాగే కొందరి కబద్ధం రుచి మరికొందరికి నిజం.... చాలామందికి రెండింటి కలగలుపూ. అవసర మొచ్చినప్పుడు తణుకూ, బెణుకూ లేకుండా అబద్ధ మాడాల్సిందే ప్రస్తుతాంశంలో" అని లెక్చరిస్తాడు. అసిరిగాడితో ఆబద్ధమాడించే పూచీ నాది అని తనను దత్తత చేసుకుంటే అన్నగారైన లుబ్ధావధాన్లను కనిపెట్టుకుంటానంటాడు హెడ్డుతో. ఈ మాటలు కొంత నవ్వు తెప్పించినా ఆ మాటల వెనుక ఆతని పొట్ట నింపుకోవడమనే అవసరం కనబడుతుంది. గిరీశం మాటలు, మోసాలు అన్నీ తనలోని ఆత్మారాముడి ఘోషను సంతృప్తి పరచడానికే.

సౌజన్యారావు పంతులుగారి దగ్గరకెళ్ళి తానెంతో మంచి వాడుగా నటిస్తాడు గిరీశం. తన మాటల గారడితో అతన్ని నమ్మింపజేస్తాడు. ఆతనితో ప్రశంసింపబడతాడు కూడా. బుచ్చమ్మను పెళ్ళి చేసుకుంటానంటాడు. మధురవాణితో తన గుట్టు బయటపడగా డెవిల్, ఆషాఢభూతి అని సౌజన్యారావు పంతులుగారితో తిట్లు తిని యింట్లోంచి గెంటివేయబడతాడు "డామిట్ కథ అడ్డం తిరిగింది" అని లోకంమీద పడతాడు.

ఈ నాటకంలో గిరీశం అనేక అవమానాలు పొందుతాడు. పొట్ట కూటికోసం ఎన్నో వేషాలేసినా అంతటా ఎదురుదెబ్బలే తింటాడు. పూటకూళ్ళమ్మచే అవమానింపబడతాడు. కొద్ది రోజుల తిండికోసం అగ్నిహోత్రావధానులింట్లో స్థానం సంపాదించుకున్నా అతన్తో తురక హనుమాడ్లు అని తిట్టబడతాడు. సుబ్బి పెళ్ళి తప్పించడానికి అతను రాసిన లేఖవల్లా ప్రయోజనం సిద్ధించలేదు. ఆ పని మధురవాణివల్లే జరిగింది. తనను దత్తత తీసుకోనున్న లుబ్ధావధాన్లతోనూ నిరాకరింపబడతాడు. చివరకు బుచ్చమ్మను పెండ్లి చేసుకుందామన్న ప్రయత్నం కూడా మధురవాణి వేసిన చక్రంవల్ల భంగమవుతుంది. పూటకు కూటికి ఠికాణా లేని ఈ నకిలీ నాయకుడి మాటలవల్ల నవ్వువచ్చినా, ఆ పాత్రపై కొంత జాలీ కలుగకపోదు. తనను తాను పోషించుకోవడానికి ఆతను పడ్డ పాట్లను చూసిన పాఠకులకు విషాదంతో కూడిన నవ్వు వస్తుంది. "డామిట్ కథ అడ్డం తిరిగింది" అంటూ వెళ్ళిపోయిన గిరీశంను చూసి పాపం గిరీశం అనకపోరు పాఠకులు. మధురవాణి మాటల్లో "పాపం ఆయన్ను బ్రతక నివ్వండి" అనాలనిపిస్తుంది నాటకంలో. గురజాడ ఈ పాత్రను పాఠకులను నవ్వించడానికి మాత్రమే సృష్టించలేదు. రచయిత ఈ పాత్రద్వారా ఆశించిన ప్రయోజనం ఇలాంటి గిరీశంల గూర్చి జాగ్రత్తగా ఉండమని హెచ్చరించడం. గురజాడ ఈ నాటకంద్వారా మానవ సంఘంలోని ఒక భాగంలో రేకెత్తిన అసంబద్ధతను, అసంగత్వమును ఎత్తిచూపి మన పెద్ద మెదడుకు పని కల్పించడాన్ని ఆశించాడు. ఇలా గిరీశం పాత్రనుగాని, ఇతర పాత్రలనుగాని నిశితంగా పరిశీలిస్తే పైకి కనిపించే హాస్యం మాత్రమే మనకగపడదు. ప్రొద్దుపోనివారిని నవ్వించడానికి ఉపయోగపడే మామూలు హాస్యంకన్నా భిన్నమైన హాస్యం ఈ నాటకంలో అగుపడుతుంది. ఈ నాటకంలోని సంభాషణల వెనుకనున్న లోతులగుపడతాయి. అందులోని విషాదం కనబడుతుంది.

వసంతసేన పాత్రతో పోల్చదగిన కళింగరాజ్యపు వేశ్యాశిఖామణి మధురవాణి పాత్రను పరిశీలిద్దాం. మొదట సామాన్య వేశ్యగా, చంచలమైనదిగా, అమాయకురాలిగా నాటకంలో ప్రవేశించిన మధురవాణి క్రమక్రమంగా పరిణామం చెందుతుంది. నాటకం యొక్క ప్రధాన ప్రయోజనమైన సుబ్బి పెండ్లి తప్పించడంలోనూ, లుబ్ధావధానిని కేసునుండి తప్పించడంలోనూ ప్రధానపాత్ర వహిస్తుంది. తన చాకచక్యంతో మూర్ఖులైన ముగ్గుర్ని (రామప్పంతులు, అగ్నిహోత్రావధాని, లుబ్ధావధాని) కేసుల్లో ఇరికించి ముప్పతిప్పలు పెట్టి మూడు చెర్ల నీళ్ళు తాగించిన వైనం చూస్తుంటే నవ్వుతోపాటు 'మధురవాణీ ది గ్రేట్' అనాలనిపిస్తుంది. శిష్యున్ని ఏమే లంజా అనడం, ముద్దు పెట్టుకోవడంలాంటి సంఘటనలు, గిరీశం రాసిన లేఖను రామప్పంతులు చదువుతున్నప్పుడు చిలిపిగా నవ్వడం పాఠకులకు కొంత హాస్యాన్ని కలుగజేస్తాయి. అయితే కరటకశాస్త్రితో ఆమె మాటలు సౌజన్యరావు పంతులుగారితో అన్న మాటలు ఆమె హృదయాన్ని విప్పిచూపెడుతాయి. మనసును తేటతెల్లం చేస్తాయి. పాఠకుల హృదయాలను భారం అయ్యేట్టు చేస్తాయి. కరటకశాస్త్రితో మధురవాణి ఇలా అంటుంది.

"అంగడివాడికి మిఠాయిమీద, సానిదానికి వలపూ మనస్సులోనే మణగాలి. కొద్దికాలం వుండే యవ్వనాన్ని జీవనాధారంగా చేసుకున్న మా కులానికి వలపు వక్కచోటే." "బంగారంమీద....శృంగారం వన్నె చెడినదగ్గర్నుంచీ బంగారం గదా తేటతేలాలి."

"అంతకన్నా కాపు మనిషినై పుట్టి వంగ మొక్కలకూ, మిరప మొక్కలకూ దోహదం చేస్తే యావజ్జీవం కాపాడే తన వాళ్ళన్నవారు ఉందురేమో?"

ఈ మాటలవల్ల ఆమెకా వృత్తిపట్ల వున్న ఏవగింపు తెలుస్తుంది. తప్పని పరిస్థితుల్లో ఆ వృత్తి చేస్తున్నట్లు అర్థం అవుతుంది. ఆ పాత్రపై జాలి కలిగి ఆమెనా వృత్తిలోకి నెట్టిన సామాజిక పరిస్థితులపై ఏహ్యాభావం కలుగుతుంది.

సుబ్బి పెండ్లి తప్పించడం అనే కార్యార్థం మధురవాణి దగ్గరకొచ్చిన కరటకశాస్త్రి ఆమె నుబ్బింపజేయాలని ఇలా అంటాడు.

"మధురవాణి అంటూ ఒక వేశ్యశిఖామణి యీ కళింగ రాజ్యంలో వుండకపోతే భగవంతుని సృష్టికి యంత లోపంవచ్చి వుండును."

ఆ మాటలు విన్న మధురవాణి "సృష్టికి లోపం వచ్చినా రాకపోయినా యిప్పటి చిక్కుల్లో మీకు మాత్రం కించిత్ లోపం వచ్చివుండును." అని చురకంటిస్తుంది కరటకశాస్త్రికి.

సౌజన్యారావు పంతులుగారి మంచితనాన్ని, పరోపకార పరాయణత్వాన్ని గూర్చి తెలుసుకున్న మధురవాణి ఆతని దగ్గరకు తాను (వేశ్య) వెళ్ళడం సాధ్యం కాదన్న కరటకశాస్త్రితో "కొత్త సంగతి ఒకటి యీనాటికి నాకు తెలిసింది. సృష్టికల్లా వన్నె తెచ్చిన మధురవాణి అనే వేశ్య శిఖామణి గిరీశంవంటి కుక్కల పొత్తుకే తగివున్నది కాని, సౌజన్యారావు పంతులుగారి వంటి సత్పురుషులను చూడటానికైనా అర్హత కలిగివుండలేదు" అంటుంది

ఈ వాక్యాలు తన వృత్తిలోని హైన్యభావాన్ని ఆమె ఎలా అర్థం చేసుకుందో విశదం చేస్తూ సహృదయులైన పాఠకుల హృదయాలను ద్రవింపజేస్తాయి.

చివరి అంకంలో మధురవాణి సౌజన్యారావు పంతులుగారితో అన్న మాటలు ఎంతో చాకచక్యంతో కూడుకొని పాఠకులకు కొంత నవ్వును తెప్పిస్తాయి. లుబ్ధావధాని వివాహమాడింది ఆడపిల్ల కాదని అసలు విషయాన్ని బయటపెట్టి కేసు చిక్కుముడి విప్పుతుంది.

"నా వృత్తియొక్క హైన్యత నేనెరుగుదును. సత్పురుషుల దయ సంప్రాప్తమైన తర్వాత దుర్వృత్తి యేల వుంటుంది?" అంటుంది సౌజన్యారావు పంతులుగారితో. బుచ్చమ్మను ఆషాఢభూతి గిరీశం బారినుండి తప్పించి "పాపం ఆయన్ను బ్రతుక నివ్వండి" అంటుంది.

తనకు వ్రతభంగం అవుతున్నా ఆమె చేసిన మేలుకు ముద్దు పెట్టుకుంటానన్న పంతులుగారితో చెడనివాళ్ళను చెరపను అని షేక్‌హాండుతో ముగిస్తుంది.

మధురవాణి కొన్ని మాటలు, చేష్టలు కొంత నవ్వు తెప్పించినా, ఆమె తన వృత్తి నర్థం చేసుకొని మాట్లాడిన మాటలు, పరోపకార పరాయణత్వం, ఆమె చెందిన పరిణతి పాఠకులకు ఆ పాత్రపట్ల సానుభూతి, గౌరవం కల్గింపజేస్తాయి. గురజాడ ఈ పాత్రద్వారా ఆశించిన హాస్యం ముతకహాస్యం కాదు కరుణార్ద్రితతో కూడుకొనిన హాస్యం. పెంకు లెగిరి పోయేట్టు నవ్వుకునే హాస్యం కాదు. పెదవులు విడివడీ విడివడకుండా ఆ పాత్రపై సానుభూతితో కూడుకొనిన నవ్వు.

ఓ దిక్కు పెద్దకూతురు వైధవ్యం ప్రాప్తించి కళ్ళెదురుగా ఇంట్లోనే వుంటున్నా మారకుండా, మరో పసిదాన్ని కూడా కన్యాశుల్కం తీసుకొని కాటికి కాళ్ళు చాపుకొని వున్న వృద్ధుడికివ్వడానికి సన్నాహాలు చేస్తున్న మూర్ఖుడు జటాంతస్వాధ్యాయి అగ్నిహోత్రావధాన్లు. పసిపిల్లయైన సుబ్బిని వృద్ధుడికిచ్చి పెళ్ళి చేస్తానన్న అగ్నిహోత్రావధానితో కరటకశాస్త్రి "ఈ సంబంధం చేస్తే యింటి కగ్గిపెడతాను" అంటాడు. ఆ మాటలకు అగ్నిహోత్రావధాని "తాంబూలం యిచ్చేసాను తన్నుకు చావండి" అంటాడు.

"ఆడముండల్తోనా ఆలోచన? యీ సమ్మంధం చెయ్యకపోతే నేను బారికరావున్నే" అంటాడు భార్యతో.

"మీ యీ రెయిల్లూ గియిల్లూ అన్నీ మన వేదాల్లోనే వున్నాయష" అంటాడు గిరీశంతో.

వేదం యాభైరెండు పన్నాలూ దమ్మిడీ ఖర్చు లేకుండా చదివిన యీ పెద్దమనిషి చివరకు కోర్టు చిక్కుల్లో ఇరుక్కొని సర్వం మంగళహారతి చేసుకుంటాడు. సౌజన్యారావు ఎన్ని మంచి మాటలు చెప్పినా వినకుండా "వెధవముండలకి పెళ్ళి చెయ్యడుపు పోయేకాలం పట్టుకుందేవి పెద్దవాళ్ళకు కూడాను..." అని "నీ ఇంట కోడి కాల్చా...." అంటూ వెళ్ళిపోతాడు. అగ్నిహోత్రావధాని మాటలు, చేష్టలు కొంత నవ్వు తెప్పించే మాట నిజమే. నవ్వుతోపాటు అప్పటి మూఢాచారాలకు ప్రతినిధియైన ఆతని పాత్రపై ఏవగింపూ కలుగుతుంది. తన మూర్ఖత్వంతో కోర్టులవెంట తిరిగి నష్టపోయిన ఆతని అమాయకత్వంపై జాలీ కలుగుతుంది. ఎన్ని చెప్పినా వినని అతని బారికరావుని అవతారంపై రోత కలుగుతుంది.

ఒకరికొకరితో జుట్లు ముడేసి పబ్బం గడుపుకుంటూ బ్రతికే పరాన్నభుక్కు రామప్పంతులు. ఈతను సర్వ దుర్గుణాలకు నిలయం. ఈతనికి పెళ్ళి పెటాకులుండవు. అమాయకురాలైన విధవ మీనాక్షి జీవితాన్ని నాశనం చేస్తాడు. అటు మధురవాణి అనే వేశ్య నుంచుకుంటాడు. తాను చేసిన పనులకు ఫలితంగా కేసులో ఇరుక్కొని మధురవాణి పన్నిన వలలో పడి తన ఇంట్లోకి తానే పోకుండా అవుతాడు. అటు మీనాక్షి తరుముతుంది. మధురవాణి ఇంట్లోకి రానివ్వదు. శిష్యుడు మారువేషంలో పాటపాడుతూ వెక్కిరిస్తాడు. ఈ పరిస్థితిలో పాపం రామప్పంతులు అనిపిస్తుంది. ఈ పాత్ర ఏ కష్టం చేయకుండా, కోర్టు వ్యవహారాలు చూస్తానని, ఆ సాయం ఈ సాయం చేస్తానని అమాయకులను మోసగిస్తూ బ్రతికే పైరవీకార్లకు ప్రతీకలాంటిది. ఈ పాత్రద్వారా కొంత వినోదం అందిస్తూనే సమాజంలో వున్న ఇలాంటివారిని గూర్చి జాగ్రత్తగా వుండమని హెచ్చరించాడు గురజాడ.

గిరీశంతో శ్వాష్టర్గా పిలువబడ్డ లుబ్ధావధాని పేరులోనే హాస్యముంది. పేరుకు తగ్గట్టే అతడు పరమ పిసినారి. ఒక దిక్కు తాను చేసిన నిర్వాకంవల్ల తన కూతురు మీనాక్షి విధవయై ఇంట్లో కూర్చుండి చెడు తిరుగుల్లు తిరుగుతున్నా ఆమె గూర్చి ఆలోచించడీ మూర్ఖుడు. పైగా కాటికి కాళ్ళు చాపుకొని వున్న తాను మరో పెళ్ళి చేసుకోవడానికి సన్నద్ధమవుతాడు. ఆడవేషంలో వచ్చిన కరటకశాస్త్రి శిష్యున్ని పెళ్ళాడి చిక్కుల్లో పడి కేసులో ఇరుక్కొని ఏ మార్గమూ లేక సౌజన్యారావు పంతులుగారి శరణు వేడుతాడు. ఆతని సలహాతో కూతురుకు విధవా వివాహం చేయడాని కొప్పుకుంటాడు. తాను కూడా మారుతాడు.

ఈతని పిసినారితనం, డబ్బుపై వ్యామోహం, ఆ వయసులో పెళ్ళికి సిద్ధం కావడంలాంటి పనులు, సౌజన్యారావు పంతులుగారి మాటలు విని మారడం ఆ పాత్రపై జాలీ, నవ్వూ తెప్పిస్తాయి.

బైరాగుల సంభాషణ, వకీల్ల డబ్బు గుంజేతనం, కొండిం బొట్లు మాటలు నవ్వుతోపాటు ఆ కాలంలోని సాంఘిక పరిస్థితులపై ఏహ్యాభావం కలిగేట్టు చేస్తాయి. ఈ విధంగా ఈ నాటకంలోని ఏ పాత్రను పరిశీలించినా, ఏ సంఘటనను చూసినా, ఏ పేజీ తిరగేసినా ఎంతో కొంత హాస్యం లభిస్తుంది. కాని ఈ హాస్యం కేవలం నవ్వుకోవడానికి మాత్రమే ఉద్దేశించినది కాదు. ఇతర నాటకాల్లోని విదూషక పాత్రలు ఇచ్చే హాస్యం లాంటిది కాదు.... పాఠకులను కేవలం సంతోషపెట్టడానికి మాత్రమే ఉద్దేశించిన హాస్యం కాదు. ఇది మానవ సంఘంలోని అజ్ఞానాన్ని, అసంబద్ధతను ఎత్తిచూపే హాస్యం. సమాజంలోని రుజా కేంద్రాలను పాఠకులకు చూపి ఆలోచింపజేయడానికి ఉద్దేశించిన హాస్యం.

లోకం పోకడలోని అసంబద్ధతను ఎత్తిచూపడానికి వేమన సర్వజ్ఞుడు వ్యంగ్యాన్ని, అధిక్షేపాన్ని తమ కవిత్వంలో సమర్ధవంతంగా ఉపయోగించుకున్నారు. అదేవిధంగా గురజాడ కూడా హాస్యాన్ని తన నాటకంలో ఉయోగించుకున్నాడు. వేమన పద్యాల్లో వున్న హాస్యంలాంటిది గురజాడ కన్యాశుల్కంలోని హాస్యం.

కన్యాశుల్క నాటకంలోని హాస్యం విషాదంతో కూడిన హాస్యం. కరుణార్ద్రతతో నిండిన హాస్యం. ఒక్కమాటలో చెప్పాలంటే కన్యాశుల్క నాటకంలోని హాస్యం తపస్సిద్ధి పొందిన హాస్యం.

## సంప్రదించిన గ్రంథాలు :


1. కన్యాశుల్కం గురజాడ జయంతి పబ్లికేషన్స్.
2. కన్యాశుల్క నాటకకళ : సర్దేశాయి తిరుమలరావు
3. కొడవటిగంటి సాహిత్య సమాలోచన
4. "ఆదివారం" ఆంధ్రజ్యోతి ఏప్రిల్ 10, 1988.
5. ఆదివారం ఈనాడు 1 మే, 1988
6. వేమన భావన డా॥ యస్. గంగప్ప
7. విశ్వ విజ్ఞానదర్శిని నరేంద్రదేవ్




# ఆ "రాజులను" చూచిన కళ్ళతో నన్ను చూడకు!

అశేష జగాలను పరిపాలించు
ఓ రాజరాజా!
సర్వజ్ఞా!
నేను
"బమ్మెర పోతరాజును" కాను
పుణ్యకృతి చెప్పి
నిన్ను మెప్పించటానికి
నీ పాద కమలాలచెంత సమర్పించటానికి!
"కాకర్ల త్యాగరాజును" కాను
మవ్వంపు రాగాలు పాడి
నిన్ను కీర్తించటానికి
నీ అభీష్ట దర్శనభాగ్యం పొందటానికి!
"కంచెర్ల గోపరాజును" కాను
ఘనమయిన గుడిగట్టి
కిమ్మత్తయిన నగలు నాణ్యాలు చేయించటానికి
నీ దయా కలశోదధిలో ఈదులాడటానికి!
"కానుల పుల్లంరాజును" కాను
చిత్ర చిత్ర ప్రభావ అని
నీ గుట్టుమట్టును బట్టబయలుచేసి
నీపై అక్షతలు చల్లటానికి
నీ కటాక్ష "వజ్రం" చిక్కించుకోవటానికి!
గడలెక్కె 'తిమ్మరాజును'
గంతులేసే 'తిమ్మరాజును' - అసమర్ధుడను!
"భోజనరాజును",
"పోతురాజును" - బద్ధకుడను!
సంసారమే బెల్లమని భ్రమలోనున్న
"మదనకామరాజును" - అంధుడను!
"పాపాల భైరవరాజును!"
ఓ దేవా!
ఆ "రాజులను" చూచిన కళ్ళతో
నన్ను చూడకు!
ముక్కు విఱవబుద్ధి పుడుతుంది!
మొట్టబుద్ధి పుడుతుంది!
తన్నబుద్ధి పుడుతుంది!
చంపబుద్ధి పుడుతుంది!
ఓ ప్రభూ!
నువ్వు
"గుండెలు తీసిన రాజువు" కాకు!
నిప్పులు రాల్చకు!
నన్ను
"ఓ కోరలూడిన నాగరాజుగానో"
"ఓ దీన గజరాజుగానో" - భావించు
నువ్వు 'మహారాజువు' గదా!
తలచుకుంటే కరుణకు కొదవా!
మోక్షం నాకు కొంగు బంగారం కాదా!

శ్రీ కె. కిశోరుబాబు; శ్రీ కె. అశోకుబాబు



# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్ఠమైన ఆముదము




శుద్ధి చేసినది, వాసన లేనిది.

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

**Amrutanjan Limited** 

755-TG

శ్రీ పెద్దమఠం ప్రభులింగదేవర

# జనసంస్కృతి శిలాశాసనములు సామెతలు

ఆంగ్లమున సామెతను ప్రోవెర్బ్ అందురు. ఎ జనరల్ ఆర్ కామన్ సేయింగ్ అని దీని అర్థము. హిందీ భాషలో 'కహవత్' అనియు, కన్నడ తుళు భాషలలో గాదె అనియు వ్యవహారమున గలదు. తమిళులు 'పళమొళి' అనియు, మలయాళీలు "పళంచోళ్" అనియు సామెతను వ్యవహరింతురు.

సామెత అను పదమునకు సమానమైన పదము కన్నడమున 'సామతి'. ఈ సామతి 'సామ్యతె' నుండి ఉద్భవించినట్లు తెలుగులో 'సామ్యము'నుండి సామెత ఆవిర్భవించి యుండవచ్చును. "సామ్య" శబ్దమునకు 'సామత్య' అను అసాధు రూపమేర్పడి 'సామెత'గా మారి ప్రచారమున నున్నదని డాక్టరు చిలుకూరి నారాయణరావుగారి అభిప్రాయము. ఈ పదము 15వ శతాబ్దములోని వరాహ పురాణమున తొలిసారిగా ప్రయోగింపబడినది.

'నానుడి', 'లోకోక్తి', 'శాస్త్రము', 'జనశ్రుతి' అని సామెతకు పర్యాయపదములు. శాస్త్రమను పదము రాయలసీమ ప్రాంతములందును, ఉత్తర కర్నాటక ప్రాంతమునందును వ్యవహారమున గలదు. రాయలసీమ, ప్రజలు ముఖ్యముగా అనంతపుర మండలివాసులు 'అదేమో శాస్త్రం చెప్పినట్లు' అని ప్రయోగింతురు.

కన్నడిగులు 'అదేనో శాస్త్రాపిహేళ్తారల్లా హంగే' అని ప్రయోగింతురు. 'అదేమో కథ చెప్పినట్లుగా ఉందే నీ వ్యవహారం' అని కూడ అనంతపుర మండల ప్రజల వాడుక. ఈ కథ కూడ సామెతకు దగ్గరిదే ననిపించును. సాటువ, సాటవ, చాటువ, చాటవ అని నెల్లూరుసీమ వాసుల వ్యవహారమున గలదు. సాటి అయినదే సాటువ అని డా॥ దివాకర్ల వేంకటావధాని గారి అభిప్రాయము.

నిత్య జీవితమున మానవుడు సుఖదుఃఖములను రెండింటిని సమానముగా అనుభవించును. తాను అనుభవించినదానిని ఇతరులకు ఉపదేశాత్మకముగా, సందేశ రూపమున చిన్న వాక్యమున అందించును. అల్పాక్షరములలో అనల్ప భావమును, అనుభవమును సూటిగా చెప్పగలుగును. సామ్యతను చూపించి 'సామెతగా' రూపొందించును. జీవితము అనుభవముల కూడలి. అట్టి అనుభవముల ఆధారమున జనించినదే సామెత. కేవలము అనుభవములనుండే కాక కథలలోని నీతులనుండి కూడ ఏర్పడిన సామెతలెన్నియో ప్రచారమున గలవు. ఉదాహరణమునకు "పోరు నష్టి పొందు లాభము" 'ఇద్దరూ పోట్లాడితే మూడోవాడికి లాభము ఇత్యాదులు

శ్రీమతి దుర్గా భాగవత్ "సంగ్రహముగా ఒక అప్రియమైన సత్యమును చెప్పెడి సారభూతమైన వాక్యము సామెత"గా పరిగణించినారు. సత్యమును చెప్పుట మాత్రము అసంపూర్ణము. అది అతిశయోక్తిగా, అలంకారికముగా చెప్పబడునని ఆమె అభిప్రాయపడినారు.

సామెత నిట్లు నిర్వచింపవచ్చును. అనుభవయుక్తము, నీతిబోధాత్మకము, ఉపదేశాత్మకము, సూత్రబద్ధముగా నుండి సంక్షిప్త వాక్యరూపమున నుండెడి లోకుల చమత్కారోక్తియే సామెత. ఒకే సామెతలో ఈ నియమములన్నియు ఉండి తీరవలసిన అవసరము లేదు.

సామెతలోని వస్తువు సమాజము, ప్రజాజీవనము మాత్రమే. ప్రతి సామెతమీద పరిసర ప్రభావము, సన్నివేశముల కాంతి స్ఫుటముగా కన్పించును. సత్యప్రాధాన్యము, వాస్తవికత దీని లక్ష్యము. అస్వాభావికత మచ్చుకైనను కన్పింపదు.

సామెతకు కొన్ని లక్షణములను చెప్పవచ్చును. అవి 1. సంక్షిప్తత 2. వాక్యరూపమున నుండుట 3. అనుభవ రూపమున నుండుట 4. తీక్ష్ణత 5. వివేకవంతమైన అంశమును కలిగియుండుట 6. సార్వజనీనత 7. ఉపదేశాత్మకత 8. వాచ్యార్థముకంటే వ్యంగార్థమునకే ప్రాధాన్యమిచ్చుట.

## వర్గీకరణము :

సామెతలను ప్రధానముగా రెండు విధములుగా విభజింప వచ్చును. (1) అకారాదిగా వర్గీకరించుట. ఇది రెండు విధములు. 1. సామెతలోని మొదటి మాటను గ్రహించి అకారాదిగా అమర్చుట. 2. సామెతలోని ముఖ్యమైన పదమును తీసికొని అకారాదిగా కూర్చుట. (2) సామెతలోని వస్తువును ఆధారముగా చేసికొని వర్గీకరించుట. ఇది మొదటి పద్ధతికంటె శాస్త్రీయ మైనది. మొదట ఒక వస్తువును అకారాదిగా కూర్చి, పిమ్మట ఒక్కొక్క వస్తువునకు సంబంధించిన సామెతలను అకారాదిగా కూర్చవచ్చును.

వార్న రాబర్ట్ దశమాంక పద్ధతిని ఉపయోగించి వర్గీక రించినాడు. ఈ వర్గీకరణ విధానమున మొదటిసంఖ్య ప్రధాన విషయమును రెండవ సంఖ్య ఆ విషయములోని ఆ సామెత స్థానమును తెలియజేయును. మూడవసంఖ్య ఈ ఉపవిభాగము లోని ఆ సామెత స్థానమును తెలియజేయును. ఇంకను విశేషము లను చెప్పదలచిన, దానిని చివర సంఖ్యద్వారా చూపవచ్చును. ఇట్టి విభజన వలన సామెతల పరస్పర సంబంధమును, వైవిధ్యములను, ఉద్దేశ్యమును వెంటనే గుర్తింపవచ్చును.

సామెతలను 'మౌఖిక ప్రచారము'లని 'గ్రంథస్థము'లని రెండు విధములుగా వర్గీకరింపవచ్చును. ధూర్జటి, శ్రీనాథుడు, పెద్దన, నాచన సోమన, వేమన, పాల్కురికి సోమన - మున్నగు కవులు తమ తమ గ్రంథములలో సామెతలను పేర్కొని యున్నారు. వీనిని మనము 'గ్రంథస్థ సామెతలు'గా పేర్కొన వచ్చును. గ్రంథస్థము కాని సామెతలు మౌఖికములే. ఈ విభజన అంతగా సరియైనది కాదనిపించును. విషయ ప్రాధాన్య మును బట్టి సామెతలను వింగడించుట సమంజసము.

1. సూత్రపు సామెతలు :

ఇట్టి సామెతలలో సామెతలు సూత్రప్రాయముగా నుండు టయే గాక ఏదైనను ఒక విషయమును స్థాపించుట జరుగును.

ఉదా:- దుష్టుని చూచి దూరంగా ఉండు, విధి నిషేధ సామెతలు కూడా ఇందే చేరును.

నిషేధము - ఏడ్చేదాని ఎడమ చేతిక్రింద, కొట్టేవాని కుడిచేతి క్రింద కూర్చొనరాదు.

2. ఉపమాన రూపక సామెతలు :

ఏదో ఒక పోలికను కలిగి 'అన్నట్లు' అట్లు అను ప్రయోగములతో కూడియుండును.

ఉదా:- ఆడలేక అంగణం వంకర అన్నట్లు.

3. నీతిబోధక సామెతలు :

ఇట్టి సామెతలలో నీతి ప్రధానము. కథలలోనుండి కూడ ఇట్టి సామెతలు పుట్టి ప్రచారమున గలవు.

ఉదా:- పులిని చూచి నక్క వాత పెట్టుకొన్నదట.

4. పౌరాణికపు సామెతలు :

రామాయణ, భారత, భాగవతములకు సంబంధించిన సామెత లనేకము ప్రచారమున గలవు.

ఉదా:- రాత్రంతా రామాయణము విని రామునికి సీత ఏమి కావాలని అడిగాడట.

5. ప్రశ్నార్థరూపక, ప్రశ్నోత్తర సామెతలు :

ఈ రకమైన సామెతలలో ప్రశ్నతో కూడిన సామెతలే కాక, ఒకరు ప్రశ్న వేసినట్లు మరియొకరు సమాధానము చెప్పి నటువంటి సామెతలును కలవు. ప్రశ్నోత్తర సామెతలను సంవాద రూపక సామెతలనియు, సంభాషణాత్మక సామెతలనియు పిలువవచ్చును.

ఉదా:- ప్రశ్నార్థ రూపక సామెత — ఆవు నలుపైతే పాలు నలుపా?

ప్రశ్నోత్తర సామెత - తాత! పెండ్లాడుతావా? అంటే నాకెవరిస్తారురా అబ్బాయి అన్నాడట.

6. సాంఘికాచార వ్యవహారములు, విశ్వాసములు, నమ్మకములు :

సంఘములోని ఆచార వ్యవహారములను, వారి విశ్వాసము లను, తెలియచేసెడి సామెత లనేకము కలవు. పండుగ పబ్బము లకు సంబంధించిన సామెతలును ఇందే చేరును.

ఉదా:- 1) చితికితే అతకదు.

2) అశ్వత్థ ప్రదక్షిణము చేసి కడుపు పట్టుకొని చూచుకొన్నదట.

3) ఉంటే ఉగాది, లేకపోతే ఏకాశి ఇత్యాది.

7. హాస్యపు సామెతలు :

పరిహాసములతో, ఆక్షేపణలతో కూడియుండును. వృత్తుల వారిని, జాతులవారిని, ఎగతాళి చేసెడి సామెతలు కూడా ఇందే చేరును.

ఉదా:- 1) ఆరునెలలు సాము చేసి మూలనున్న ముసలిదాన్ని కొట్టాడట.

2) బాపన సేద్యం - బాలవైద్యం.

3) తల్లి పుస్తె బంగారమైనా కంసాలివాడు దొంగిలించక మానడు.

4) దేవుడు వరమిచ్చినా పూజారి వరమీయడు.

8. వ్యవసాయ సంబంధపు సామెతలు :

మన దేశము వ్యావసాయిక దేశము కనుక ఇట్టి సామెత లనేకము జానపదుల నోళులలో నలిగిపోయినవి. ఏకార్తె వర్షము ఏయే పంటలకు అనుకూలమో కాదో అను విషయములు ఇట్టి సామెతలలో తెలియచేయబడి యుండును. రైతును గూర్చి కొన్ని సామెతలు ప్రచారమున గలవు.

ఉదా:- 1) స్వాతివాన ముత్తెపువాన.

2) అశ్వని కురిస్తే అంతా నష్టము.

3) రైతు దున్నితే రాజులకు అన్నము.

9. శబ్దాలంకార సామెతలు :

ఇట్టి సామెతలు ప్రాసలు, అనుప్రాసలు, యమకము మున్నగువానితో కూడి వినసొంపుగా నుండును.

ఉదా:- 1) సామెత లేని మాట ఆమెత లేని ఇల్లు.

2) అన్ని దానముల కంటెను నిదానమే ప్రధానము.

శబ్దాలంకార సామెతలే కాక ఉత్ప్రేక్ష, అత్యుక్తి ఉపమానములతో కూడిన సామెతలు అనేకములు కలవు.

ఉదా:- 1) సాయబు గడ్డముకాలి ఏడుస్తుంటే బీడీ అంటించు కుంటా తాలు అన్నాడట.

2) ఏనుగు తినేవానికి పీనుగులు పిండాకూడు.

ఉపమానపు సామెతలనే "పోలిక సామెత" లనుట కూడ కలదు. ఒక వస్తువును మరియొక వస్తువుతో పోల్చిచెప్పుట ఇందలి విశేషము.

ఉదా:- 1) గానుగ రోలులాంటి నడుము.

2) తల ముగ్గుబుట్టలాగుంది.

పై సామెతలలో నడుమును గానుగరోలుతోను, తలను ముగ్గుబుట్టతోను పోల్చుటను గమనింపవచ్చును. ఈ రెండు సామెతలను శ్రీ వేకుమళ్ళ కామేశ్వరరావుగారు పేర్కొని యున్నారు.

పైన తెల్పిన విధముగా సామెతలు ప్రధానముగా పది విధములు, ఇవియేకాక ఈ క్రింద కనబరచిన సామెతలు కూడ ప్రచారమున గలవు.

అశ్లీలపు సామెతలు :

ఇవి కేవలము పామరజన వ్యవహారమున చోటు చేసి కొనినవి.

ఉదా:- మొగునికి నేస్తగాడు, ఆలికి మిండగాడు, ఇత్యాది.

న్యాయ సామెతలు :

సాక్షులను, వాదులను న్యాయా న్యాయములను దృష్టి యందుంచుకొని బయలుదేరినట్టివి.

ఉదా:- సాక్షి కాళ్ళు పట్టుకోవడంకన్నా వాది కాళ్ళు పట్టుకోవడం మంచిది.

వైద్యపు సామెతలు :

ఇట్టి సామెతలు తెలుగుదేశమున అధిక ప్రచారమున నున్నట్లు కన్పించవు. కన్నడ దేశమున ఇవి అధికము.

ఉదా:- 1) రోగి కోరింది పాలే, వైద్యుడు చెప్పిందీ పాలే.

2) ఉల్లి చేసిన మేలు తల్లి అయినా చేయదు.

స్థల నామములు :

స్థల విశేషములనుబట్టి కూడ సామెతలు బయల్దేరినవి.

ఉదా:- 1) హంపీకి పోయేదానికన్నా కొంపలో ఉండేది మేలు.

2) రామేశ్వరానికి పోయినా శనేశ్వరం తప్పలేదు.

గృహజీవన సంబంధిత సామెతలు :

గృహ జీవనమునకు సంబంధించిన సామెతలన్నియు ఇందు చేరును.

ఉదా:- 1) అత్త చచ్చిన ఆరు మాసాలకు కోడలి కంట్లో నీరు వచ్చిందట.

2) అల్లుడు అలిగితే కూతుర్ని తీసుకుపోతాడు.

మాదిరి సామెతలు :

ఆంగ్లభాషలో ఇట్టి సామెతలు కోకొల్లలు. పదబంధపు సామెతలను శ్రీ వేకుమళ్ళ కామేశ్వరరావుగారు పేర్కొని యున్నారు. ఆంగ్లభాషలో పదబంధపు సామెత లనేకము.

శ్రీ పేకుమళ్ళగారు ఇట్టి సామెతలకు ఉదాహరణగా "పట్టపగలు చుక్కలు పొడవడం" "కళ్ళల్లో దుమ్ము కొట్టడం" ఇత్యాదు లను ఉదాహరించినారు నిజమున కివి జాతీయములే కాని సామెతలు కావు.

ఏ ఒకరో ఒకర్తో 'అన్నాడు' 'అంది' అను సామెతలకు "ఉక్తి సామెతలని శ్రీ పేకుమళ్ళవారి అభిప్రాయము వీనికి

ఉదా:- 1) కూడు గుడ్డ అడగకపోతే బిడ్డను సాకినట్టు సాకుతా నన్నాడు.

2) అయ్యో! పోతున్నావా? అని పచ్చాకు పండాకును చూసి అంది. ఇత్యాది.

జానపద గేయ కథలలో సామెతలు అధికముగా చోటు చేసికొనినవి.

ఉదా:- 1) పేదవాని కోపము పెదవుల తీట -కాటమరాజు కథ

2) కడవడంత గుమ్మడి కత్తిపీటకు లోకువ—గాంధారి కథ

స్త్రీల నోములలో సామెతలు అనేకము చోటు చేసికొనినవి.

ఉదా:- 1) ఇంట గెలిచి రచ్చ గెలువు.

2) ఇల్లు అలకగనే పండగయ్యిందా. మొ॥

అన్యభాషా సంపర్కము వలన కొన్ని క్రొత్త సామెతలు బయలుదేరును. వేరు వేరు దేశములవారి వేషభాషలు వేరయినను, అనుభవములు మాత్రము అందరివియును సమానమే. సన్ని వేశములో, వస్తువులో, పోలికలో వైవిధ్యము కన్పించినను వారి స్వభావము, అనుభవము మాత్రము ఒక్కటే. కనుకనే ఇతర దేశముల లేదా ఇతర ప్రాంతముల సామెతలలో కూడ ఒకే అర్థమును సూచించెడి సామెతలెన్నో కలవు. ఈ సారూప్యము ఒక ప్రాంతమునుండి మరియొక ప్రాంతమునకు, ఒక దేశమునుండి మరొక దేశమునకు వలసపోయిన ప్రజలనుండి కాని, అన్యభాషా సంపర్కము వలన కాని ఏర్పడియుండవచ్చును.

ఉదా:- ఇంగ్లీష్: కట్ యువర్ కోట్ అకార్డింగ్ టు ది క్లాత్.

హిందీ: ఉతనే పాఁవ్‌పసారియే జితనీ చాదర్ హోయె.

కన్నడం: హాసిగె ఇద్దష్టు కాలుచాచు.

తెలుగు: పిండి కొలది రొట్టె.

సామెతల వయస్సును నిర్ణయించుట అంత సులభము కాదు. కేవలము గ్రంథస్థమయిన సామెతలను కవికాలాదులతో నిర్ణయింపవచ్చును. కాని మౌఖిక ప్రచారమున నలిగిపోయిన సామెతల కవికాలాదులను నిర్ణయింపలేము. చారిత్రక గాథలలో కన్పించెడి సామెతలను, పురాణ గాథలలోని సామెతలను పరిశీ లించి కొంతవరకు వాని వయస్సును నిర్ణయింపవచ్చును. కాని, అనుభవపూర్వకములు, నీతిబోధాత్మకము లయిన సామెతల కాలమును నిర్ణయించుట కష్టసాధ్యము.

సామెతలు సందేశాత్మకములు. ఉపదేశాత్మకములు కూడ. ఒక విషయమును మరియొక విషయముతో పోల్చి మంచి చెడ్డలను, సత్యాసత్యములను చెప్పుటకు తయారయినట్టివి. ఎన్నడో జరిగిన విషయమును జ్ఞప్తి యందుంచుకొని, ప్రస్తుత విషయమును దానితో పోల్చి చెప్పుటవలన ఎదుటివానికి తాను చేయుచున్న పని సమంజసముగా నున్నదా లేదా అని తర్కించు టకు సామెతలు వీలు కల్పించును. తాను చేయుచున్నది తప్పుగా తోచిన సక్రమ మార్గమున నడచుటకు సామెతలు తోడ్పడును.

సామెతల పరిశోధనాత్మ కాధ్యయనము వలన ప్రజల జాతీయ, సాహిత్య, సాంస్కృతిక స్వరూపమును వారి అనుభ వములను క్షుణ్ణముగా తెలిసికొనుటకు వీలగును. ఇవి చారిత్రక సంఘటనలను వెలికితీయుటకు, స్థల విశేషములను పరిశీలించుటకు భాషాశాస్త్రజ్ఞునకు భాషాశాస్త్ర విశేషములను పరిశోధించుటకు, సాంఘిక శాస్త్రజ్ఞునకు సమాజమునందలి సంప్రదాయములను పద్ధతులను గుర్తించుటకు దోహద మొనరించును.

కన్నడిగులు సామెతను వేదముతో పోల్చినారు. "గాదె వేదక్కె సమాన" (సామెత వేదమునకు సమానము) అనియు, "వేదసుళ్ళాదరూ గాదె సుళ్ళల్ల" (వేదము అసత్యమయినను సామెత అసత్యము కాదు) అనియు, "జనవాణియే జనార్దనవాణి" అనియు కొనియాడినారు. ఆంధ్రదేశమున కూడ 'సామెత లేని మాట ఆమెత లేని ఇల్లు'గను 'ప్రజల మాటే ప్రభువు కోట' గను తన ఉనికిని సామెత స్థిరపరచుకొనినది.

సామెతల భాండాగారం జనాంగపు విశ్వకోశము. ఇవి ప్రజా సంస్కృతియొక్క శిలా శాసనములు. వానిపై ఐతిహాసిక, సామాజిక, పౌరాణికాంశములు చెక్కబడినవి అను మాటలు గమనింపదగినవి.

# అడవులు పిలిచాయ్

## శ్రీ పాలడుగు వెంకటేశ్వరరావు

'చాలా సంవత్సరాల తర్వాత మనం తిరిగి కలుసుకోవటం నాకు చాలా సంతోషంగా వుంది- ఎప్పుడెప్పుడు నిన్ను కలుస్తానా అని ఎదురు చూస్తున్నాను. నీ కోసం స్టేషన్‌కి వస్తాను.' అని రాసింది రాజ్యం, నా ఉత్తరానికి సమాధానంగా.

ఆ ఉత్తరం చూసి నాకూ సంతోషం కలిగింది ఎన్ని సంవత్సరాల తరువాతా, మేం కలుసుకోవటం!? ఇప్పుడు రాజ్యం హైదరాబాద్‌లో ఇన్‌కంటాక్సు ఆఫీసర్‌గా పనిచేస్తూ వుంది. నేనూ, ఇండియాలో అన్ని వూళ్ళూ దాదాపు తిరిగినట్లే! చివరికి ఈనాటికి నాగపూర్ చేరుకున్నాను. నాన్నగారు ఎప్పటినుండో మధ్యప్రదేశ్‌లో భారీఎత్తున కంట్రాక్టులు చేస్తూ అక్కడే స్థిరపడినంత పనిచేసారు. ఏదో మా చదువుల నిమిత్తం కొన్ని సంవత్సరాలు మేము-నాన్నగారు తప్ప-హైదరాబాద్‌లో వున్నాము. మేము అంటే ముగ్గురమే. అన్నయ్యా నేనూ; మా కోసం మా అమ్మా! ఆ రోజుల్లో మా ఇంటి ప్రక్కన వుంటుండేవారు రాజ్యంవాళ్ళు. రాజ్యం స్కూల్లో, కాలేజీలోనూ నా క్లాసుమేట్. చాలా స్నేహంగా వుండేవాళ్ళం. వాళ్ళ నాన్నగార్కి మంచి బిజినెస్ వుండేది. వాళ్ళ ఇంట్లో రెండు కార్లు ఉండేవి. లైట్ గ్రీన్ ఫియట్ వాళ్ళ నాన్నగారు వాడేవారు. మస్టర్డ్ కలర్ పద్మిని ఫియట్‌ని వాళ్ళ అన్నయ్య వాడుకునేవాడు; రాజ్యం అన్నయ్య పేరు రమేష్; ఒక్కడే కావటంవలన, అతన్ని ఇంట్లో అపురూపంగా చూసుకునేవారు!

గ్లాస్కో లాల్చీ వేసి తెల్లని పైజమాతో గిరజాల జుట్టుతో అందంగా సుకుమారంగా ఉండేవాడు రమేష్. తెల్లవారుఝామున వాళ్ళ ఇంట్లోనుండి 'ఫ్లూట్'మీద మధుర మధురమయిన సంగీతం వినవచ్చేది. రమేష్‌కి సంగీతంలో ప్రవేశం ఉంది. అతను కవిత్వం కూడా రాస్తాడని రాజ్యం చెప్పింది.

ఒకసారి అందంగా 'బైండ్' చేయబడిన పుస్తకం తెచ్చి ఇచ్చింది రాజ్యం. 'నీకు పుస్తకాలంటే ఇష్టం కదా. ఇది చూడు' అని నవ్వింది. నాకు సాహిత్యంమీదా, సంగీతంమీదా ఆ రోజుల్లో చాలా ఇష్టం వుండేది. ఆ పుస్తకం చదివాను. మళ్ళీ చదివాను! మళ్ళీ మళ్ళీ చదివాను!! అంత బాగుంది కవిత్వం! సున్నితమయిన భావనలు. ఉదాత్తమయిన వస్తువు. అందమయిన ప్రతీకలు. మనస్సుని పట్టి నడిపించే శైలీ విన్యాసం. మాతృమూర్తి తన బిడ్డని గురించి వెలిబుచ్చిన ఆలోచనాత్మకమయిన ఆలోచనా పరంపర. చిన్న చిన్న మాటలలో గొప్ప కవిత్వం!

'చాలా బాగుంది!' అన్నాను రాజ్యంతో, ఒకనాడు.

'కవి ఎవరనుకున్నావు?' అంది నవ్వుతూ రాజ్యం.

'ఎవరు?' అని అడిగాను; ఎవరో తెలిసినా కూడా ఆ అవకాశాన్ని రాజ్యానికి ఇవ్వాలని నా ముచ్చట.

'రమేష్ చౌదరి మా అన్నయ్య. అతనికి కవిగా మంచి పేరు ఉంది!' అంది, గర్వంగా, రాజ్యం.

'ఆ సంగతి నాకూ తెలుసు. అయితే అతనే ఇతనని ఇప్పుడు తెలిసింది. కంగ్రాట్స్' అన్నాను.

'థాంక్స్!' అంది. రాజ్యం చూపుల్లో గర్వం! కృతజ్ఞతలు కూడా.

'ఇది రమేష్ సుమారు ఏడెనిమిది సంవత్సరాల క్రిందట రాసినది! ఆ తర్వాత అతను రాసిన కవిత్వం మరో రెండు సంపుటాలుగా వస్తుంది.' అంది రాజ్యం, సంతోషంగా.

మేము ఇంటర్ రెండవ సంవత్సరంలో ఉండగా రాజ్యం అతని రెండవ సంపుటాన్ని నాకు తెచ్చి యిచ్చింది. కుతూహలంగా చదివాను నా కుతూహలం పెరిగింది. మళ్ళీ చదివాను. కౌమారదశలో అడుగుపెడ్తూ వున్న ఒక భావుకుని మనోగతావస్థ రకరకాలుగా చిత్ర విచిత్రంగా విన్యసీకరించబడిన తీరు అద్భుతం! ఆకాశంలో రంగులు. ఎగిరే పక్షులు. ఉదయసంధ్య వేళ ప్రకృతికన్య విలాస లాస్యాలు. రంగుల ప్రపంచపు ఉదాత్త స్వరూప చిత్రణలు. మార్మిక సంకేతాలు. బావుంది. చాలా బాగుంది.

ఆ మాటే చెప్పాను రాజ్యానికి. మర్నాడు - 'అన్నయ్య నీకు తన థాంక్సు చెప్పమన్నాడు' అని వచ్చి చెప్పింది. 'నేను చెప్పిందంతా అతనికి నీవు చెప్పావా?' అని అడిగాను. 'అవును అందులో తప్పేముంది? నీ అభిప్రాయం తెలుసుకుని అతను చాలా ఆనందించాడు' అంది రాజ్యం.

నేనూ రాజ్యం 'కాంపిటీటివ్ ఎగ్జామ్సు'కి కూర్చోవటానికి ఢిల్లీ వెళ్ళినపుడు రాజ్యం నాకు అతని మూడో పుస్తకాన్ని ఇచ్చింది. 'అన్నయ్య నీకు ఈ పుస్తకం ఇమ్మన్నాడు' అంది.

'ప్రియమయిన నళినికి అభిమానంతో—' అని రాసి ఆటోగ్రాఫ్ చేసి ఇచ్చాడు. నాకు సంతోషంగా అనిపించింది. ఆ పుస్తకమూ అద్భుతంగా ఉంది! నడకలో పూపు వుంది. భావనలో గొప్ప ఉదాత్తత. ఆ భాష అందమయిన 'పదాల పందిరి' అన్పించింది. యవ్వన ప్రాదుర్భావ దశలో ఉన్న ఒక కవి కుమారుడు, తన ప్రియురాలిని వస్తువుగా చేసుకుని అల్లిన శృంగార కర్పూర కవిత్వ కళిక. నా మనస్సు ఉక్కిరిబిక్కిరి అయింది. ఆలోచనలు జుంటి తేనియలను జుర్రిన భ్రమరముల లాగా నన్ను ముట్టడించాయి. అందమయిన అనుభూతి నన్ను ముప్పిరిగొన్నది. ఆ కవిత్వంలో సిన్సియారిటీ ఉంది, సీరియస్‌నెస్ ఉంది. పఠితను ఆలోచింపజేసే లక్షణం ఉంది జిగీ, బిగీ, మెలీ పుష్కలంగా ఉన్నాయ్. ఉదాత్తమయిన 'ప్రేమయిక తత్త్వం' యొక్క గొప్పదనం నిబిడీకరింపబడి ఉంది. యవ్వన విలాస విన్యాసాల చిత్రణ ఉంది. అద్భుతమయిన చిత్ర విచిత్ర విభావరి! మళ్ళీ మళ్ళీ చదువుకుని ఆనందించాలన్న ఆశతో ఆ పుస్తకాన్ని జాగ్రత్తగా దాచుకున్నాను. ఆ పుస్తకం నన్ను ఎంతగా ప్రభావితం చేసిందంటే- నేను చదివిన అతని ఆ మూడు పుస్తకాలమీదా, 'రివ్యూ'లు రాశాను. ఆలిండియా సర్క్యులేషన్ గల ఒక పత్రికలో అవి ప్రముఖంగా ప్రచురింపబడినాయ్. రమేష్‌కేగాక, ఆ 'రివ్యూ'లు నాకూ ఎంతో పేరు ప్రఖ్యాతుల్ని తెచ్చిపెట్టినయ్.

కాని ఆ సమయానికి మా దార్లు విడిపోయేయ్. 'కాంపిటీటివ్ ఎగ్జామ్స్'లో సెలెక్టయి నేనూ రాజ్యం ఆఫీసర్లుగా దూరప్రదేశాల్లో కుదురుకున్నాము. నాకు థాంక్సు చెపుతూ రమేష్ రాసిన సుదీర్ఘమయిన ఉత్తరం రాజ్యంద్వారా నాకు అందింది. దానికి వెంటనే సమాధానం రాసాను. అంతే.

ఆ తర్వాత కొన్ని సంవత్సరాలు ఇట్టే గిర్రున తిరిగిపోయేయ్. ఈ జీవితాలు ఇంతేగదా!

నాగపూర్‌నుండి నన్ను మోసుకుని వచ్చిన ఎక్స్‌ప్రెస్ ట్రెయిను సికిందరాబాద్‌లో మెల్లగా ఆగుతూవున్న ఆ క్షణాలలో ఆ ఆలోచనలు నా మస్తిష్కాన్ని నింపాయ్. అనుభూతులు రాజ్యం చేసాయ్.

ప్లాట్‌ఫారం మీద నా గురించి ఎదురుచూస్తూ వుంది రాజ్యం. రాజ్యంలో పెద్ద మార్పు ఏం లేదు. ఇదివరకు ఎలా ఉందో ఇప్పుడూ దాదాపు అలాగే ఉంది. కారులో రాజ్యం ఇంటికి వెళ్ళాం. అంతులేని కబుర్లు. రాజ్యం భర్తా సికింద్రాబాదులోనే రైల్వేలో ఆఫీసరుగా చేస్తున్నారుట! ఆయనా ఆదరంగా పలకరించారు రాజ్యానికి ఇద్దరు పిల్లలు. ఒక బాబు. పాపా. ఇద్దరూ పబ్లిక్ స్కూల్లో చదువుతున్నారు. వెన్నముద్దల్లాగా ముద్దుముద్దుగా ఉన్నారు. మావారూ సెంట్రల్ గవర్నమెంట్‌లో క్లాస్ వన్ ఆఫీసరు - నాగపూర్‌లోనే జాబ్. మాకు ఇంకా పిల్లలు లేరు. ఇది నా సంగతి.

రాజ్యం వట్టి కబుర్ల పోగు. ఎన్నో విశేషాలు చెప్పింది. అంతా తన గురించీ, తన జాబ్ గురించీ, పిల్లల గురించీనూ. నేను ఉన్న ఆ నాలుగు రోజులూ సెలవుపెట్టి నన్ను తనే స్వయంగా తిప్పింది రాజ్యం. ఆప్యాయంగా అభిమానంగా నీడలాగ నావెంటే ఉంది. నేను హైదరాబాద్ వచ్చిన పని పూర్తయింది నాలుగు రోజులలో.

ఆ సాయంత్రమే నా నాగపూర్ ప్రయాణం. రిజర్వేషన్స్ అయ్యాయి. సమయం చకచకా గడిచిపోతూ ఉంది. నీళ్ళు పల్లానికి పారినట్లు జరజరా జారిపోతూ ఉంది టయిమ్.

రాజ్యంనుండి, అంతసేపూ నేను ఎదురుచూసిన ఆ 'విశేషాలు' వాటంతట అవి వచ్చే సూచనలే లేవు! అందుకే— నేనే అడిగేశాను. సమయం మించిపోతే అవకాశం చేయిజారిపోతుంది.

'రమేష్ పుస్తకాలు ఇంకేమీ రాలేదా?'

ఆ ప్రశ్నకి, రాజ్యం మొహం సడన్‌గా రంగు మారింది. 'వచ్చాయ్' అంది; తల వంచుకుంది నేను నవ్వి - 'ఏవీ? నాకు 'చూపించనేలేదు.' అన్నాను. 'చూపించటానికి ఏముందీ?' లైబ్రరీ గది'లో అడుగు రాక్‌లో ఉన్నాయి. చూస్తూ ఉండు. ఇదుగో-నేను ఈ పని కాస్తా ముగించి వెంటనే వస్తాను.' అంది రాజ్యం. కుతూహలాన్ని ఆపుకోలేక నేనే వెళ్ళి ఆ పుస్తకాల రాక్ దగ్గరకి నడిచాను. దుమ్ము గొట్టుకుని ఉన్న ఎరరంగు అట్టగల ఆ పుస్తకాల్ని తీసాను. దుమ్ము దులిపి వాటిని

చదవటంలో మునిగిపోయాను, ఆ క్షణం. కుతూహలపు శక్తి అటువంటిది.

ఈ ప్రపంచ సమాజం, వ్యవస్థా, పద్ధతులలోని పాక్షికత్వం, దౌర్జన్యం, దగా, కుట్ర, దోపిడీ, బానిసత్వం, అన్యాయం, మోసం, తిరుగుబాటూ, రక్తారుణిమలూ, దగాపడిన తమ్ముళ్ళూ - మొదలయిన సబ్జక్టులమీద, కేకల్తో, బూతులతో, గర్జనలతో, అసభ్య పదజాలాలతో నిండిన - విరగగొట్టబడిన పంక్తులు! నగ్నంగా చెప్పబడిన ప్రపంచతత్వం. హింసను ప్రేరేపించటం ఎక్కువ! వాటిల్లో ఉద్దేశ్యం ఉంది. వాదన ఉంది. నిజాయితీ ఉంది. రెచ్చగొట్టటం ఉంది - లేనిదల్లా ఒక్కటే!

ఆ పుస్తకాల్ని తిరిగి రాక్ లో యధాస్థానంలో ఉంచేసాను. చేతులు దులుపుకున్నాను.

నా వెనకాలనుండి నిట్టూర్పు వినవచ్చింది, సుదీర్ఘంగా. వెనక్కి తిరిగి చూసాను — అక్కడ రాజ్యం నిలబడి ఉంది. రాజ్యం మొహం వివర్ణమయిఉంది రాజ్యం కళ్ళల్లో తడి! బాధ

'ఎంతసేపయిందీ, వచ్చి?' అన్నాను; అది గమనించనట్లు - 'చాలాసేపయింది' అని, తల దించుకుని, వచ్చి నా ప్రక్కన కూర్చుంది, రాజ్యం. వ్యధ నిండిన నిశ్శబ్ద సంగీతం. తెగిన అనుభూతి తీగల ఆలాపన. మా ఇద్దరిమధ్యా గంభీర నిశ్శబ్దం! ఆ నిశ్శబ్దంలో ఎన్నో ఎన్నెన్నో ఊసులు.

'ఈ పుస్తకాల్ని నీకు చూపించకూడదనుకున్నాను. నువ్వే అడిగి, చూశావు' రాజ్యం అంది నిష్ఠురంగా. నిజమే. నేను చేసిన 'ఈ పని' వలన నా మనసులోని ఒక సుందర చిత్రపటం విధ్వంసమయింది. నా మనస్సు పాలలో ఉప్పురాయి వేసిన విధంగా అయింది. స్వయంకృతం!

'ఇప్పుడు రమేష్ ఏం చేస్తున్నాడు? ఎక్కడ ఉన్నాడు?' అన్నాను. నా గొంతు బరువుగా ఉంది. రాజ్యం నావంక రోషంగా చూసింది — 'ఇంకా నీకు తృప్తిగా లేదా?' అంది. చాలాసేపు మా ఇద్దరిమధ్యా మౌనం రాజ్యం చేసింది. ఆ నిశ్శబ్దంలో ఎన్నో అగాధాలు! మరెన్నో సుడిగుండాలు!! చాలాసేపయాక చివరికి — 'రమేష్ అన్నీ వొదిలేసి, ఇప్పుడు అడవుల్లో తుపాకులు పేలుస్తున్నాడు' అంది రాజ్యం; నోరు పెగల్చుకుని - 'తను చేస్తున్న పనిలో రమేష్కి తృప్తి ఉంది. అంకితభావం ఉంది' అంది. ఆలోచనల తీరు తెన్నుల్లోని వైరుధ్యం వలననే మా ఇద్దరికీ ఆ వెలితి. కవిగా అతనికి ఇపుడు నేను గుర్తింపు ఇవ్వకపోవచ్చును. కాని వ్యక్తిగా రమేష్ సమాజాన్ని గురించి పెట్టుకున్న ధ్యేయానికీ, అతని ప్రయత్నానికీ నా అభినందన ఉంటుంది. ఈనాటి ఈ రమేష్ ఆనాటి మా రమేష్ కాడే! - అన్న ఆవేదనే రాజ్యమూ నేనూ - లోనయిన ప్రస్తుత స్థితికి కారణం! వర్గవైరుధ్యానికి మేము తలవంచటం, ప్రాకృతిక వైచిత్ర్యం!

# అదీ రహస్యం

## శ్రీ భాగవతుల సుబ్రహ్మణ్యం

నా కలం
త్రిశూలం.
ప్రతి మోనా
ఓ
ప్రక్రియ
కాలవాలం.

ప్రతిపోటూ
పిడుగుపాటు.
అయినా,
పిడి
ఒక్కటే!
పునాది
పాతదే!

అదే
సాంప్రదాయం
నా
సాహిత్య నిత్య
నూతనత్వ
రహస్యమదే!

శ్రీ తురగా కృష్ణమూర్తి

# ఏఱువభీమ - మైలమభీముల వ్యక్తి నిరూపణము

వెనుకటి నా వ్యాసములో మైలమభీముని ప్రసక్తిని తెచ్చి శ్రీ తేరాల సత్యనారాయణ శర్మగారిచ్చిన వంశవృక్షమునుబట్టి ఏఱువ తొండయరాజులుంగారి సంతతిలో రెండవ కుమారుడు భీమనయే మైలమభీముడని నిర్ధారణ చేయ యత్నించితిని. దాని కవరోధముగ వేములవాడ భీమకవి - మైలమ భీమునిపై చెప్పె నన్న చాటువు నిలిచియున్నది. ఆ పద్యము

ఉ॥ వేములవాడ భీమకవి వేగమె జూచి కళింగగంగు తా
సామము మాని కోపమున సందడిదీరిన రమ్మ పొమ్మనెన్
మోమును జూడ దోషమిక ముప్పదిరెండు దినంబు లావలన్
జామున కర్థమందతని సంపద శత్రులజేరు గావుతన్॥

శాపానుగ్రహ పటువును, తూపాడెడి కవులనెత్తి ఱంపమునా ప్రసిద్ధికెక్కిన వేములవాడ భీమకవి ఆగ్రహావేశమున పలికిన పలుకులు శాపమై రాజకళింగగంగు రాజ్యము శత్రుల హస్తగతమై పోవ నాతడు బికారియై తిరుగాడుచుండెనట!

ఈ పద్యమున వేములవాడ భీమకవి పేరు, కళింగగంగు పేరు నొకటవచ్చుటచే ఈ పద్యము ప్రామాణికమైనదే గాని చాటుపద్య సరళిలో తేలికగా తీసివేయదగినది కాదు. అయిన రాజకళింగగంగు యెవరో, ఆతని కాలమేదో తెలిసికొన్న భీమకవి కాలము తద్వారా మైలమభీముని కాలము నెరుంగ వచ్చును.

కళింగము నేలిన రాజులలో గంగరాజులు సుప్రసిద్ధులు. వారిలో నీ కళింగగంగు అనంతవర్మ చోడగంగు మహారాజని చెప్పబడుచున్నది. అట్టి అనంతవర్మ చోడగంగుని భీమకవి శాపానుసారమేమి, ఇతర రాజకీయ పరిణామ పర్యవసానముగా నేమి పదవీభ్రష్టుని జేసినవారెవ్వరు?

ఈ ప్రశ్నలకు సదుత్తరములీయ ప్రయత్నింతము. ఆ యత్నములో రాజ కళింగగంగు రాజ్యకాలమున జరిగిన పరిణామముల పరిశీలింపవలసియున్నది.

రాజరాజ దేవేంద్రవర్మ కళింగమునకు రాజై క్రీ॥శ॥ **1069** నుండి **1077** వరకు **8** సంవత్సరములు రాజ్యముచేసి మరణించెను. అప్పటికి అనంతవర్మ చిరు ప్రాయమువాడై యున్నను అభిమాను లాతని సింహాసన మెక్కించిరి. ఈతని మంత్రి రాయన ప్రెగడ. అనంతవర్మ రాజ్యమునకు వచ్చిన **27** సంవత్సరములకు అనగా క్రీ॥శ॥ **1096**లో కళింగముపై దండెత్తివచ్చి విజయనగరము వరకు జయించి శాసనములు నిలిపిపోయిన కులోత్తుంగచోళునికంటె ముందుగ గంగైకొండ చోళుడు కళింగముపై నెత్తివచ్చి గంగానదీ తీరమువరకు సాగి అటనుండి వెనుకకు మరలెను. ఈ రెండు సందర్భములలో అనంతవర్మ చేయునది లేక యూరకుండవలసిన వాడాయెను. క్రీ॥శ॥ 1115 ప్రాంతమున కులోత్తుంగచోడుడు కరుణాకరుడను సైన్యాధిపతిని సప్తకళింగముపై దాడిచేయం బంపెను. ఈ దాడి నెదుర్కొనలేక సప్తకళింగనాధుడుత్తరముగా పలాయనము చిత్తగించెను. సైన్యమును ఆతవినే అనుకరించెను. ఈ సప్త కళింగనాధుడే అనంతవర్మ యని కొందరనుచున్నారు. కరుణాకరుడు సప్తకళింగనాధుని రాజ్యమెల్ల కొల్లగొట్టి, ఆతని సంపద నెలనాడిసికొని, అడవి ఏనుగుల కొన్నింటిని బంధించి, తన ప్రభువున కర్పింపఁ దీసికొనిపోయెను. కరుణాకరుని దండయాత్రా వృత్తాంతము యదార్థమై యుండదని కొందరు చారిత్రకులు తలంచుచున్నారు.

క్రీ॥శ॥ **1115**లో కలచురి రత్నదేవుడు అనంతవర్మపై నెత్తివచ్చి త్రికళింగముల జయించెను. కళింగమునకు

పశ్చిమోత్తరమున నున్న ఘుముసూరు, బాడువాయనుమన్నె సంస్థానాధిపతులు అనంతవర్మ కెదురుతిరిగిరి. పశ్చిమోత్తర పూర్వరాష్ట్రముల గోల్పోయిన అనంతవర్మ "జోగి" యాయెను. ఇదియే వేములవాడ భీమకవి శాప ఫలితమని కొందరి మతము.

వేములవాడ భీమకవి పదకొండవ శతాబ్దములో జీవించి యుండెను. కొంతమంది విమర్శకులు భీమకవి చాళుక్య చొక్క రాజు చాగిపోతురాజు, మైలమభీమన మొదలగువారిపై చెప్పిన వని ప్రచారము గాంచిన పద్యములను పురస్కరించుకొని భీమ కవి పదమూడు పదునాల్గు శతాబ్దములందు జీవించియుండునని వాదించుచున్నారు. (ఆంధ్ర కవుల చరిత్ర) కాని అది సత్యము కాజాలదు. ఏమనగా - భీమకవి రాజ కళింగగంగుపై చెప్పిన పద్యమునందు వారిరువురి పేర్లు కానబడుచున్నవి. ఈ పద్యము నందు వ్యవహరింపబడిన రాజ కళింగగంగు అనంతవర్మయే గాని మరియొకరు కారు. కళింగము నేలిన రాజులలో "గంగు" అను పేరు కలవాడింకెవరులేరు. అనంతవర్మయే "చోడగంగు" అను పేరు కలిగియుండెను ఈతడు చిరకాలము కళింగదేశమును యేలియుండుటచేత ఈతనికి "కళింగగంగు" అను పేరే స్థిర మయ్యెను. కాబట్టి వేములవాడ భీమకవి ఈతనికి సమకాలికుడై యుండెననుట కాదనరాని సత్యము. అని శ్రీపాద గోపాల కృష్ణమూర్తిగారు "కళింగదేశ సంచిక" (పేజీ 321_322)లో వ్రాసియున్నారు.

చోడగంగు క్రీ॥శ॥ 1077 నుండి 1140 వరకు కళింగ మును పాలించి మరణించెను. కాన వేములవాడ భీమకవి గూడ నాకాలమువాడే యని చెప్పక తప్పదు. ఆ విధిని ఆతడు 11లేక 12వ శతాబ్దివాడగుచున్నాడు.

మైలమ భీమునిపై భీమకవి చెప్పెనన్న చాటువు "గరళపు ముద్ద" అను పద్యమునుబట్టి చూడ మైలమ భీముడు వేములవాడ భీమకవి నమకాలీనులు అనవలసి వచ్చును. అప్పుడు అనంతవర్మ చోడగంగు వేములవాడ భీమకవి, మైలమభీము లొకేకాలమున జీవించియున్నట్లును అది 11, 12వ శతాబ్ది ప్రాంతమైనట్లు తేలుచున్నది.

మైలమభీముని తల్లి మైలమ. తమ వంశములో పేరెన్నిక గన్నవాడని, తమవాడేనని పూసపాటివారు చెప్పుకొనుచున్న మైలమ భీముడు తండ్రి దేవవర్మ. ఈతని భార్యపేరు తెలియదు. మైలాంబ అగునో! కాదో! స్పష్టముగ తెలియదు. పూసపాటి కవుల రచనలలో నామె పేరు వినవచ్చుటలేదు. ఏఱువ తొండయ రాజు కుమారుడని చరిత్రకెక్కిన మైలమ భీముడు (పూసపాటి) దేవవర్మ కుమారుడగు మైలమభీమన యెట్లగునో తెలియకున్నది.

ఈ మైలమ భీముడు (పూసపాటి కవుల ప్రస్తావనలో నున్నవాడు)

సీ॥ ఆ భీమ భూమీశుడని లోన తనచేత
మును పరాజితుడయ్యు మూర్ఖవృత్తి
దండ భల్లాణుండు దండెత్తి వచ్చిన
వానితో నెదిరించమాని యాత్మ
బొడమియో తన మహాద్భుత చర్య చూపనో

తన శరీరమును తానే మూడు తుండెములుగ ఛేదించుకొని "పరిచ్ఛేది" యాయెనని పూసపాటి తమ్మిరాజు వ్రాసియున్నాడు. ఈ దండ భల్లాణుండు పశ్చిమ చాళుక్య చక్రవర్తి ఆరవ విక్ర మాదిత్య చక్రవర్తిగాని వేరొకడుగాడు. ఏఱువ చోడవంశము వారెల్ల పశ్చిమ చాళుక్య ప్రభువుల సామంతులే! వారికిని, వారి ప్రభువులకు మధ్య వైరముప్పతిల్లు అవసరమేమియో తెలియ రాదు. మైలమ భీమన దండభల్లాణు (ఆరవ విక్రమాదిత్య చక్రవర్తి) నోడించి తరుముట యెప్పుడు జరిగినదో, మరల నాతడు మైలమభీము జయింప మరలివచ్చెనో తెలియరాదు; కాని మైలమ భీమన ఆరవ విక్రమాదిత్య చక్రవర్తి కాలమువాడని తేలుచున్నది. ఆరవ విక్రమాదిత్యుడు క్రీ॥శ॥ 1076_1126 మధ్యకాలమున యున్నవాడు గాన మైలమ భీముడు 11, 12 శతాబ్దుల మధ్యవాడని దీనివలన గూడ తెలియుచున్నది. అయితే ఈ సంఘటనగూర్చి చరిత్రలో యెక్కడను ప్రస్తావింపబడినట్లు కానరాదు.

అన్నింటినిమించి నటశ్రీ దువ్వూరి జగన్నాధశర్మగారు తమ "మాధవవర్మ - మైలమభీమ" యను గ్రంధమున వెల్వ రించిన అభిప్రాయము వింతలలోకెల్ల పెనువింతగ నున్నది.

వేములవాడ భీమకవి శాపమువలన రాజ్యమును జయించి సంపదలెల్ల కొల్లగొట్టి దేశ బహిష్కృతునిగా రాజ కళింగగంగు నొనర్చినవాడు మైలమ భీముడని, తిరిగి వేములవాడ భీమకవి ఆశీర్వాదమున చోడగంగు భీమునిపై దండెత్తిపోయి, యుద్ధములో నాతని దండనాధుడు "రాయల" గెల్చిపోయిన సంపదలెల్ల తిరిగి పొందుట జరిగినదని వ్రాసియున్నారు. రాజ కళింగగంగు తిరిగి లబ్ధరాజ్యుడగుట యెన్నడో కూడ తెలియదు. రాజకళింగగంగుని రాజ్యచ్యుతికి కారకులెవరో తెలియదు. తిరిగి యాతడు జయించి, అపహృత రాజ్యము నెవరికడనుండి లాగుకొనెనో తెలియదు.

ఆతడు పట్టము గట్టుకొన్న సజ్జనగర మెక్కడున్నదో! ఈ ప్రశ్నలకు సరియగు సమాధానములు పొందవలసియున్నది.

ఈతని శత్రువు మైలమ భీమన. ఈ భీమనయే మొదటి భీమకవి శాపప్రకారము రాజ కళింగగంగుని రాజ్యము నాక్ర మింపగల్గెను. ఆ పిమ్మట శాపనివృత్తి పద్యప్రకారముగ గాని పగటి వేషధారిగాగాని వేయి గజంబులుండిగాని, రాజకళింగగంగు "ఈ మైలమ భీమునోడించెను. ఇదివరకు తన చేతిలో ఓడి పోయిన రాజ కళింగగంగు మరల తనమీదకు అకస్మాత్తుగా ధాడి వెడలివచ్చిన మైలమ భీమన తాను కళింగగంగు చేతిలో చావ కుండ తన ఖడ్గముచేత తానే నఱకుకొనెను. అందువల్ల పూసపాటివారి పిడుగు భీమరాజు "పరిచ్ఛేది" "భీమరాజు" అనిపించుకొనెను. ఈ అర్థము రెండు మాటలలో "వాశిష్ట ఛప్పన్నము నందు రాచిరాజుచేత చెప్పబడినది" అని నటశ్రీగారుట్టంకించియున్నారు.

ఈ వ్రాత యెంత హాస్యాస్పదమో, చారిత్రక విషయ విరుద్ధమో, అసమంజసమో, వెనుక ముందు లాలోచింపక ఊహా గాన వినోదముగ వ్రాసిన వ్రాతయో చదువరు లూహించుకో గలరు.

ఇంతటితో బోక నటశ్రీగారు క్రీ॥శ॥ 1000 నుండి 1400 మధ్యకాలముననే సాహిత్యపోషణ జరుగలేదు. కవులందరు నిరుత్సాహముతో క్రుంగిపోయిరి. ఈ 400 సంవత్సరముల కాల వ్యవధిలో గాంగరాజులు, కళింగ గజపతులు, ఉత్కళేశులు తమ పాలనము సాగించినను సాహిత్యపోషణ పొంతబోక నిర్లిప్తతతో ప్రవర్తించిరి. అందుచే తుదకా కాలమున నొక్క శతకమైన యుద్భవించలేదు" అని తెలుపుచు "భీమరాజు (మైలమ భీమ రాజు) మంత్రియు, సేనాధిపతియునగు వత్సవాయి రాయజు పోషణమున భీమకవి "రామగోపాల చరిత్ర" (ద్వర్థి కావ్యము) నిర్మాణము జరిగెనవియు, ఈ "రాయలే" చోడగంగు నెదిర్చి మొదట విజయము సాధించి, పిదప సజ్జాపురముకడ గంగు చేతిలో నోటమి చవిచూచి, చోడగంగునకు పునఃరాజ్యప్రాప్తి నొనగూరెనని వక్కాణించినారు.

"ఔను" "కాదను" రీతిగ నడచిన ఈ యుదంతముతో తలదూర్చి డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు వేములవాడ భీమ కవి కాలము క్రీ॥శ॥ 1327-1400గా నిర్ణయించి సమస్యను పూర్తిగా క్లిష్టతరమొనర్చి విడిచిరి.

పైన నడచిన చర్చవలన మైలమ భీముడు - వేములవాడ భీమకవి సమకాలీనుడని అంగీకరించిన 11, 12 శతాబ్దములవాడగు చున్నాడు.

ఇక ఏఱువ భీముని విషయము. ఆతడు మైలమ భీముడని చెప్పు విషయమును పరామర్శింపవలసి యున్నది.

అనదేవచోడుని రాజమహేంద్రవర మ్యూజియము శాసనము, చోడభక్తిరాజు కంద్వకొలను శాసనమునుబట్టి "ఏఱువ భీము"ని వంశవృక్షము ఈ క్రిందివిధముగా నున్నది.

xxx + అన్నెమాంబ
|
ఏఱువభీమ + ప్రోలాంబిక
|
దామన్నపాల + లక్ష్మి
|
సోమభూపతి + సూరాంబిక
|
గంగాధరుడు + ఇరుగాంబిక
|
భక్తిరాజు లేక కామరాజు + అన్నెమాంబ
|
అనదేవుడు + ఇరుగాంబిక
|
వీరభద్రుడు

అనదేవచోడుడు క్రీ॥శ॥ 1414లో మరణించెను. తరము నకు 30 సంవత్సరములు లెక్కచొప్పున "ఏఱువ భీముడు" క్రీ॥శ॥ 1234-1264 మధ్యకాలము వాడగుచున్నాడు.

కాకతి గణపతి క్రీ॥శ॥ 1198లో రాజ్యమునకు రావలసి యున్నను 10 సంవత్సరముల కాలముపాటు యాదవరాజుల బందీగనుండి పిదప విముక్తుడై క్రీ॥శ॥ 1208లో సింహాసన మెక్కెను. ఆ సంవత్సరమునుండియే గణపతి త్రిలింగ రాజ్య సుస్థిరతకు విస్తరణకు తీవ్ర ప్రయత్న మొనరింపసాగెను. భిన్న భిన్న ప్రాంతముల పాలించు పెక్కు సామంతుల నోడించి వశవర్తులుగ జేసికొని రాజ్యవిస్తరణ గావించెను. ఆ యుద్య మముతో నొక భాగము క్రీ॥శ॥ 1212లో ప్రారంభించిన తూర్పు దేశ దండయాత్ర అది క్రీ॥శ॥ 1225నాటికి ముగిసెను.

ఆ పిదప క్రీ॥శ॥ 1249లో దక్షిణదేశ దిగ్విజయయాత్ర సంకల్పించెను. అంతకుపూర్వమే అనగా క్రీ॥శ॥ 1217 నాటికి గంగయ సాహిణి కాకతి గణపతిచే నోడింపబడి, ఆతని వశవర్తియై, సైన్యాధ్యక్ష పదవి, రాజప్రతినిధి పదవి, "బాహత్తర నియోగాధిపతి" పదవి గణపతిచే పొంది సర్వాధికారములు చలాయించుచుండెను.

గంగయ కాకతి గణపతి సామంతుడగుటతో నాతని క్రింద నున్న తెనుగు చోడభూపతులు పెక్కుమంది గణపతి దేవుని సామంతులైరి. ఆ ప్రకారమే క్రీ॥శ॥ 1234-64 మధ్యనున్న "ఏఱువ భీముడు" కాకతి గణపతి సామంతుడై యుండి, ఆతని విజయ యాత్రలలో ప్రముఖపాత్ర వహించియుండెను. ఈతని యుద్ధకౌశలము గూర్చి గల చాటువు యిట్లు వర్ణించుచున్నది.

ఉ॥ పన్ని తురంగంబునకు బక్కెర వెట్టిన వార్త చారువే
విన్న భయంబునం గలిగి వేసట నాటనే చక్రకోట్రముమన్
మన్నియ పట్టణంబులును మాంగెణ(మంధ్యన)వేంగి కళింగ లాదిగా
నన్నియు నొక్క పెట్టెగసె నేఱువ భీమనృపాల ధాటికిన్

గణపతి సేనానులు గోన గన్నారెడ్డి ప్రభృతులు ఏఱువ తొండయరాజు నోడించి, ఆతని రాజ్యమును కాకతీయ సామ్రాజ్యములో కలిపిరి. అటులనే గంగయ సాహిణిపై విజయము సాధించి గణపతి దత్తమండలములో నాతని అధికారము క్రింద గల సామంతులందరిని కాకతి సామంతులుగ జేసికొనెను. ఆ కారణమున ఏఱువ భీముడు కాకతీయ సామంత సేనాధిపతులలో నొకడై గణపతి యుద్ధయాత్రలో ప్రముఖపాత్ర వహించెను. కాకతీయ సైన్యముతో నాతడు వేంగి, కళింగ, చక్రకొట్యాది రాజ్యములపై దండెత్తిపోయి ఆయా రాజన్యుల చికాకుపరచి తన ప్రతాపమును వెల్లడించెను.

అనదేవచోడుని రాజమహేంద్రవర శాసనమువలన "ఏఱువ భీముడు" అన్నెమాంబ సుతుడగుచున్నాడు కాని మైలమాంబ సుతుడు కాడు. అందుచే వారలిర్వురు వేరు వేరు వ్యక్తులుగాని ఒక్కరుగారు. మైలమభీముడు 11, 12 శతాబ్దముల వాడైన ఏఱువ భీముడు 13వ శతాబ్దము వాడగుచున్నాడు. ఆ రీతిగ చూచినను వారు భిన్నవ్యక్తులుగాని ఒకరుగాదని రూఢి యగుచున్నది.

కొందఱు ఏఱువ తొండయ రాజున కిద్దరు భార్యలని వారు మైలమ, అన్నెమాంబలని, నల్లభీమ, మైలమభీమ, ఏఱువ భీమ నామములొకే వ్యక్తి సంకేతములనియు వానికి ఉపపత్తుల జూపుచున్నారు. ఎంత వాదించిన నలుపు నలుపేగాని తెలుపు కాదు గదా! అన్నెమాంబ సుతుడు అన్నెమ భీముడగును గాని మైలమ భీముడు కాడు గదా! ఒకవేళ మైలాంబకే నల్లభీమ, మైలమభీమ, ఏఱువభీము లుద్భవించి యుండిరనుకొనుటకు రాజమహేంద్రవర శాసన మడ్డువచ్చుచున్నది. కాకున్న మైలమ సుతులు ముప్వురు మూడు విధములుగా సంబోధింపడవలసిన యవసరమేమి? అందొకనికి తల్లి పేరుంచి, తక్కినవారికి వివిధ నామములు ప్రసాదించుట యేమి? అదియుగాక నల్లభీముడు ఏఱువ భీముడు ఒక్కరు కాదని పైన వివరింపనైనది గదా!

ఏతావత్ ఏఱువ భీముడు, మైలమ భీములొక్కరు గారు. ఏఱువ భీముడు అన్నెమాంబ సుతుడు. మైలమ భీముడు మైలమాంబకా పుత్రుడు. ఏఱువ భీముడు క్రీ॥శ॥ 1234-64 మధ్యకాలమున ఏఱువ పాలించినవాడు. కాకతి గణపతి దేవుని సామంతుడు. మైలమ భీముడెవరి సామంతునిగ నుండనియ్యక కొనక తన దేహమును తానే మూడుతునకలు గావించుకొన్నవాడు.

ఏఱువ భీముని సప్తాంగముల నొడిసికొన్న కాకతి గణపతి సేనాని మలచెల్ల వంశోద్భవుడు అని రెడ్డి సంచిక (50 పేజీ)లో గలదు.

## అభాగ్య ప్రేమ లాలితిలో...

కన్నీటి తెరలలో
కలల పల్లకి నిలిచిపోయింది
కలతల చెరలో
కన్నియ కళావిహీనలా మిగిలిపోయింది
ఆశల బోయీలు మూగవోగా
ఆశయాల మజిలీలు మూతపడగా
పయనించే పాదాలు కూలబడగా
పదమని పలికే గుండెధైర్యం మూలపడగా
గత స్మృతులలో దగ్ధమౌతూ
చేదు భవితకు దగ్గరౌతూ
నా ప్రేయసికి ద్రోహం చేసాను
అనురాగ జగతికే కళంకినైనాను.
ఆత్మీయుల ఆత్మతృప్తికని
అభిమానించేవారి ఆనందానికని
అంతరాత్మను అణువణువునా రగిలించి
అధరాల దాటున అనుభూతి కార్చిచ్చులో భస్మమై
విలపించి
ఆ చెలి జాలి చూపులలో నా చితిని పేర్చుకొని
ఆ హృదయాగ్ని ఘోషలో ఈ జీవత్వాన్ని
కాల్చుకొని
నా తప్పిదానికి ప్రాయశ్చిత్తం చేసుకొంటాను
నా భావుకతకు ఉరి పోసుకొంటాను.
ఎంత ప్రేమో తెలియదుకాని
ఈ సిలువను వెన్నెల చెలువ కలువను చేసింది
నా ఇలవేలుపుగా నిలిచింది!
ఎంత ఆరాధనో తెలియదు కాని
మండే గుండెలో నిండుగా నిండి అమృతాన్ని
కురిపించింది
నాకోసం కర్పూరమై కరిగిపోయింది!

## అన్యాక్రాంతి గీతం

అన్యమనస్కంగా
అనాలోచితంగా
అన్యాక్రాంతిలో అనుభూతి
అవ్యక్త మధుర భావగీతి!

సెగలు గ్రక్కే పాదరసాన్ని
మింగుతున్నట్లు మవునం
రంపు పెట్టే ప్రాణాన్ని
హైరాణ పెడుతూ నిశ్శబ్దం!

మనసు తిన్న చేదు నిజం
ఎంత తియ్యని స్వప్నం
మాసిపోని ఆ మధురగాయం
మయిమరిపించే కొత్త జ్ఞాపకం!

అంతః చేతనంలో
అజ్ఞాతంగా తిరుగుతున్న ఆనవాళ్లు
ఆర్తి వెళ్ళబోసుకునే
అనాథ కోరికల అరమరికలు!

ఎంతసేపయినా సరే
ఈ నిర్వేద పారాయణంలో ఎంత హాయి
ఏ అమృతమూర్తో ఎదను మీటి
అపురూపంగా వినిపిస్తున్న సన్నాయి!

ఈ నిర్లిప్తంలో ఎంత చైతన్యం
ఈ జాగృతంలో ఎంత జడత్వం
వేదనా వేదితాలు జీవపరమాత్మలు
ద్వైతాద్వైత నివేదితాలు జీవితాలు!

డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

## డాక్టర్ సూర్యదేవర రవికుమార్

# తుమ్మలవారి తొలి రచనలు

అభినవ తిక్కన, తెనుగులెంక, కళాప్రపూర్ణ శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు బహుగ్రంథకర్తలు, జగమెరిగిన కవి పుంగవులు. క్రీ.శ. 1919 నుండి, అనగా వారి 18వ ఏటనుండి వారు తమ రచనలను వెలువరించినప్పటికి, 1929 నవంబరు 'భారతి' సంచికలో వారు ప్రకటించిన 'ఆత్మార్పణము' లోకంలో వారి తొలి రచనగా ప్రసిద్ధి చెందింది ఆత్మార్పణ రచనకు పూర్వము వారు వ్రాసిన కొన్ని కవితలు ఆ తరువాత వారు ప్రకటించిన ఖండకావ్య సంకలనాలలో పునర్ముద్రితమైనాయి. 'ఆత్మార్పణము'నకు పూర్వము వారు రచించి ప్రకటించిన రచనలను గూర్చి తెలుసుకొందాము.

గుంటూరు జిల్లాలోని తమ స్వగ్రామమైన కావూరుకు రెండు క్రోసుల దూరంలో గల చెఱుకుపల్లి గ్రామంలో క్రీ.శ. 1910లో జరిగిన రాజమన్నారుగారి అవధానాన్ని చూచిన తొమ్మిది సంవత్సరాల వయసుగల సీతారామమూర్తి, ఆ అవధానంలో ఇవ్వబడిన సమస్యను, దానికి అవధానిగారు చేసిన పూరణను శ్రద్ధగా విని గుర్తుంచుకొని అదే సమస్యను అదే భావంతో తమ సొంత భాషలో పూర్తిచేసి తమ మొదటి పద్యాన్ని రచించారు. ఆ పద్యమిది.

ముమిపున్ రాత్రిచరుల్ విమానములపై మోదమ్మునెక్కి మా
ఘనమున్ జూడుమటంచు నాఘనముపైఁ గాసేపు వర్తిల్లి యా
వెనుకన్ నేలకు వ్రాలి యాళ్ళ నణఁపన్ విల్లందుకొన్నట్టి యీ
ఘన కమ్మయ్యెను విష్ణుదేవుఁ డహహా! చోద్యమ్ముగా నర్తకిన్.

ఈ పద్యములోని నాల్గవపాదమే సమస్య.

ఈ పద్యమును రచించునాటికి వారి వయసు తొమ్మిది సంవత్సరాలే అయినా ఆ వయసుకే వారికి అమరకోశము, ఆంధ్ర నామ సంగ్రహము, భాగవత భాగాలు కంఠస్థాలు. ఆ తర్వాత మడి కొకపూటగా, బడికొకపూటగా వారి చదువు సాగింది. తెలుగుభాషలో మరికొంత ప్రావీణ్యత సంపాదించి ముందుగా కొన్ని శతకాలు వ్రాశారు. అందులో మొదటిది

రామ శతకము

"ఇది గుంటూరుజిల్లా రేపల్లె తాలూకా కావూరు గ్రామ నివాసియగు తుమ్మల సీతారామమూర్తి చౌదరిచే రచియింపఁబడి మ.రా.శ్రీ తుమ్మల నాగయ్య చౌదరి, సుఖవాసి గోపాలరాయ చౌదరిగార్ల ద్రవ్యసహాయము వలన బెజవాడ వాణీ ముద్రాక్షర శాలయందు బి. కే. స్వామిచే ముద్రింపఁబడియె 1919'. అని రామశతక ముఖపత్రమున కలదు. 13-9-1919 నాటి దీని పీఠికలో తుమ్మలవారు 'నేను కవిత్వము చెప్పనారంభించి యిప్పటి కేడు సంవత్సరములైనది. అనగా నా పదునొకండవయేటనే యలవడినది. నాటినుండియు నేటివరకేవియో చాటుపద్యములతో గడపితిని గాని గ్రంథమొక్కటియు వ్రాయలేదు.' అని వ్రాసినదానినిబట్టి వారి తొలి గ్రంధము ఇదే అని స్పష్టము. ఈ గ్రంధ ముద్రణకు ద్రవ్యసహాయము చేసిన పై ఇరువురు దీని రచనకు ప్రేరకులు.

కావూరులో గల శ్రీరామ భజన మందిర స్థితుడగు శ్రీరాముని గూర్చి వ్రాయబడిన శతకమిది.

శ్రీకర చరణ! కృపా ర
త్నాకర! ముఖబింబ జితసుధాకర! వరద
శ్రీకరశయన! పితామహ
నాకరపుణ వినుత! సద్గుణాకర రామా!

'రామా' అన్న మకుటము గల ఈ శతకమును శ్రీకారముతో, ద్విప్రాసతో ప్రారంభించారు తుమ్మలవారు.

తుమ్మలవారిలో గల ఒక విశేష గుణం వారి రచనలకు స్పష్టమైన రచనాకాలమును తెలియజేయటం. ఇది వారి తొలి రచనయైన రామశతకమునుండి ప్రారంభం కావటం విశేషము.

పదునెనిమిది వందల నలు
బది యొకటవ యేట శాలివాహనశక మం
దిది సిద్ధార్థిని వ్రాసితి
ముదమారగ నీదు కరుణ ముద్దులరామా.

శాలివాహన శక సంవత్సరము **1841** అనగా క్రీ.శ. **1919.**

"మన చౌదరి యతిప్రాసములకై భంగపాటు చెంది తల గోకికొను"వాడు కాదని, "అర్థమునుబట్టి పదములు, పదములలో లీనమైనరీతిని యతిప్రాసములు సునాయాసముగ, నప్రయత్నముగ, స్వచ్ఛందముగ వచ్చిచేర"గా కవిత్వము వ్రాయువాడని కట్టమంచి రామలింగారెడ్డిగారు తుమ్మలవారి 'ఆత్మకథ'కు వ్రాసిన 'తిలక రచన'లోని మాటలు ఈ తొలి రచనను చదివినప్పుడు కూడ గుర్తుకువస్తాయి.

పేరునకిది రామశతకమైనప్పటికి, పూర్తిగా రామభక్తిమయము కాదు. ఇది ప్రధానముగా నీతిబోధాత్మకమైనది. నీతితోపాటు జీవిత తత్వాన్ని, లౌకిక సత్యాలను విప్పిచెపుతున్నది.

నారదునివలె గానచాతుర్యము గలవాడను కానని, శివునివలె రామనామసార మెరుగజాలినవాడను కానని, మునులవలె అధిక భక్తి గలవాడను కానని అంటూ 'ఇక నేఁ జేయున దేమన నొక దండము పెట్టుటయె' అని ఎంతో వినయంగా నిగర్వంగా శ్రీరాముని భజించారు తుమ్మలవారు.

ఒరునింట కాపురము ఖల
నరసేవయు వైరము దనజ్ఞాతుల తోడన్
శరనిధి సంచారంబును
నిరతము సేయంగ దగదు నిక్కము రామా.

అంటూ నీతిని,

కాయమును నిల్పగా దర
మే యెవ్వరికైనఁగాని మేదినిలో నీ
కాయము నదీతటస్థం
బై యలరు మహీజమట్టి దారయ రామా.

అంటూ తత్వమును,

మన్నింతు రాలుబిడ్డలు
నన్నలుఁ దమ్ములును ద్రవ్య మార్జించెడు దా
కన్నా! దరిద్రదశలో
కన్నులఁ జూడరు తలంపగా జయరామా.

అంటూ సత్యాలను ప్రబోధిస్తున్నదీ శతకము.

'ఎన్నఁదగు తారకాతతి నెన్నఁదగు తుషారకణము' లంటూ పలుతావుల ప్రాచీనకవుల ననుకరించుచు 'దాసుని తప్పులు దండముతో సరి" వంటి లోకోక్తులను ప్రయోగిస్తూ తమ తొలి రచనను మనోహరముగా తీర్చిదిద్దారు 18 ఏళ్ళ వయసులో తుమ్మలవారు.

అచ్చయిన రామశతకమును చూచి తుమ్మలవారి మరొక మిత్రులు నాగళ్ళ శాతయ్య చౌదరిగారు కావూరులోనే గల రామలింగేశ్వర స్వామివారి కంకితముగా ఒక శతకమును వ్రాయుడని ప్రోత్సహించగా తుమ్మలవారు వ్రాసిన శతకము

రామలింగేశ్వర శతకము

ఇది 'రామలింగేశ్వరా' అన్న మకుటముతో మత్తేభ శార్దూల విక్రీడిత వృత్తాలతో సాగిన ప్రౌఢ రచన. దీనిని ఆనాటి చెఱుకుపల్లి సబ్ రిజిష్ట్రారుగారైన భువనగిరి కోదండపాణిగారు పరిష్కరించగా 1919 డిసెంబరులో తుమ్మలవారు ప్రకటించారు. దీని రచన రెండు నెలలలో పూర్తయినది. ఇందులో భక్తికంటె నీతిబోధ లధికము. రామాయణ, భారత, భాగవత కథాఘట్టాలను దృష్టాంతాలుగా ఉటంకిస్తూ ఎన్నో నీతులు కూర్చబడ్డాయి.

తన పూర్వార్జితమైన పాపఫలమున్ దా వెన్క జన్మంబునం
దనఘా! పొందక తీరదేరికిని దా నా వాలినిం గూల నే
సిన పాపంబున రాఘవుండు శబర శ్రేష్ఠాస్త్రపాతంబునన్
దనువుం బాయడె కృష్ణజన్మమున శ్రీదా! రామలింగేశ్వరా!

పరకాంతాసక్తి పలుమార్లు ఖండించబడింది. సుప్రసిద్ధ ప్రాచీన నీతిపద్యాలు కొంత ప్రౌఢంగా పునఃసృష్టి చేయబడ్డాయి.

తనకేనాఁడు సుభోగభాగ్యములు ప్రాప్తంబౌనొ యానాఁడె వ
చ్చును బిల్వం బనిలేకయే గడువడిన్ జుట్టంబు లెల్లన్నఁ జె
ర్వునకున్ నీరముజేర వాన గుఱియన్ బూర్ణంబుగా భేకముల్
ఘన మోదంబున వచ్చి చేరవె? శుభాంగా! రామలింగేశ్వరా!

'ఎప్పుడు సంపద గలిగిన' అనే సుమతీశతక పద్యం పై పద్యానికి మూలమని వేరే చెప్పనక్కరలేదు. తుమ్మలవారి కవితాభ్యాస కృషికి ఈ శతకం ఒక చక్కని నిదర్శనం. చిన్న చిన్న పదాల కూర్పుతోపాటు ఏకసమాసంగా పద్యాన్ని నడిపే నేర్పు కూడా ఈ శతక రచనలో సాధించారు తుమ్మలవారు.

శ్వేతక్ష్మాధర శీతభూధర శరజ్జీమూత కంజాత సం
జాతాబ్జాత ముఖీ సితాబ్జ మిహికా జైవాతృకాదిత్యభూ
జాతవ్యోమధునీ పటీర దరకాశ వ్యాళదుగ్ధార్ణవ
శ్రీతన్వీ సిత వాహవర్ణ సమకీర్తీ! రామలింగేశ్వరా!

రామశతకమున 108 పద్యాలు ఉండగా దీనిలో నూరు పద్యాలే కూర్చబడ్డాయి. కొన్ని భావాలు పునరుక్తమైనా తుమ్మలవారి కైతపస, భాషాపటిమ ఈ శతకంలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. అయినప్పటికి వ్యావహారిక పదాలు, వ్యాకరణ

దోషాలు కొన్ని కన్పిస్తాయి. ఈ క్రింది పద్యంతో శతకం పూర్తవుతున్నది.

దేవా! కమ్మకుల ప్రభూతుఁడను ధాత్రిన్ సర్వపుజ్యాళికిన్
దావౌ తుమ్మల నారయాత్మజుఁడ సీతారామ మూర్త్యాఖ్యుఁడన్
కావూర్గ్రామ నివాసుడన్ శతకమున్ గౌతూహలం బొప్ప నీ
పై విశ్వేశ్వర! వ్రాసినాడను నవద్వంద్వాబ్దమందున్ దయా
భావం బూనియు స్వీకరించి సుఖముల్ ప్రాపింపఁ జేయంగదే
నీవే దైవమువంచు నమ్మితిని తండ్రీ! రామలింగేశ్వరా!

'ఆకారంలో అల్పమయిందే అయినా కవిత్వపరంగా అనల్పమైంది' అని పరిశీలకుల ప్రశంసలందిన తుమ్మలవారి కృతి.

గాంధి తారావళి

భారత స్వాతంత్ర్య రథసారధిగా రంగప్రవేశము చేసిన వెంటనే భారతీయులకు భగవత్స్వరూపుడైనారు గాంధి. కపులీ మహనీయుని అవతార పురుషునిగా కీర్తించటం ఆనాడే ప్రారంభమైంది. "నేనీ చిన్నిపొత్తమును వ్రాయుటకు గారణము శ్రీమన్నారాయణావతారమగు మహాత్మ గాంధిగారి యందలి భక్తియు, వారి యుద్యమమునందుగల విశ్వాసోత్సాహములు తప్ప పాండిత్యబలము వలన గాదు.' అని తుమ్మలవారు వ్రాసిన దానినిబట్టి వారి దృష్టిలో గాంధిగారికి గల స్థానము వ్యక్తమగుచున్నది.

'మహాత్మా! గాంధినామ ప్రభూ' అన్న మకుటముతో వ్రాయబడిన ఈ తారావళి 1921లో ముద్రించబడింది.

ఏయే తీర్థములందు గ్రుంకి మఱి యేయే వేల్పులం గొల్చెనో
యేయే నోములు నోచెనో మఱియు నేయే దానముల్ సేసెనో
యేయే పుణ్యము లాచరించెనొ గుణాబ్ధీ! నిన్ను గాంచంగ నా
హా! యీ భారతమాత శ్రీయుత మహాత్మా! గాంధినామ ప్రభూ!

వెలసెన్ గాంధి మహాత్ముడంట చెలియా! విన్నావటే భారతీ
యులకున్ నాయకుడంట తాపస వరేణ్యుండంట తద్దేవునిన్
గొలువన్ మేలగునంట యంచు గనకాంగుల్ రాటముల్ ద్రిప్పుచున్
దలతుర్ విన్ననిశంబు భక్తిని మహాత్మా! గాంధినామ ప్రభూ!

కేవలము గాంధిని గూర్చిన స్తోత్రప్రశంసలే కాక, ఆనాటి వర్తమాన స్థితిగతులను కూడ వివరించారు.

పన్నుంగట్టగ శక్తిలేక దొరలం బ్రార్థింప లాభంబు లే
దెన్నో కష్టము లందియుంది తుదకిండ్లే వీడి పాకాలలో
నున్నారెంతటి త్యాగమూర్తులహహా! యూహింప చీరాల వా
రన్నా! యేరికి వింతగాదిది మహాత్మా! గాంధినామ ప్రభూ!

1920లో బ్రిటిష్ ప్రభుత్వంవారి ఆదేశాలమేరకు చీరాల మునిసిపాలిటీవారు విధించిన అధికమైన ఇంటిపన్నుకు నిరసనగా చీరాల ప్రజలు ఆంధ్రరత్నగారి నాయకత్వంలో ఉద్యమాన్ని ప్రారంభించారు. దీనికి మహాత్ముని ఆమోదం లభించింది. ఇళ్ళలో లేనపుడు పన్నేమి విధిస్తారు అన్న భావంతో చీరాల ప్రజలు ఇళ్ళను వదిలి చీరాల బయట పాకలు వేసుకొని నివసించిన సందర్భాన్ని గుర్తుకు తెస్తున్నది పై పద్యం. అలాగే పల్నాటి ప్రజల పరాక్రమాన్ని, గాంధిగారి అనుయాయుడు కొండా వెంకటప్పయ్యగారిని కూడా ఈ తారావళిలో ప్రస్తావించారు తుమ్మలవారు.

1922లో 'మహారాజ రాజశ్రీ తు. లక్ష్మీనారాయణ చౌదరి, తు. అప్పారాయ చౌదరిగార్ల ద్రవ్యసహాయమువలన' తుమ్మలవారు వెలువరించిన మరొక కృతి

నామదేవ చరిత్రము

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'శ్రీ మహాభక్త విజయము' నందలి నామదేవుని కథలో గల ముఖ్య భాగాలను గ్రహించి 'వర్తమాన పారక ప్రపంచ సమ్మతములగు కీర్తనలు, తోహరలు, పద్యగద్యము'లతో హరికథా రూపంగా దీనిని రచించారు తుమ్మలవారు. 'దుందుభినామాబ్ద మందాశ్వయుజ శుద్ధ విదియ సుశ్రీయుక్త వేళయందు' ప్రారంభించబడిన ఈ రచన మిత్రుల ప్రోత్సాహంతోను, సీతాపతి కృపావిశేషంతోను అనతికాలంలోనే పూర్తికాబడి అదే సంవత్సరం మార్గశిర శుద్ధ నవమినాటికి ప్రకటించబడింది. అప్పటికి తుమ్మలవారి వయసు 21 సంవత్సరములు. ఈ గ్రంథంలో తుమ్మలవారు కావూరు శ్రీరామాయామాత్యుని తమ గురువుగా పేర్కొన్నారు. తమకు గల 'బాలకవి' అన్న బిరుదును ప్రకటించుకున్నారు.

'నామదేవ చరిత్రము' నందలి ప్రధాన కథ ఇది:

మహారాష్ట్ర దేశమునగల పండరిపురము 'ధరణీ తరుణీ మణి సుందర కంబుగ్రీవరత్నదామ విరాజత్తరళం'బట. ఈ పుర వర్ణన మనుచరిత్రములోని 'మహికంఠహార తరళస్ఫూర్తిన్ విడంబించుచున్'అన్న అరుణాస్పదపుర వర్ణనకు అనుసరణ. ఆ పురంలో 'కామరుల మీదనో కూతుంద్రమీదనో శుల్కము ల్దిగ మ్రింగ జూచువారు, ఆస్తి కొంచెము పాళ్ళధికంబు లగునంచు పుట్టుబిడ్డల గుంట బెట్టువారు.... కానరారౌషధంబునకైన". అని ఎటువంటివారు లేరో చెపుతారు. ఆ పురంలో దామాజీ అనే పాండురంగ భక్తుడు సంతానం కొరకు స్వామిని ప్రార్థించగా, స్వామి కలలో కనబడి 'రేపు ఉదయం భీమానదిలో ఒక బాలుడు

ము త్తెపు చిప్పలో కొట్టుకొని వస్తాడు. అతడిని పెంచుకో' అని సెలవిస్తాడు. అలాగే దామాజీ ఆ బాలుని తెచ్చి నామదేవుడనే పేరున పెంచుతుండగా 5 సంవత్సరముల వయసుకే ఆ బాలుడు విష్ణుభక్తుడై తోటిబాలురకు భక్తినుపదేశిస్తాడు.

తియ్యని పెలిబ్రమాను తెనె త్రాగెడు తేటి
యుమ్మెత్త చెట్టకు నుఱుకనట్లు
మిన్నేటి తరగల మీద నూగెడు నల్వ
తత్తడి గుంటలన్ దాకనట్లు
మామిళ్ళ చిగురుల న్మరగిన కోవెల
కొండగోగుల జేరకుండునట్లు
నిండు చందురుని వెన్నెల లారగించి ని
ప్పుల పుల్గు పెన్మంచు దలచనట్లు

దమ్మి కన్నామి యడుగు కెందమ్మిబత్తి
కడలి పుట్టువు ద్రావించి యెడదతోతో
మైకమెక్కించి పెరకొర్కె మానిపించి
వెన్ను నిం జూడవలయునో యన్న లార!

ఒకనాడు నామదేవుడు స్వామికి నైవేద్యము నివేదించి ఆరగింపుమని ప్రార్థించగా స్వామి దానిని ఆరగిస్తాడు. ఈ విషయమును తెలుసుకొని ఆశ్చర్యపడి మరునాడు దామాజీ కుమారునితో గుడికి వెళ్ళగా నామదేవుడు మరల నైవేద్యమును గ్రహింపుమని స్వామిని ప్రార్థిస్తాడు. 'నీ తండ్రిని బయటకు పొమ్మను. అప్పుడు గ్రహిస్తాను' అన్న మాటలు విన్పిస్తాయి. దానికి నామదేవుడు కోపించి 'స్వామీ! నా తండ్రి పాతకదూరుడు. నీకు పక్షపాతము వద్దు. ఇలా అయితే నిన్ను అల్లరి చేస్తాను' అని పోబోగా స్వామి సాక్షాత్కరించి వారి కానందాన్ని కలిగిస్తాడు. నామదేవుడు రాధాబాయిని వివాహమాడి నారాయణుడనే కుమారుని కంటాడు. భక్తితత్పరుడై భుక్తికై ఆలోచించడు. ఇల్లు గడవని స్థితిలో తల్లి మందలించగా స్వామిని ప్రార్థిస్తాడు. స్వామి వర్తకుని రూపాన నామదేవుని ఇల్లు చేరి రాధాబాయికి పదివేల వరహాలను ప్రసాదించగా 'ధనము పాపాలమూట' అని నామదేవుడు దానిని పేదలకు దానమిస్తాడు.

జ్ఞానదేవుడనే భక్తుడు స్వామివారి అంగీకారముతో నామదేవునితో కలిసి తీర్థయాత్రలకు బయలుదేరి మార్గమధ్యంలో 'కుమార! నీ వేవిధంగా పాండురంగని ఉపాసించితివి.' అని నామదేవుని ప్రశ్నిస్తాడు. నామదేవుడు 'నేను వేదశాస్త్రాదులను పల్లె వేయలేదు. యోగాభ్యాసకుడను కాను. మూఢభక్తుడను' అంటూ ఇంకా ఇలా అంటాడు.

ఈశ్వరదత్తమౌ యీ శరీరంబును
ఈశ్వరసేవకే యిచ్చినాడ
నాతడొసంగిన హస్తముల్ శిరమును
చిత్తంబు జిహ్వయు చెవులు కనులు
బుద్ధియు బాదముల్ బూజింపగా మ్రొక్క-
స్మరియింప గీర్తింప శ్రద్ధతోడ
గథల నాలింప మంగళ విగ్రహము జూడ
నన్నంబుపై రోయ నమ్మహాత్ము

నకు బ్రదక్షిణముల జేయుటకు నిరంత
రంబు నుపయోగ పఱచి కాలంబు గడుపు
చున్నవాడను తెలియని పిన్నవాడ
గలిత ఘన దుష్కృతాభావ! జ్ఞానదేవ!

వీరిరువురు ఢిల్లీ చేరినపుడు అక్కడి పాదుషా నామదేవుని గూర్చి విని అతనిని పరాభవించదలచి చనిపోయిన ఒక ఆవును బ్రతికించమనగా నామదేవుడు నాలుగు రోజుల వ్యవధిని కోరతాడు. పాదుషా ఇద్దరు భటులను వారికి కాపలాగా నియమిస్తాడు. నామదేవుడు హరిని భజించి నాల్గవరోజున ప్రత్యక్షం చేసుకొని ఆవును బ్రతికించమనగా హరి నామదేవుని కోరికను మన్నించి ఆవును బ్రతికిస్తాడు. ఈ విషయమును తెలుసుకొని పాదుషా నామదేవుని శరణు కోరి అతనికి భక్తుడౌతాడు.

నామ, జ్ఞానదేవు లిరువురూ దేశాటన చేస్తుండగా ఒక శివరాత్రినాడు నాగనాథ దేవాలయములో సంకీర్తనలు చేస్తారు. ఆ ఆలయ పూజారులు వారిని ఆలయమునుండి బయటకు నెట్టి వేస్తారు. ఆ రాత్రి శివుడు ప్రత్యక్షమై వీరి కీర్తనలను వింటాడు. దేశాటన పూర్తి చేసుకొని ఇంటికి చేరి వీరోబా కేశుడనే దేశికుని శిష్యుడై నామదేవుడు జగం మిథ్య అని గ్రహించి గుడికి వెళ్ళక ఇంటిలోనే దైవపూజ చేస్తుంటాడు. ఒకరోజు స్వామి నామదేవుని ఇంటికి వచ్చి 'నా సేవ మరచిపోయావా' అనగా నీకంటె అన్యం లేదు అని జవాబిస్తాడు. స్వామి నామదేవుని భక్తిని ఎన్నో రీతుల పరీక్షిస్తాడు. ఒక ఏకాదశినాడు వృద్ధ బ్రాహ్మణ వేషంలోవచ్చి భోజనమును కోరగా ఈరోజు ఏకాదశి కనుక భోజనము లేదని చెప్పగా అతడు మరణిస్తాడు. నామదేవుడు రెండు చితులను పేర్చి ఒకదానిపై ఆ వృద్ధుని ఉంచి మరొకదానిపై తానుండగా పాండురంగడు ప్రత్యక్షమై నామదేవుని భక్తిని కొనియాడి రక్షిస్తాడు. నామదేవుడు హరిభక్తిని వీడక చివరకు ఆ హరి సన్నిధికి చేరతాడు.

తుమ్మలవారి యీ హరికథ ఆ రోజులలో తగిన ప్రచారాన్ని పొందింది. తిరుపతిలో కొందరు హరిదాసులీ కథను గానంచేసి ప్రచారం చేశారు. తుమ్మలవారి అనంతర కృతులలో కన్పించని శృంగార వర్ణన ఈ హరికథలో కన్పిస్తుంది. నామదేవుని భార్య సోయగాన్ని వారిలా వర్ణించారు.

ఏ మందు నా యింతి సొంపు
కామిని రతికైన గలిగించు తలవంపు
కోమలి నేరీతి దాపర బుట్టిన
సామి చేసెను బల్పుసందైన పూబంతి.

ఆ మహిళామణి యందంపు టిల్లైన,
మోము పాలకడలి బాలు నేలు
చామకండ్లు గండుమీల పండ్లు
శ్రీమించు మగరాల చాలు.

భామ ముంగురు లుంగరాలు పాల
గీముల్పుయిడి బొంగరాలు కురు
లా మధుపంబుల బోలు నా
భామిని నూగారు పాపన గాజాలు.

విద్దెలలో దమ్మి గద్దెపై గొలువుండు
పెద్ద పెండ్లామును వంచు మేని
నిద్దంపు జిగి క్రొత్త మించు చెక్కు
లద్దంబుల నపహసించు నడక

లద్దిరా యేన్గును మించు నడుము
కద్దో లేదో యనిపించు బింబ
ముద్దియె కెమ్మోవికంచు దోచు
దద్దయు గోరులు తారల నిర్జించు"

కావూరులో తుమ్మలవారి ఇంటికి దగ్గరలో రామకృష్ణయ్యగారనే పూజారి ఉండేవారు. వీరిరువురు ఎంతో అన్యోన్యంగా ఉండేవారు. రామకృష్ణయ్యగారు 1925 నవంబరులో మరణించగా వారి స్మృతిచిహ్నంగా తుమ్మలవారు రచించిన కృతి

రామకృష్ణ స్మృతి

'నా ప్రాణమిత్రుడగు బ్రహ్మశ్రీ రావూరు రామకృష్ణ శర్మగా రస్తమించుటచే మిత్రమరణ సంజనిత దుఃఖమున నీ చిన్నిపొత్తమును నూరు పద్యములతో వ్రాసితిని. వారి జీవిత చరిత్రమంతయు నీ పద్యము లందిమిడియున్నందువలన మరల నిందు వ్రాయమానితి'నని తొలి పలుకులో వ్రాశారు 'బాలకవి' తుమ్మలవారు.

1923 నవంబరులో ఉమ్మడి మద్రాసు రాష్ట్రానికి ఎన్నికలు జరుగుతున్నాయి. గాంధిగారి పిలుపు ననుసరించి కాంగ్రెసువారు ఎన్నికలను బహిష్కరించారు. తుమ్మలవారు గాంధిగారి సిద్ధాంతాలను ఆచరిస్తూ కాంగ్రెసు తరపున గ్రామాలకు వెళ్ళి అక్కడి ఓటర్లకు ఎన్నికలలో పాల్గొనవద్దనే గాంధిగారి ఆదేశాన్ని వినిపించి తదనుగుణంగా వారిని కర్తవ్యోన్ముఖులను చేస్తూ రేపల్లె పరిసర గ్రామాలైన సజ్జావారిపాలెం, ఉల్లిపాలెం మొదలైన గ్రామాలలో పర్యటించి పల్లపట్ల గ్రామం చేరి ప్రచారం చేస్తూఉండగా కావూరునుండి మరొక కాంగ్రెసు కార్యకర్త వారికి అండగా వచ్చారు వారు వస్తూ వస్తూ రామకృష్ణయ్యగారి మరణవార్తను మోసుకు వచ్చారు.

కటకట! పల్లపట్ల యను గ్రామమునన్ బనిమీద నుండగా
పటుతరమైన యా యశనిపాతముభంగి మదీయకర్ణ సం
పుటముల యందు తాకె హితపుంగవ! నీ మరణంపువార్త యెం
తటి కుటిలాత్ముడయ్యెను విధాత నిజాన్వయ రాగహీనుడై.

అంటూ శతకాన్ని కొనసాగించి 29 సంవత్సరాల ప్రాయంలో మరణించిన మిత్రునికై విలపిస్తూ ఇలా ముగించారు.

కన్నులను గాఱు దుఃఖాశ్రు కణములెల్ల
గాల్వలై పాఱ దడిసెను కాగితంబు
కలము గంపించె మతిచెడె కండ్లు దిరిగె
నాపు చున్నాడనింక నీ విలాప కవిత!

1923 నాటికి ఒక స్మృతిశతకం వెలువడటం విశేషమే.

తుమ్మలవారు శతకములు, హరికథలే కాక

మహేంద్ర జననము

అను నాటకాన్ని కూడ వ్రాశారు.

"రేపల్లె వాస్తవ్యుడును శ్రీ విఘ్నేశ్వర దేవాలయ ధర్మకర్తయునగు పట్టూరు వెంకయ్య తన వంశ చరిత్రము నెఱిగించునదియు, స్కాంద పురాణాంతర్గతమగు శంకర సంహితలో 155వ అధ్యాయమున గల యితివృత్తము నాధారము జేసికొని బ్రహ్మశ్రీ నాదెండ్ల పురుషోత్తమ కవిగారిచే నాంధ్రమున నొక చిన్న పద్యకావ్యముగా వ్రాయబడినదియునగు "మాహేంద్ర పురాణ"మను గ్రంథమును నాటక రూపమున వ్రాసియిండని నన్ను గోరుటచే నేనీ గ్రంథమును రచియించితి" నని తొలి పలుకులో గ్రంథరచనను గూర్చి తుమ్మలవారు వ్రాసుకొన్నారు. ఈ గ్రంథాన్ని పట్టూరు వెంకయ్యగారే అచ్చు వేయించినట్లు తుమ్మలవారు వ్యక్తిగతంగా తెలియజేశారు. ఇది 1924లో

రాజమండ్రిలోని దేశీయ విద్యాలయ ముద్రాక్షరశాలలో ముద్రించ బడింది. అచ్చుతప్పులు కుప్పలు.

75 పుటల పరిమితిలో 5 అంకములుగా వ్రాయబడిన ఈ నాటకములోని ప్రధానకథ మేదరుల జన్మ వృత్తాంతమునకు సంబంధించినది. ఈ కథాభాగము చాల చిన్నదగుట వలన దీనికి పూర్వరంగముగ సతీదేవి దక్షునిచే అవమానించబడి శరీర త్యాగముచేసి హిమవంతుని పుత్రికగా జన్మించి పరమేశ్వరుని పెండ్లాడిన కథ కూర్చబడింది.

పార్వతి పరమేశ్వరుని పెండ్లాడిన పిదప ఒకనాడు భర్తను తాను సతీదేవిగా దేహత్యాగముచేసి పార్వతిగా జన్మించుటకు గల కారణమును అడిగింది. దానికి పరమేశ్వరుడు భర్తతో భార్యకు ఎడబాటు లేకుండా చేసే శూర్పపుటీ వ్రతము - మూసి వాయనాల నోము - మహాత్మ్యమును చెప్పి 'దాక్షాయణిగా ఉన్నప్పుడు నీవా వ్రతము చేయలేదు కనుక ఆ ఎడబాటు కలిగింది' అని సమాధానమిచ్చాడు. పార్వతి తన మందమతిని నిందించుకొని వెంటనే ఆ వ్రతాన్ని చేయ దలపెట్టింది. పరమేశ్వరుడు తన సర్పహారాలను తీసి మహేంద్రపర్వతముపై వెదురుచెట్లుగా పుట్టమని ఆదేశిస్తాడు. ఆ వెదురుచెట్లను చీల్చి చేటలు అల్లటానికి కొందరు ప్రమథులను నియమిస్తాడు. వారు ఆ పర్వతంమీద పుట్టిన వెదురు అడవికి వెళ్ళి పార్వతీదేవి నోముకు కావలసిన చేటలనల్లి పంపించారు. పార్వతీదేవి ఆ నోము నోచి "తన్మహత్వంబు వలన శంకరార్ధాంగంబున గలసి ప్రాణనాథునితో శాశ్వతముగా నుండు భాగ్యము" పొందినది. పార్వతీదేవి భాగ్యాన్ని చూచిన లక్ష్మి, సరస్వతి మొదలగువారు తాము కూడా ఆ నోము నోచబోగా వారికి కావలసిన చేటలను తయారు చేయటానికి కొన్నాళ్ళు ఆ ప్రమథులు అక్కడే ఉండవలసి వచ్చింది.

అదే సమయంలో కొందరు దేవకన్యలు మహేంద్ర పర్వతముపై విహరిస్తూ ఈ ప్రమథులను చూచి మోహించి వారిని పెండ్లాడి వారివలన సంతానాన్ని పొందారు. పరమేశ్వరుడు ప్రమథులను కైలాసానికి తీసుకువెళ్ళుటకు మహేంద్ర పర్వతానికి వచ్చినపుడు ప్రమథుల కుమారులు తాము కూడ కైలాసానికి వచ్చే కోరికను వెల్లడిస్తారు. 'పరోపకారమే పరమధర్మము కనుక మీరీ భూలోకంలోనే ఉండి మూసివాయనాల నోము నోచే స్త్రీలకు కావలసిన చేటలను అల్లిఇమ్మ'ని ఒక ప్రమథుడు కుమారులకు చేసిన బోధకు శంకరుడు సంతోషించి "మీరు మహేంద్ర నగవాసులు గాన మాహేంద్రులనియు, మేంద్రలనియు దెలుగుబాసలో మేదరలనియు వంశనామములు గలిగియుందురు గాక" అని ఆ కుమారులను దీవించి ప్రమథులతో కలిసి కైలాసానికి మరలి వెళతాడు.

ఇదీ మాహేంద్ర జనన నాటకకథ. ఈ నాటక రచనలో సందర్భానుసారముగా తుమ్మలవారు సాధారణ ఛందస్సులలో 135 పద్యాలను రచించారు.

శ్రీకారంతో ప్రారంభించబడి, సంస్కృత నాటక సంప్రదాయానుసారంగా నాంది రచించబడింది. ఈ నాందిలో 'నామదేవ చరిత్రము'లో కవి వివరాలను తెలిపే 'శ్రీకరంబై....' ఇత్యాదిగా సాగే సీసపద్యం నాటకాని కనువుగా మార్చి రచించబడింది. దాని ఎత్తుగీతిలో తుమ్మలవారు

'భానుకులభూష రామకృపా విశేష
లబ్ధలసదాంధ్ర కవితా విలాసి'

నని తమనుగూర్చి చెప్పుకున్నారు. 22 ఏండ్ల వయసులో వారలా చెప్పినా, తరువాత తరువాత తమ కవిత్వం వాణీ వర ప్రసాద లబ్ధమనే వారు విశ్వసించారు.

ఇక, ఈ నాటకంలోని ఒకటి, రెండు ఘట్టాలను గమనిద్దాం.

పిలువని పేరంటానికి పోరాదన్న శంకరునితో సతీదేవి

జననియును జన్మభూమియు ననెడు రెండు
క్షితిని 'స్వర్గాదపి గరీయసీ' యటంచు
బల్కుచుందురు పెద్దలే పగిది నిపుడు
బుట్టినింటికి నక్కటా! పోవకుందు.

అని వాదులాడి తండ్రి యాగమునకు వెళ్ళింది.

'...పిలువక చనుదెంచి నట్టిదాని
కింత సిద్ధాంత మేల రాద్ధాంతమేల
గూటికై వచ్చితివి పెక్కు మాటలేల
గూడు గూరలు తృప్తిగా గుడిచిపొమ్ము'

అంటూ దక్షుడామెను చులకన చేసి శంకరుని తెగడి 'వచ్చినదారి పొమ్మికన్' అని ఈసడిస్తాడు. దానికి సతీదేవి దుఃఖించి ప్రాణత్యాగమొనర్చుకొనగా ఆ విషయాన్ని నారదుని వలన విని పరమేశ్వరుడు మోహంతో విలపిస్తాడు. ఈ సందర్భంలో నారదుని నోట స్త్రీ మోహాన్ని గూర్చి తుమ్మలవారు చెప్పించిన నాలుగు పద్యాలు మనోహరాలు. అందులో ఒకటి ఇది.

అయ్యగారు చచ్చెనని సాని ప్రక్కలో
నున్న సుతునితోడ నొకడు చెప్ప
'జావనిమ్ము పీన్గు నీ వీధినే దెత్తు'
రనుచు పక్కనందు రబ్రమేమి

మన్మథుని బూదిచేసి తపోదీక్షను విడిచి వెళ్ళిన పరమేశ్వరుని భర్తగా పొందటానికి పార్వతి తపోనిష్ఠను పూనినపుడు మాయాశంకరునకు పార్వతికి జరిగిన సంభాషణలో శ్రీనాథుని హరవిలాసములోని పద్యభావాలు ప్రచురంగా కన్పిస్తాయి. తన వివాహ నిర్ణయమునకు రాయబారిగా సప్తర్షులకు మారుగా సందీశ్వరుని పంపుతాడు పరమశివుడీ నాటకములో.

దేవకన్యల, ప్రమథుల పరస్పర అనురాగ భావాలు, ప్రణయ సన్నివేశాలు ఆంధ్ర ప్రబంధాలలోని రసవద్ఘట్టాలను స్ఫురణకు తెస్తాయి.

'నేరెటేటియసల్ దెచ్చి నీరజాప్తు
సానబెట్టిన జాపొడి చల్లి మెదిపి
పదను సుధ నిడి చేసెనో పద్మభవుడు
వీని గాకున్న గలదె యీ మేనికాంతి'

అన్న మనుచరిత్ర పద్యభావాన్ని తుమ్మలవారిలా విప్పి చెప్పారు. "వీరి శరీరచ్ఛాయ నేమని వర్ణింతును. నిజముగా నా పరమేష్ఠి వీరల సృజియింపు తరి జంబూనదీ పంకంబునం దంబుజాప్తుని సానబెట్టిన చూర్ణము గలిపి సుధారసంబున జక్కగా బాకమొనర్చి యద్దానిచే నీ యువకుల గాత్రంబు నిర్మించియుండ వచ్చు. లేకున్న నీ తళుక్కు బెళుక్కులుండుట దుర్లభము గదా!"

మహేంద్ర పర్వతంపై గల వెదురుల ఉపయోగాలను ఇలా వివరించారు.

ములుగఱ్ఱలగు సేద్యమును జేయువారికి
బిల్లనగ్రోవులౌ బిల్లలకును
గాలపాత్రలగు గృహస్థుల కెల్లవారికి
గురువృద్ధులకు నూతకోలలగును
క్షితి సర్వజనులకు జేకఱ్ఱలగుచుండు
బల్లకీ కాధారపడుచునుండు
వాసంబులగును నివాసంబులకు నెల్ల
దడులకు నుపయోగపడుచునుండు

నొనర గావడిబద్దల నుపకరించు
జల్లలం జేటలను జాప జల్లెడలను
తట్టలం బుట్టలను పంచి పెట్టియలను
దిట్టముగ నల్లవచ్చు నీ చెట్టువలన

ఇంతేకాక వెదురు నియ్యం రోగ నాశనమట. వెదురులు ఈశ్వరుని సర్పహార ప్రతిరూపాలు కనుక ఈ రెంటికీ ఇలా అభేదాన్ని చెప్పారు.

వనవాసంబును నిడిపయు
ననుపును మెఱుగారు మణులనుం దాల్చుటయున్
గనుగొన నిర్వేదురులకున్
మనుపతి ఫణిరాజు చిహ్నములె కనుపట్టున్.

ఇవి కవి ప్రతిభకు నిదర్శనాలు.

తుమ్మలవారి ప్రసిద్ధ రచనలలో శృంగార వర్ణనలు లేవు. అవి నామదేవ చరిత్రములోను, ఈ నాటకములోను కన్పిస్తాయి. ఈ దృష్ట్యా ఇవి నిలుపైనవి.

గ్రంథరూపంలో వెలువడిన ఈ తొలినాటి రచనలే కాక వివిధ పత్రికలలో ముఖ్యంగా భారతి, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలలో అచ్చయి తరువాత తుమ్మలవారి ఖండకృతుల సంపుటాలలో చేరని మరికొన్ని తొలినాటి రచనలు కూడ కన్పిస్తున్నాయి. అవి ఇవి:

వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు
బమ్మెర పోతరాజు స్మృతి
ఆశీర్వాదము
ఆంధ్రలక్ష్మీ నృసింహ స్తోత్రము
శ్రీకృష్ణ వేణుగానము
శ్రీకృష్ణ ప్రశంస
వేమన తారావళి
నిరాశ.

ఇక, అచ్చుపడకుండా లోకంలో వ్యాప్తి కాకుండా ఉన్న తుమ్మలవారి తొలినాటి కృతులు ఇవి.

పురాంతక శతకము
రాఘవ శతకము
బిల్హణీయము (జంగం కథ)
అన్నదాన ప్రభావము (జంగం కథ)
వసుచరిత్ర (నాటకము)

ఈ అముద్రిత రచనలు ఈనాడు లభించవు. ఈ రచనా కాలంలో లోకం వారిని 'బాలకవి'గా సంభావించినదని వారే విదంగా చెప్పుకొన్నారు.

'శతకముల్ హరికథల్ జంగమకథలు
నాటకంబులు వ్రాయు నవయౌవనమున
గన్నాడ నే 'బాలకవి' యన్న బిరుదు'
(నా కథలు పుట 234)

ఆనాడు వారికిది సార్థకమైన బిరుదు.

తుమ్మలవారి పద్యరచనా పరిణతిని పరిశీలించటానికి వారి ముద్రితమైన తొలి కృతులను పునర్ముద్రించి అందరికీ అందుబాటులోనికి తేవటము ఆవశ్యకము.

# ఈ మాసం - మీ నక్షత్రఫలం

**మార్చి - 1989**

## మేషం (అశ్విని, భరణి, కృత్తిక 1పా)

అశ్వినివారికి తొలి పదిహేను రోజులు, శ్రమ, కార్య విలంబం, శుభకార్యముల నిమిత్తము, సంతాన నిమిత్తము కొంత వ్యయము, వ్యాకులత్వం, త్రిప్పట జరిగినప్పటికి నెల మూగవ వారమంతా కార్యసిద్ధి జరుగును. 14, 15 తేదీలలో సంతానమునకు నలతచేసి నిమ్మళించును. విద్యార్థులకు ప్రోత్సాహకరంగా ఉండును. ఉద్యోగులకు మంచి అభివృద్ధి కల్గును. కర్షకులకు, వ్యవసాయదారులకు మంచి లాభము కలుగును.

భరణి వారికి గతంలోకన్న ఈ నెలంతా మంచి ప్రోత్సాహకరంగా నుండును. విద్యార్థులకు అనుకూలమైన కాలము. గతంలోని ఋణ, ధన బాధలు తీరిపోవును. శత్రువులు మిత్రులగుదురు. రాజకీయవాదులకు అనుకూలంగా నుండును. శుభకార్యములు ఫలించును. ఉద్యోగులకు అభివృద్ధి కలుగును. సంతానమునకు అన్నివిధాల అభివృద్ధి కలుగును. కాని శరీరశ్రమ హెచ్చు.

కృత్తిక 1పా. వారికి 16వ తేదీవరకు శ్రమ, నలత, అధిక వేడిమి కలిగించును. మానసికంగా ఆందోళన కలుగును. ఎందరు పెద్దలు అనుకూలంగా ఉన్నా, కార్యసిద్ధి వాయిదా పడుచుండును. ధనం విపరీతంగా వచ్చినను, పనికిమాలిన వ్యయమే హెచ్చుగా నుండును. విద్యార్థులకు, ఉద్యోగులకు, రాజకీయవాదులకు మంచి ప్రోత్సాహకరంగా నుండును. కాని బంధువులతో మాటపట్టింపులు, విరోధము వచ్చును.

## వృషభం (కృత్తిక 2, 3, 4పా. రోహిణి, మృగశిర 1, 2 పా)

కృత్తిక 2, 3, 4పా. వారికి శుభాశుభమిశ్రఫలం కలుగును. ఆదాయమునకు మించి వ్యయము జరుగును. మాటిమాటికి ఏవో కొన్ని సమస్యలు తలఎత్తి మానసికంగా కొంత వ్యధను కలిగించి తొలగిపోవును. రాజకీయవాదులకు బొటాబొటిగా జయం కలుగవచ్చును. బయటివారందరికి ఈ నక్షత్రంవారు ఎంతో సుఖముగా ఉన్నట్లు అనిపించేటట్లు ఉన్నను, లోలోపల అసంతృప్తితో గడపుట జరుగును. 16వ తేదీవరకు ఉష్ణాధిక్యము కలుగును.

రోహిణి వారికి 17వ తేదీనుండి శ్రమా, త్రిప్పటా, ఉష్ణాధిక్యమూ మొదలగునవి కలిగించును. మంచి అనుకూలంగా నుండును. అన్ని కార్యములు ఫలించును. శుభకార్య ప్రయత్నములు జరుగును. ఉద్యోగ, వ్యాపార, వ్యవహారములన్నీ ఫలించును. సంతానమునకు అన్నివిధాల అభివృద్ధి కలుగును. సంసార, కుటుంబసౌఖ్యము కలుగును. ధనలాభము బాగుగా నుండును. విద్యార్థులకు, ఉద్యోగులకు, వర్తకులకు, కర్షకులకు, రాజకీయవాదులకు అన్నివిధాల అనుకూలంగా నుండును.

మృగశిర 1, 2పా.వారికి శారీరకంగా శ్రమ, మానసికంగా ఆందోళన హెచ్చుగా నుండును. ఎంత డబ్బు వచ్చినా, లగ్జరీ ఖర్చులకు, బంధుమిత్రాదులు మొదలగువారికి ఖర్చు పెట్టి, పెద్ద పరుగులకు పోయి, ఇంతో, అంతో ఋణము చేయుట జరుగును. భార్యకు స్వల్పంగా అనారోగ్యం, కుటుంబంలో కలతలు, నలతలు కలుగును. పెద్దలతో మైత్రి, పదుగురిలో మాటగౌరవం కలుగును. విద్యార్థులకు, ఉద్యోగులకు, రాజకీయ నాయకులకు అతి శ్రమమీద ఫలితం కొనసాగును.

## మిథునం (మృగశిర 3, 4పా. ఆర్ద్ర, పునర్వసు 1,2,3పా)

మృగశిర 3, 4పా. వారికి భార్యకు స్వల్పంగా నలతచేసి నిమ్మళించును. శుభకార్య ప్రయత్నములకు ఆటంకము కలుగును. అనుకోనివిధంగా ధనవ్యయం జరుగును. ఉద్యోగులకు, విద్యార్థులకు, వర్తకులకు అన్నివిధాల మేలు కలుగును. సంతానమునకు అన్నివిధాల అభివృద్ధి కలుగును. సోదరునకు నలత చేయును. లేదా సోదరమూలకంగా ధనవ్యయం, చిక్కులు కలుగును.

ఆర్ద్రవారికి శుభాశుభ మిశ్రఫలం కలుగును. శ్రమ హెచ్చు. ఫలితం తక్కువ. అయినా పెద్దలతో పరిచయము వలన కార్యములను సాధించుకొనగలరు. సంసార సౌఖ్య భంగము, స్త్రీలకు ఆరోగ్యభంగము, పనికిమాలిన ఖర్చులు అధికంగా జరుగును. విద్యార్థులకు, ఉద్యోగులకు, వర్తకులకు, వ్యవసాయదారులకు అన్నివిధాల ఉత్సాహకరంగా ఉండును.

పునర్వసు **1, 2, 3**పా. వారికి మంచి **ఉత్సాహం** కలుగును. పరిస్థితులు **అనుకూలంగా లేకపోయినా, ఉత్సాహం, ఆత్మ విశ్వాసం, కృషి, పట్టుదల** మొదలగు వానివలన కార్యమును **జయించుట** జరుగును. అన్ని **విషయములలోను** ఎదురైన చిక్కుల నధిగమించి విజయమును **పొందుదురు.** **17**వ **తేదీనుండి శరీరంలో** నలత, **వేడిమి,** ధనవ్యయము హెచ్చుగా **నుండును.** సోదర మూలకంగా ధనవ్యయము కలుగును.

## కర్కాటకం (పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష)

పునర్వసు 4పా. వారికి **17**వ తేదీనుండి శ్రమ, **వేడిమి,** త్రిప్పట, వ్యయప్రయాసలు మొదలగునవి జరుగును. **10-17** తేదీలమధ్య సౌఖ్యభంగము, భార్యకు నలత చేయును. ప్రయోజనం లేని పనిభారంతో విశ్రాంతి ఉండదు. వ్యవహారములలో చివరకు సందేహం **అయినా** విధిగా విజయం కలుగును. విద్యార్థులకు, ఉద్యోగులకు, వర్తకులకు అన్ని విధాల **అభివృద్ధి,** లాభము కలుగును.

పుష్యమి వారికి **10**వ తేదీవరకు భార్యకు నలత, శ్రమాధిక్యం వలన బడలిక కలుగును. కార్యవిజయం, ధనలాభము, ఉద్యోగంలో అభివృద్ధి కలుగును. రాజకీయాలలో అభివృద్ధి, పదవీగౌరవము, ప్రజాసన్మానము జరుగును. సువర్ణ వస్త్రాభరణ ప్రాప్తి కలుగును. విద్యార్థులకు, కార్మిక, కర్షక, వర్తకులకు, మంచి శుభప్రదమైన కాలము

**ఆశ్లేష** వారికి **10-18** తేదీలమధ్య శ్రమ, సౌఖ్యభంగం కలుగును. ధనాదాయం బాగుండును. కాని ధనం అధికంగా ఖర్చగును వర్తకులకు, విద్యార్థులకు కొంత **జయం కలుగును.** రాజకీయవాదులకు అధిక **వ్యయప్రయాసలతో విజయం** కలుగును. మనస్సునకు ఏదో విషయం గురించి కలత కలుగును. ఎన్ని ఆటంకాలు, చిక్కులు వచ్చినను, చివరకు శుభాంతంగా విజయం, సంతోషం కలిగించును.

## సింహం (మఘ, పుబ్బ, ఉత్తర 1పా.)

మఘ **వారికి** కొంత అనుకూలంగానే **ఉండును.** శుభకార్య **ప్రయత్నములు ఫలించును.** చాలకాలమునుండి ఫలించక వాయిదా పడుచున్న వ్యవహారము లన్నియు సిద్ధించును. ధనము అనేక విధముల కలసివచ్చును. ఈ నక్షత్రం వారందరికి రాజకీయాలలో **విజయం** కలుగును. విద్యార్థులకు, ఉద్యోగులకు, వర్తకులకు మంచి **ఉత్సాహకరంగా ఉండును. 19-23** తేదీలమధ్య శ్రమాధిక్యం వలన బడలిక కలుగును.

**పుబ్బ**వారికి **17 తేదీనుండి** శరీరంలో నలత, శ్రమ కల్గును. శుభకార్య **ప్రయత్నములకు** ఆటంకము **కలుగును.** మానసికంగా ఆందోళన **తగ్గినను,** శ్రమకు తగిన **ఫలితం** కూడ పూర్తిగా కలసిరాదు. రాజకీయవాదులకు సామాన్యము. ధన **వ్యయం** మాత్రం అధికంగా జరుగును. మొత్తంమీద ఈ నక్షత్రం గలవారందరికి శుభాశుభ మిశ్రఫలం కలుగును.

ఉత్తర **1**పా. వారికి గురుబలం తక్కువ. శుభకార్య ప్రయత్నాలకు, పుణ్య ధర్మకార్యములకు ధనం అధికంగా వ్యయం జరుగును. రాజకీయవాదులకు ఆశాభంగము, విద్యార్థులకు విజయం, వర్తకులకు, కర్షకులకు, శ్రమజీవులకు కొంతలో కొంత మేలుగా నుండును. ఉద్యోగులకు సర్వవిధాల అభివృద్ధి కలుగును.

## కన్య (ఉత్తర 2, 3. 4 పా. హస్త, చిత్ర 1, 2 పా.)

ఉత్తర 2, **3,** 4పా. మొదటిపాదం వారికంటె బాగుగానే ఉండును. అయితే మొదటి **15** రోజులు శ్రమ హెచ్చుగా నుండును. మిగిలిన గ్రహస్థితి అనుకూలంగా ఉండుటవలన గతంలో స్తంభించిపోయిన పనులన్నీ చకచక నెరవేరుచుండును. శుభకార్య ప్రయత్నాలు నెరవేరును. సంతానమునకు అన్ని విధాల విద్యారంగములలో బాగుగా రాణించును. రాజకీయవాదులకు మంచి పేరు ప్రతిష్ఠలు, ప్రజాసమ్మానము జరుగును. మొత్తం మీద గతంకంటె అన్ని విధాల మేలు కలుగును.

హస్తవారికి గతంకంటె మేలుగా ఉంటుంది. గతంలోని మానసిక శ్రమ తొలగిపోవును. పరిస్థితులు అనుకూలించును. ధనము అనేకవిధముల కలసివచ్చును. కాని అప్పుడప్పుడు తటస్థించిన పనికిమాలిన వ్యయముక్రింద జరుగును. వ్యాపార వ్యవహారములన్నీ వాటంతటవే పరిష్కారమునకు దారితీయును. మొత్తంమీద సర్వులకు మంచి శుభఫలితము జరుగును. **17**వ తేదీ దాటినప్పటినుండి శరీరంలో వేడిమి కలుగుచుండును

చిత్ర **1, 2**పా. వారికి నలత, శ్రమ, త్రిప్పట, శరీరంలో తాపం మొదలగునవి కల్గును. వ్యవహారములలో ధనం రాబట్టు కొనుటకై ఉన్న డబ్బు ఖర్చగునేకాని ఫలితం మాత్రం రాదు. మొత్తంమీద అర్థాంతరముగా సుఖం, విజయం, కార్యసిద్ధి కలుగును. సంతృప్తి తక్కువగా నుండును. భార్యకు నలతచేసి నిమ్మళించును. శుభాశుభ మిశ్రమఫలం కలుగును.

## తుల (చిత్ర 3, 4 పా. స్వాతి, విశాఖ 1, 2, 3 పా.)

చిత్ర 3, 4పా. వారికి శ్రమ హెచ్చుగా నుండును. త్రిప్పట, ఖేదం కలుగును. నెలంతా మరింత గడ్డుగానే ఉండును. బంధువులతో విరోధము, మాటపట్టింపులు కలుగును. తాహతుకు మించిన ఖర్చులు పెరుగును. ఇది రాజకీయవాదులకు, విద్యార్థులకు, వర్తకులకు మరింత హెచ్చుగా నుండును. మొత్తముమీద ఈ నక్షత్రం గలవారందరికి సామాన్యముగా నుండును.

స్వాతి వారికి 16వ తేదీవరకు శ్రమ, వేడిమి హెచ్చుగా నుండును. భార్యకు నలత చేయును. ఆదాయమునకు మించిన వ్యయం జరుగును. కుటుంబంలో అకారణముగా కలహములు, స్పర్థలు జరుగును. ఉద్యోగ వ్యవహారములు సాఫీగా కొనసాగిపోవును. విద్యార్థులకు, ఉద్యోగులకు, వర్తకులకు, వ్యవసాయదారులకు అతి శ్రమమీద ఫలితం కొనసాగును.

విశాఖ 1, 2, 3పా. వారికి 17వ తేదీనుండి శరీరశ్రమ, మనోవైకల్యం ఉండును. వ్యవహారములన్నీ అనుకూలంగా జరిగిపోవుచుండును. 3, 4 వారాలలో భార్యకు అనారోగ్యము చేసి నిమ్మళించును. ధనము అనేకవిధముల కలిసివచ్చును. విద్యార్థులకు, రాజకీయవాదులకు, వర్తకులకు లాభదాయకముగా నుండును. సంతానమునకు అన్ని విధముల అభివృద్ధి, ఉద్యోగంలో మంచి అభివృద్ధి కలుగును.

## వృశ్చికం (విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ)

విశాఖ 4పా. వారికి 17-31 తేదీలమధ్య సౌఖ్యభంగము, శరీరంలో నలత, శ్రమ, వేడిమి కలుగును. శుభకార్యములకు ఆటంకము కలుగును. వ్యయం అనుకొనని విధంగా విపరీతంగా జరుగును. మానసికంగా కొంత క్లేశం కలుగును. రాజకీయవాదులకు 16వ తేదీవరకు మేలుకలుగును విద్యార్థులకు, ఉద్యోగులకు, వర్తకులకు మంచి ప్రోత్సాహకరంగా నుండును.

అనూరాధ వారికి నెలంతా అనుకూలంగానే ఉండును. ఆరోగ్యం బాగుగా నుండును. గతంలోని ఒడుదొడుకులన్నీ పూర్తిగా తొలగిపోవును. లోగడ నిరాశ చేసుకొన్న వ్యవహారములు ఫలించి ధనలాభం కలుగును శుభకార్యములు ఫలించును. బంధుమిత్రాదుల తోడ్పాటు లభించును. విద్యార్థులకు, రాజకీయవాదులకు, వర్తకులకు మంచి అనుకూలమైన కాలము.

జ్యేష్ఠ వారికి గ్రహబలం బాగున్నది. ఉద్యోగంలో మంచి అభివృద్ధి కలుగును. కుటుంబంలో శుభకార్యములు ఫలించును. అయితే దర్జా, ఔదార్యములకు, సుఖవిలాసములకు ధనవ్యయం హెచ్చుగా జరుగును. నూతనగృహాది లాభము కలుగును. రాజకీయాల్లో మంచి విజయం, పరపతి, పదవీ గౌరవము, బంధుమిత్రుల చేరిక మొదలగునవి జరుగును.

## ధనుస్సు (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పా.)

మూల నక్షత్రంవారికి గతంకంటె కొంత బాగుగా నుండును. మొదటి పదిహేను రోజులు శ్రమ హెచ్చు. రాజకీయవాదులకు మంచి పేరు ప్రతిష్ఠలు, ప్రజాసమ్మానము జరుగును. అయితే శుభకార్య ప్రయత్నములకు ఆటంకము కలిగి వాయిదా పడుచుండును. ఆదాయమునకు మించిన వ్యయం జరుగును. కోర్టీ పరీక్షలకు వెళ్ళేవార్లకు మేలుగా నుండును. ఉద్యోగులకు, వర్తకులకు, వ్యవసాయదార్లకు అన్నిరంగాలవారికి లాభదాయకముగా నుండును.

పూర్వాషాఢ వారికి శరీరశ్రమ, నలత, స్వల్పంగా అనారోగ్యము చేయును. ఆర్థికంగా తొట్రుపాటు కలుగును. అతి స్వల్పంలో సాధించవలసిన పనికి కొన్ని వారములుకూడ పట్టును. మొదట పదిరోజులు మరింత నలత చేయును భార్యకు కూడ స్వల్పంగా నలతచేసి నిమ్మళించును. వ్యయం హెచ్చుగా నుండును. శత్రు ఋణబాధ హెచ్చుగా నుండును. ఆత్మీయులతో విరోధము, మాటపట్టింపులు వచ్చును.

ఉత్తరాషాఢ 1పా. వారికి కొంత సామాన్యముగా నుండును. ధనవ్యయం కల్గును. 16వ తేదీవరకు ఉష్ణాధిక్యం, శ్రమ కలుగును. శరీరంలో అనారోగ్యం లేకపోయినా, ఏదో అనారోగ్యంతో బాధపడుచున్నట్లు అనిపించును. మానసికంగా దిగులు కలుగుచుండును. ఉద్యోగ వ్యవహారములన్నీ అనుకూలముగా నుండును. రాజకీయ నాయకులకు సామాన్యముగా నుండును.

## మకరం (ఉత్తరాషాఢ 2, 3, 4పా. శ్రవణం, ధనిష్ట 1, 2 పా)

ఉత్తరాషాఢ 2, 3, 4పా. వారికి కుటుంబంలో ధనవ్యయము, కలతలు ఉన్నను, ఏదోవిధముగా సద్దుకొనిపోవుట జరుగును. అవసరములకు తగినట్లు, ఎప్పటికప్పుడు సర్దుబాట్లు జరిగి సరిపోవుచుండును పెద్దగా తొట్రుపాటు ఉండదు. బంధుమిత్రాదుల మూలకంగా ధనవ్యయం హెచ్చుగా నుండును. 16వ తేదీవరకు శ్రమ, వేడిమి కల్గును.

శ్రవణం వారికి నెలంతా రాజయోగదాయకముగా నుండును. అనుకొన్న పనులన్నీ నెరవేరును. సువర్ణ వస్త్రాభరణప్రాప్తి కలుగును. సోదరీ సోదర వర్గముతో మంచి అనుకూలంగా ఉండును. వారివలన మేలు కలుగును. శుభకార్య ప్రయత్నాలు నెరవేరును. ఉద్యోగులకు ప్రమోషను కలుగును. విద్యార్థులకు, వర్తకులకు, వ్యవసాయదారులకు మంచి ప్రోత్సాహకరంగా నుండును.

ధనిష్ట 1, 2పా. వారికి నెలంతా కార్యవిఘ్నం, శరీరశ్రమ, ఆవేశంతో తొందరపడి పనులుచేసి, తర్వాత విచారించుట, బంధువులతో విరోధం మొదలగునవి జరుగును. అయితే సంతానమునకు మాత్రం అన్నివిధాల అభివృద్ధి కలుగును. తరచు ప్రయాణములు చేయును. అవన్నీ సఫలములు కాక ధనవ్యయ

మగుట జరుగును. ఉద్యోగులకు, విద్యార్థులకు కొంత మేలు కలుగును.

**కుంభం** (ధనిష్ఠ 3, 4 పా. శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పా)

ధనిష్ఠ 3, 4పా. వారికి 1, 2పా. వారికంటె కొంత మేలుగా నుండును. అయితే మానసికంగా వ్యథ, ఆందోళనము, ధనవ్యయము, పనికిమాలిన ఆలోచనలు, ప్రతి విషయంలోను ఉద్రేకం హెచ్చుగా నుండును. రాజకీయంగా విజయం కలిగి పలుకుబడి హెచ్చుగా నుండును. కుటుంబంలో సుఖశాంతులు వృద్ధి పొందును. కాని ఋణము పెరుగును.

శతభిషం వారికి తలచిన పనులన్నీ నెరవేరినా, తగినంత ధనవ్యయము కూడ హెచ్చుపాళ్ళలో జరుగును. కాలం అనుకూలంగా ఉండుటవలన ప్రతి పని దానంతటదే నెరవేరినా, ఈ నక్షత్రంవారు పని నెరవేరదేమో అని విపరీతంగా ధనవ్యయం చేయుదురు. స్వల్పంగా ప్రయాస పడుదురు. శుభకార్య ప్రయత్నాలకు ఆటంకము కలుగును. 16వ తేదీవరకు ఉష్ణాధిక్యం కలుగును.

పూర్వాభాద్ర 1, 2, 3పా. వారికి శుభకార్యప్రయత్నములు నిశ్చయమగును. రాజకీయవాదులకు మంచి విజయం కలుగును. ఉద్యోగులకు, వర్తకులకు బాగుగా లాభించును. తలపెట్టిన పనులన్నీ వాటంతటవే నెరవేరుచుండును. విద్యార్థులకు మంచి ప్రోత్సాహకరంగా నుండును. 17వ తేదీనుండి శరీరంలో వేడిమి, శ్రమ కలుగును.

**మీనం** (పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి)

పూర్వాభాద్ర 4పా. వారికి 17వ తేదీనుండి వేడిమి, శ్రమ కలుగును. మంచి ధనలాభం కలుగును. ప్రతి విషయంలోను ఉత్సాహం, గౌరవ బాగుగా నుండును. కార్యవిజయం కలుగును. రాజకీయవాదులకు విధిగా విజయం కలుగును. విద్యార్థులకు, వర్తకులకు, వృత్తిపనివారికి నూతన వస్తుసంపాదనము జరుగును. ధనం పుష్కలంగా లభించును.

ఉత్తరాభాద్ర వారికి ఆరోగ్యం బాగుండును. శుభకార్య ప్రయత్నములు జరుగును. రాజకీయవాదులకు విజయం తథ్యం. ప్రజాగౌరవ సన్మానములు బాగుండును. సద్గోష్ఠి, సత్సహవాసం కలుగును. కుటుంబంలో సుఖశాంతులు వృద్ధి పొందును. బంధుమిత్రాదులతో మంచి అనుకూలత కలుగును. అన్నివర్గాల వారికిని శుభాభివృద్ధిని కలిగించును.

రేవతి వారికి నెలంతా శుభప్రదమైన కాలము. శుభకార్య ప్రయత్నాలకు, బంధుమిత్రాదులకు వ్యయం హెచ్చుగా జరుగును. కుటుంబ సంసారసౌఖ్యం బాగుగా నుండును. ఉద్యోగ, వ్యాపార వ్యవహారములలో అనుకూలంగానే ఉండును. ఉత్సాహం, ఆనందము, సుఖము కలుగుచుండును. విద్యార్థులకు, వర్తకులకు, మంచి ప్రోత్సాహకరంగా ఉండును.

సిద్ధాంతి: **నిష్ఠల వేంకట సత్యసుబ్రహ్మణ్యం**


**Statement about Ownership and other Particulars about Newspaper,**

**BHARATHI**

From IV [See Rule -8]

1. Place of Publication : VIJAYAWADA
2. Periodicity of PUblication : MONTHLY
3. Printer's Name : S. Radhakrishna
   Whether Citizen of India : Yes.
   Address : 14-14-21, Mallikarjuna Rao Street, Vijayawada - 520 003
4. Publisher's Name : S Radhakrishna
   Whether Citizen of India Yes.
   Address 14-14-21, Mallikarjunarao Street, Vijayawada - 520 003
5. Chief Editor's Name S. Radhakrishna
   Whether Citizen of India : Yes
   Address 14-14-21, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3
6. Names and Addresses of Individuals who own the News paper and partners or share holders holding more than one percent of the total cappital
   (1) Name : S. Kamakshamma, 1, Luz Avenue Mylapur, Madras - 600004, (2) S. Radhakrishna, Address : 14-14-21, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3, (3) Name · S. Nageswara Rao, Address · 1, Luz Avenue, Mylapur, Madras - 600 004, (4) Name : S. Rajeswari, Address : 14-14-21, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3, (5) Name . S Seshamma, Address . 1, Luz Avenue, Mylapur, Madras - 600004, (6) Name · G. V. Subba Rao, Trustee Amrutha Dharma Nidhi, Address : 42-45 Luz Church Road, Madras - 600004, (7) Name · S. Ramayamma, Address 1, Luz Avenue, Mylapur Madras - 600004, (8) Name P Satyanarayana, Address . Plot No. 28, Bhagyalakshim Nagar, (Behind Kalpana Talkies), Hyderabad - 500380, (9) M/s. Sambhu Prasad & Sons P. Ltd. 63, Rayapattah High Road, Madras - 600004, (10) Mr M. S. Kini, 1-9-1122/3/1, Dayananda Nagar, Hyderabad - 500004, (11) Sri V. Sundaram, No. 20Frist Main Road, Thiruvanmiyur, Madras-14, (12) Sri R. Gopalakrishna, 79 Venkateswaranagar, Kottivakkam, Madras - 600041, (13) Sri S. Sreeramamurthy, 63 Rayapettah High Road, Madras - 600004, (14) Master S. V. S. Arvind, 1, Luz Avenue, Madras - 600004, (15) Smt. P. Nageswaramma, 1, Luz Avenue, Madras - 600004, (16) Dr. P. S. N. Murthy, 8-2-322, Banjara Hill, Hyderabad.

I, S. Radhakrishna hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**S. RADHAKRISHNA,**

1-3-1989 Signature of Publisher.

డాక్టరు చల్లా రామచంద్రశాస్త్రి

# శతాబ్ది శిఖరము నధిగమించిన వేంకట పార్వతీశ్వర కవులు

ఈ కవిపుంగవులు మనలో ఒకరై నిన్న మొన్నటివరకు సంచరించిరి. మనమెఱుగని శ్రీనాథ, తిక్కన, పెద్దనలను స్మరించుకుంటూనే వున్నాము. ఇప్పుడు వారిని స్మరించుట మన విధి కాదా! మన భాగ్యవశమున వారీ పురివారలై నవ్యసాహిత్య కల్యాణ మందిరానికి పునాదిరాయి వేసిరి. కవిత్వమెలా వుండాలో వారు వరవడిపెట్టి చూపిరి. కవిత్వ మనలు తిక్కనగారి దృక్పథంలో

లలిత పద హృద్య పద్యం
బులన రథార్థంబు ఘటిత పూర్వాపరమై
యలతి యలంతి తునియలుగ
హల సంధించిన విధంబు నమరగ వలయున్.

అక్షరాలా వీరి కవిత్వమట్టిదే!

వీరిరువురు జన్మించిన గ్రామములు వేరు. వారి వృత్తులు భిన్నములు. కవనమున కలిసి ఒక శుభసమయాన కీ॥ శే॥ నడకుదుటి వీర్రాజు పంతులుగారిచే 'జంటకవులు'గా వెలయింప బడిరి. నాటినుండి వారి లేఖినినుండి వెలువడిన అనేక కావ్యములు, నవలలు, అనువాద సాహిత్యములు, నాటకములు, గేయములు ఆంధ్రదేశపు నాలుగుచేరల ముంచెత్తినవి. క్రొంగొత్త పోకడలతో ప్రాచీన సంస్కృతిని వీడక అధునాతన సాంప్రదాయములు మేళవించి నవరసముల నొలికించి కవనధారల వర్షించి ఆంధ్ర భాషా సరోవరమున రాజహంసలై నూతన కవులకు హొయలు జూపి నడకలు నేర్పిరి.

జంటకవులై అవధానముల సేయలేదు. వేదికలపై గండ పెండేరములు, కనకాభిషేకములు ఆశింపలేదు. పీఠికాపురమున "కవులన మేమే వేరొక్కరుండ తగ"రని గర్వించలేదు. ధనాఢ్యులకు తమ కావ్యముల నంకితమిచ్చి పడుపుకూడు భుజించ లేదు. అద్వయి భావమున జీవాత్మ పరమాత్మల ఐక్యమును తమ వ్యక్తిత్వములోనే నిరూపించిరి. ప్రకృతి నారాధించి అందలి సౌందర్య మెట్లు గ్రహింపవలెనో విప్పిచెప్పిరి. ప్రేమ భావము భగవంతుని యెడలనే చూపి తుచ్ఛ కాముక చింత దరి చేరనీక మానవతావాదమున తమ వెలుగు చూపిరి. వారు నిరసించినది కుకవులను, మానవునిలోని అంతశ్శత్రువులను మాత్రమే. సాంప్రదాయపరులను రెండు చేతులతో నాహ్వానించి సమ భావమునే తమ ప్రవృత్తిలో, రచనలలో, నడవడిలో చూపిరి.

వారికీ ఆంధ్రదేశము చేసినదేమి? ఏమియూ లేదనే చెప్ప వచ్చును. కాని వారు ఆంధ్ర ప్రజకు, భాషకు చేసిన సేవ ఎనలేనిది. అందుకు వారికెంతైనా ఈ నేల ఋణపడి ఉన్నది. ఇప్పటికైనను, అకాడమీవారుగాని, విశ్వకళా పరిషత్తులుగాని వారి పేరనొక శాశ్వత చిహ్నమునకై ఆంధ్రభాషలో యూనివర్శిటీ స్థాయిలో పతకములను, స్కాలర్‌షిప్పులను యిచ్చి గౌరవించుట విధి శాశ్వతముగా పీఠికాపురమున వారి స్మృతిచిహ్నము నేర్పరచుట ధర్మమైయున్నది. అక్షర చిత్రణమున వారిని నేనిట్లూహించి కీర్తించుచున్నాను.

నాల మున్నీటి లోపల తేలియాడెడు
హంసల బోలి విహారములను
హరి హరాద్వైతమే ఆకారముల దాల్చి
వాకొను కవితలో ఏకమగుచు
పీఠికాపుర రాజవీధుల నడయాడు
జంట రాజసగుణ సాత్త్వికములు
ఒకరితో మాట్లాడ నురుతర గర్జన
విరియు వెన్నెలవాన వేరొకరిది

మూతి మీసము లేకున్న భీతి యొకట
మీసములనుండి చిరునవ్వు మెరయు నొకట
వారు వేంకట పార్వతీశ్వరులు కవులు
జంట చేతుల వ్రాసి యశంబు గనిరి.

వారు కీర్తికాంతులు గారు. ధనపిపాస లేదు. సన్మానముల నాశింప లేదు. వారి కావ్యములు, రచనలు రవ్వంత యోపికతో చదివి ఆ యమృతధారల నాస్వాదించినప్పుడే వారికి ఘనమొసగు నివాళి కాగలదు.

ఈ కవులకు 1943 డిశంబరులో రాజమహేంద్రవరమున కీ॥శే॥ సొంఠి రామమూర్తిగారు అధ్యక్షతను షష్టిపూర్తి సన్మాన సభ జరిగినది. అందు శ్రీరామమూర్తిగారు తమ యుపన్యాసములో యన్నమాటలు:- "కవిత్వం వేరు, జీవితం వేరుగాదు. తెలుగు దేశము, తెలుగుదనము, హిందూత్వము బహిః ప్రపంచములో అంతరాత్మను చూచుచు, చంపుచు, దానితో సమ్మేళన మగు చుండును. రెండు లోకములలోగూడ మన జీవనము వ్యాపించిన దని, చూచెడు బహిః ప్రపంచముకన్న చూడని అంతర్లోకమే యథార్థమని నమ్మెడి మానవజాతి హిందూజాతియే. మనకడనుండి మతము గైకొనిన చైనా కూడ యీ ధర్మమును గ్రహించలేదు. పాశ్చాత్యులకు లోకమే నిజము. ఆత్మ మాయ. చైనావారు ఆత్మ యున్ననూ లేకున్ననూ లోకము నిజమనియు దానితోనే మన జీవనము సరిచూచుకొనవలెననియు నమ్మెదరు. మనము పరలోక మెట్లు మాయకాదో యట్లే యిహలోకమును మాయ కాదని నమ్మె దము. అంతర్బహిః ప్రపంచములు రెండునూ నిజమే. అందుకే ఆత్మయే బ్రహ్మమందుము. శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు ఈ తత్త్వమును గ్రహించి భౌతిక, ఆధ్యాత్మిక తత్త్వవిజ్ఞానము లను రెంటినిగూడ వారి రచనలలో తెలియజేసినారు. కవిత్వము జీవనమునుండి వేరుకాదు. జీవనమే కవిత్వము. జనులు, కవులు, యతులు మూడు విధములుగా జీవనము ననుసరింతురు. జనులకు ఆశ, కవులకు భావము, యతులకు అనుభవమును ప్రాధాన్యములు. కవులకు మనస్సునుండి పాటలెటులో, జనులకు మట్టినుండి పంటలు అట్లే. కవుల పాటలకు మాటలుండవలెను. వారి భావ ములు రూపములు దాల్చవలెను. యతుల పాటలకు మాటలు లేవు. వారి పూరుషునకు రూపము లేదు. వారి శక్తికి ఖండత్వము లేదు. జనుల ఆశలు, యతుల అనుభవములు, రెంటినీ గ్రహించిననే కవుల రచన ఆనందముగ, శాంతిపూర్ణముగ నుండును. ఆంధ్రులకీ తత్త్వము నైజము. ఈ కవులిది గ్రహించినారు."

సన్మాన పత్రములో ఇంకనూ వారి నిట్లు కొనియాడిరి "మీ 'కావ్య కుసుమావళి' పరిమళించినది. మీ 'ఏకాంతసేవ' ఫలప్రదమై లోకమున బృందావనము వెలసినది. మీలో ఒకరు హృదయం, ఒకరు మేధ. ఒకరు పార్వతి, ఒకరు శివమూర్తి ఒకరు రసమూర్తి, ఒకరు రసతంత్రవేత్త. వెరశి వేంకట పార్వతీశ్వర కవులైరి.

వీరు తిరుపతి వేంకట కవులవలె సింహగర్జనలు చేసి దద్దరింపజేయలేదు. కొప్పరపువారివలె హూటాహూటీ ధణాధణా మ్రోగి జనుకించలేదు. కృష్ణశాస్త్రి, విశ్వనాథలవలె ఊరూరా సభలు జరిపి కప్లు బైల్లు కిమ్మించలేదు.

"భావనా బలమున్నది ప్రకృతియున్న
దిష్టముండిన పదముల కేమి కొరత"

అనే ధీమాతో హైరాను లేకుండా కవిత్వ వ్యవసాయం చేసిన వారు వీరు. వీరిలో ఉపశ్రుతి ఎక్కడా కనుకోలేము."

ఇంతకంటె సమకాలీన మహావ్యక్తియొక్క సదభిప్రాయ మింకేమి కావాలి?

ఇక వారి రచనలలోని కొన్ని మచ్చుతునకలూ వారి కవితా విశిష్టతలూ ఈ క్రింది యుదాహరణలలో గమనించతగియున్నవి.

1. అసలు కవిత్వం ఎలా ఉండాలో, కవియొక్క ఘనత యెట్టిదో ఇట్లు తెలిపారు.

"కవిత కవి మూలమున కవి కవితవలన
ఘనతర స్థితినందుట గలుగుచుండు
కవిత బోలిన మధుర వస్తువులు లేవు
కవుల బోలిన ధన్యమానవులు లేరు."

అని వక్కాణించారు.

2. దుష్కావ్య రచనల నిట్లు నిరసించిరి.

"అరసి చూడ నిరర్థక మగునయేని
నక్షర సమిష్టియే పదమునగ గాదు
లోక హిత లక్షణయుతంబు గాకయున్న
బద్య గద్యాత్మకంబె కావ్యంబుగాదు.

హృదయ భావంబును వెలయింపకున్న
కలము పట్టిన మాత్రాన కవులుగారు
ఉచితగతి రసభావంబు లొప్పకున్న
కవులు వ్రాసిన దంతయు కవితగాదు.

అల్లిబిల్లిగ పద్యంబులల్లు కొరకె
గణ యతి ప్రాసముల గట్టిగా గుదించి
పద్యములలోన పద్యముల్ పన్ను కొరకె
ఓష్ఠ మస్పర్శకంబు నిరోష్ఠమనుచు

ద్వ్యక్షర ద్వ్యక్షరై కాక్షరంబు లనుచు
ప్రాస గతులంచు శబ్ద చిత్రంబు లనుచు
సర్వ గురు లఘువర్ణ ప్రసారమనుచు
వ్యర్థ వాక్యావళీ విడంబనము కొరకె

వ్రాయబడినవి యెల్ల కావ్యంబులగునె?
నెల్ల ధర్మంబు లక్షరాకృతిగ జేసి
హృదయ ఫలకంబునందు చిత్రింపజాలు
నట్టి కావ్యంబె సత్కావ్యమగు నిజంబు"

అని నిరూపించారు.

**3. అద్యతన ముక్త ఛందో గద్యాత్మక రచనల గురించి వారి యభిప్రాయము:**

సీ॥ గణ యతి ప్రాసలక్షణము లేమిటి 'కైడియా'
కుంటువడి పోవుననెడివారు
గణముంట దగ 'నైసుగా' నుండు జదువ ద
క్కనవి "యూసులెస్స"ని కెరలువారు
వ్యాకరణంబేల వలదు "మైండున" కెక్కు
నట్లు వ్రాయంగ వలయు ననెడివారు
కాదొక్క కవి ప్రయోగంబున్న జాలు "స
ప్లై" చేయనగునని పలుకువారు

నగు మహానుభావులు కవులైరి నీకు
ప్రాణములు మీదికిని వచ్చె నచ్చటచట
విబుధులున్న వారమృతంబు వేయగలరొ
యురక చూచుచు నుండెదరో తెలుంగ!"

పాండు రోగము కలవాని దేహమువోలె
బైపూత మెరుగుల పద్యములును
నబలుని యంగంబులట్లు నీరసములై
పసివాళ్ల వారెడి వచనములును
నరవి నుస్మృత్త ప్రసంగంబుల బోలి
కడు నసందర్భ దుష్కల్పనలును
కల్లు ద్రావినవాని కారుకూతలు వోలె
బడ బడ లాడెడు పాడు పదము

లివియు నవియును యని చెక్క యిడగ రాక
వెడలుచుండె నీనాడు వివేకమును స్వ
భావము నను మాటయె లేదు; పదకవులకు
నకట! యికమీద నెటులౌనొ యాంధ్రభాష!

కేవల శ్లేషయే కాలయును కావ్య
మాధురి కను బుద్ధి మానుదాక
మన నారికేళ పాకమున గ్రంథము వ్రాయ
కవి ప్రౌఢుడనువాడు కడచుదాక
దీర్ఘ సమాసముల్ తెగి వ్రాయకుండిన
తేలికయను వెట్టి తీరుదాక
నొక శబ్దమగు పల్కులుండు పద్యంబులే
హృద్యంబులను నాడు లేగుదాక

దలచినప్పుడె యెన్నొ పద్యములు వ్రాయ
దగు నన్కవులు జనించుట తగ్గుదాక
నెంత తపియించినను నీకు నెప్పటివలె
వెలయు భాగ్యము గలుగదో తెలుగుబాస!

పండితుల్ మొదలు బాలునివరకు జదువ
దెలియగల యట్టి గ్రంథముల్ వెలయుదాక
నవి స్వభావాన్వితంబులై యలరుదాక
నాంధ్రభాష సమభివృద్ధి యగుట కల్ల.

అని వాపోవుచూ,

"కవిత రసవంతమై సులలిత శయ్యా చమత్కృతి కాల వాలమై వెన్నెలతేట నిగ్గు పసయును, అరవిందపు రేకు మృదుత్వమును పదములు పదార్థవిన్నియ జాళువా పసిండి మెరుగుల ధళధళ్యమును గలిగి కావ్యనాయికలలో ప్రత్యేక వ్యక్తిత్వ మొంది కొనియాడ దగియున్నది" అన్నారు.

4. కావ్యేందిరకు భాషయే శరీరమని వక్కాణించుచు

శక్తి వెలియైన కావ్యోక్తి సాదనంబు
కల్ల జీకటి యింటిలోని సరుకులు
ఎన్ని ఋతువులు గలిగిన నెట్లు పూచు
మహి వసంతాగమము లేక మావి మోక?

5. భక్తిభావమున వీరి రచనలు పోతనగారికి సాటివచ్చుననుట అతిశయోక్తి కాదు. భక్తితో వినమ్రములై మానవుని యల్పత్వ మెంతటి యహంకారమును పెంచునో తెలుపుచూ దాని వ్యర్థత్వమును ఇట్లు చెప్పిరి.

"కుక్క గొడుగు క్రింద కూర్చుండి
ఛత్రాధిపతి ననుకొని జడిబడలు వడితి
చలి ముడిగితి వడ గడలితి"........."

కుమ్మరి సారెపై జేరి భూచక్రమెల్ల
నా యధీనంబని నమ్మి దండధరుండనై
కన్నుగానక యలజడి బడితిని
మేను తెలియక త్రిప్పలు బడితిని.

నా రాచరికమెల్ల నాశనమయి పోయినది
నా యహంకార భూత ముడిగిపోయినది
గొడుగు ముడిగి పోయినది
అధమ మర్త్యుడనని నేడరసితి ప్రభూ!"

భక్తి పారవశ్యముగ "వేంకటేశ్వర స్తుతి"లో మనలను ఏడు కొండలూ ఎక్కించి ఆరోహణ క్రమములో పైకి తీసికొని పోయిరి.

"కలవాడా! భువనైక మాత కమలా
కల్యాణి వక్షంబునన్
గలవాడా! యపవర్గ నిర్గమన మా
ర్గ శ్రేణి తానేడు కొం
డలవాడా! జిగిమించు క్రొందళుకు బం
డారంపు బంగారు వ
ల్వలవాడా! యని నిన్ను బిల్తు నలమే
ల్మంగా మనోనాయకా!

6. కర్మ అనుభవించుటలోగల తుష్టి-అసంతుష్టి ఎట్లు మేళవించి వుండునో నిరూపిస్తూ ధనపిపాస, దానికోసం పడే అగచాట్లు తగవని నిష్కర్షగా నిరసించినారు.

"తన తల్లి తనకయి తాయమేదియో గాని
ప్రేమతో తన చేత బెట్టినట్లు
కరుణతో నాకీవు గట్టిపెట్టిన గుట్టు
పుట్టువు ఫలము పోగట్టుకొనక
ఇష్టమో కష్టమో ఎరుగక ననుభవిం
చుచును యుంటినించుకంతయు తరుగలేమి?
రేపుండదను భయముచే నేను
తక్కువ చేకొని తినుచుంటినా

ఇదియైనచో వెంటనే నిను బట్టుకొని
ఏమియైనను బెట్టమని పదింపదిగ
నొంతునని నీవె దీని నక్షయంబు
చేసితివో నిజమాడుము ప్రభూ!"

"కాని యైనను చేత లేని ఈ సమయమందును, నేను ధనాఢ్యుని వలెనే ధైర్యగరిమతో నిలిచియున్నాడను. డంబము చూపి లోకంబు నెట్లయినను మోస మొనరింపనగు గదా యని కాదు.

నాతో ఒక కాసు వెంటరాదని నేనిప్పుడు దానికై పరితపించుట ఎందులకు? దాని జూతునేని పోవునపుడది నా తోడ రావలదె! అది వలదు. నాకు శాశ్వతమైన భక్తిధనము గడించుకొంటిని. దాని తలపులో నినుగొలుతు నాకేమి లోపము ప్రభూ!"

మరియొకచో శుష్కకవనముల నిరసనము చూడతగియున్నది.

"కాయపై శితకంటకముల గన్నంతనే
పనస నుమ్మెత్తల బంతి కీడ్చి
పై తోలు గింజలోపల జూచినంతనే
మామిడి వేపకొమ్మలకు గట్టి
మెడమీది జూలు వ్రేల్మిడి గాంచినంతనే
సింగంబు కుక్కల జెంత జేర్చి
దౌడలో గొమ్ముల జాడ గన్నంతనే
మదకుంభి పందుల మందబెట్టి

మంచి చెడ్డ లేర మతిలేక గతిలేక
చూచినట్లు నాకు తోచినట్లు
కపిత గట్టి దుష్కర కర్మం బొనర్చిన
వికృతి నన్ను బ్రోనవే పరేశ!"

ప్రేమసాక్షాత్కారములో :- రాధాకృష్ణుల ప్రణయ భావమును భక్తి భావముగా ప్రస్ఫుటముచేసి ధన్యులైనారు.

"కళ్యాణమయుడింత వన్నించినంతనే
చక్కనివారిలో లెక్కనైతి
కరుణాకరుడింత దరి జేర్చినంతనే
కొలిచినవారిలో గొప్పనైతి
మహనీయ గుణుడింత మది గూర్చినంతనే
నమ్మినవారిలో నాణెమైతి
మదను మోహనుడింత మన్నించినంతనే
ప్రేమించువారిలో పెద్దనైతి

నన్ను గని ప్రేలుకొనువారి వన్నె దరుగ
ఖిన్నులై జాలి గొనువారి కన్నులలర
ప్రాణపదముగ నెంచి నన్నలుకరించు
నాత్మ విభుజేరి నే ధన్యనైతినమ్మ!

అలతి యలతి పదములతో పద్యములగూర్చు సొంపు వారి సొత్తు అనుటకు :-

నెల బాలుడు తల పూవట
తెలి బాలుడు కొమరుడంట! తెలిదా మరలో
పలి బాలుడు పెనిమిటి యట
తెలి చెలియట తాను! భారతికి జేజే!

వారు కవిరాజ హంసవెప్పుడో అయినారు. ఎట్లనగా 'జీవామృతము'లో

"రాతిరియున్ బవల్ మరపురాని మహోన్నతినంది గోత్ర సం
జాత గురుప్రశస్తి గని సంయమమూర్తిని గాంచి వాతశీ
తాతప బాధలం గన వహార్య వరేణ్యు తలంప నీవెకా
దాతవు నేతవున్ స్థితి విధాతవు మా "కవిరాజ హంసవున్"

"కవి నగుచు రాజు నగుచును
వివరింపగ హంసనగుచు విద్యార్ణవ సం
భవ సుకృతి నలంకృతి గతి
దివి భువి మెచ్చంగ భారతిని సేవింతున్."

మరియొకచో వేంకటేశ్వర స్తుతి చేయుచూ :-

"నీ నామామృత సేవకున్ మరగెనేనిన్ మానవుండన్యమున్
గానం గోరడు సుమ్ము మానససరోనాశిక నాళాద నే
చ్ఛా నీతంబగు రాజహంస మది గాంచం గోరునే నత్తలన్
మౌనీంద్రార్చిత పాదపద్మ మలమేల్మంగా మనోనాయకా!"

వారు ప్రకృతి పురుషుల ఛాయామూర్తులుగా భావించి ఆ కలయికలో అద్వైత మెట్లు నిమిడ్చిరో తెలియుటకు:-

మూర్తి :

నిండు వెలుగున జూచితి నీవు లేవు
నిండు చీకటి గాంచితి నీవు లేవు
వెలుగు జీకటి నందుల వెదకి కూడ
నాడు నా చాయ! నిన్ను గానంగనైతి!

ఛాయ :

నిండు వెలుగు దలంపగా నీవుగావె?
నిండు చీకటి గణియింప నేనుగానె!
వెలుగు జీకటి మనస్మైన విధము దెలిసి
నాడు నామూర్తి వేరె కానంగనేల?

ఇచ్చట 'మనస్మైన' అనుటలో మనము - మన మిరువురము అనియు 'మనస్సు' అనియును వివరణ నధోపీఠికలో పొందు పరచిరి.

ఇక వారి 'జీవామృతము'లో అమృత రసాయనము తామాస్వాదించుటయే గాక అందరికీ అందించిరి.

జ్ఞాన మక్షరసౌఖ్య నిధానమగుట
ఆ నిధాన మానంద నిదానమగుట
అదియె విశ్వ జీవామృత మగుట దెలిసి
అనుభవింతు నాయమృత రసాయనంబు

ఈ మకుటముతో వారెన్నియో పద్యములు వ్రాసి వారు యాధ్యాత్మిక తాత్త్విక చింతలచే నమృత గుళికలనిచ్చి ప్రకృతి నారాధించి ఆకళింపు చేసుకొని తాదాత్మ్యము చెంది సాధకులైరనుట అతిశయోక్తి కాదు.

ఆది యున్నదటంచు నభిమాన ముంతునా
ఏ మూల ఏ త్రోవ ఎరుగవచ్చు
అంతమున్నదటంచు నంగీకరింతునా
ఏ చోటికేనాటి కేగవచ్చు
మధ్యమున్నదటంచు మనసుంచుకొందునా
యీ మొండితనమున కేమివచ్చు
ఆది మధ్యాంత శూన్యత నిజంబందునా
నా యునికి నేమని నమ్మవచ్చు

తుది మొదలు లేని శంకలతో బనేమి
నేను లేదనుకొను తెల్వి నిల్చునాడె
నేను జీవుడనను భ్రాంతి మానునాడె
అన్నియును దీరు బరమాత్మ నైననాడె

"సిద్ధసారామృత రసము" న్నాని యాని దానిలో మేను మరచి పోయిరనుటకు నిదర్శనము:-

సాగర గంభీర జలతరంగములందు
నవ ఘనాఘన ఘోషణంబులందు
మధు మనోహరమంద మందానిలములందు
సరస శకుంత కూజనములందు
నిర్మల నిర్ఝరిణీ నినాదములందు
వనశైల కందరస్వనములందు
మణిమయ పల్లకీ మంజు నాదములందు
శిశుగణావ్యక్త భాషితములందు

ప్రణయ మిధునానురాగ భాషణములందు
విశ్వవిజ్ఞాన సంగీత విమల కళలె
నాద బిందు చిదానంద నవ్యకళలె
ఆలకించుచు నుందు గర్ణామృతముగ

వారికి ప్రణవనాదానందము పరాకాష్ఠ నందినదీ పద్యములో

నాదం బోంకారముగా
వేదంబీ విశ్వరూప విజ్ఞానముగా
వాదము రసభావముగా
నాదియు నంతంబు గలిపి యామోదింతున్.

త్రికరణములతో ప్రకృతి నవలోడనముచేసి సృష్టి చిత్రముల నవలోకించి పరవశులై రనుటకు :-

తలపులోన బెంచు తాబేటి గనుగొందు
జూపులోన బెంచు చేప గందు
బొదిగి సంతు బెంచు పులుగును దిలకింతు
త్రిగుణ సృష్టి గాంతు త్రికరణముల.

సిద్ధామృతాస్వాదనముచే బ్రహ్మపదవిని గని ధన్యులై రనుటకు :-

విషయ చింతలడచి విమల మార్గముగంటి
శోక మడచి సుఖము చూఱగొంటి
జీవ చింతలడచి సిద్ధామృతము గొంటి
ప్రకృతి నడచి బ్రహ్మపదవి గంటి

విమల తత్త్వామృతము సేవించి ఆనందబ్రహ్మ సాక్షాత్కారము నంది ధన్యులైరి:-

"నేనెవ్వడ ననుకొనగా
నేనా జీవుడను గాను నిజమనుకొనగా
నేనే లేదనుకొనగా
నానంద బ్రహ్మమైతి నమృతంబైతిన్"

"చిగురు పొత్తిళ్లలో చిన్నారి మొగ్గనై
మూక తెమ్మెరలలో రేకువెత్తి
పూవు జవ్వరములలో బూదేనె సోననై
వలపు గాలువలలో వడిదబెట్టి
తీవ యుయ్యాలలో తెలి దోరపండునై
సంసారవాటిలో సారె బెంచి
పండాకు గిండిలో ఫలరసాయనమునై
ప్రజ్ఞాన నిధులలో బాఱబోసి

కేవలావ్యక్త గతి నహంకృతులు నేర్చి
ఇహ మెరుగ నేర్చి పరము నూహింపనేర్చి
నిత్య సత్య సుఖానంద నియతి నేర్చి
సుసుల తత్త్వామృతంబు సేవింపగంటి.

ఇక వారి "జీవ ప్రబోధము"లో ఐహిక సంసార బంధములలో దగుల్కొని పరమార్థచింత లేక పరువువెత్తెడు జీవుని సంబోధించి:-

"జీవుడా! నీలోన జిక్కుకొన్నదిర!
దేవుడా! యనిపించు తెలివియున్నదిర!"

కొడుకుల సంపద గూర్చియే చింత
కూతుంద్ర సుఖమును గూర్చియే చింత
యిల్లాలి పెత్తనం బెంచియే చింత
మనుమల కమ్మని మాటచే చింత

తనవారికని యిట్లు తలపోతలాయె
తనముందు గతిగూర్చి తలపలేదాయె
తన కనిత్వంబైన ధనరాశి కొఱకు
తన కనిష్టంబైన తగులంబు కొఱకు

తను గని వాని చిత్తంబున వలచి
తన కదియే ధన్యతమమని తలచి
ఆత్మను బంధంబులన్నియు మఱచి
మోహాను బంధమేమో నిజంబనుచు

తనకు మాలిన యట్టి ధర్మంబు కొఱకు
పరమార్థ మెరుగక పరువు లెత్తెదవు
జీవుడా! నీలోనె జిక్కుకొన్న డర!
దేవుడా యనిపించు తెలివి యున్న దిర!

భక్తిభావమును క్రుమ్మరించి "శ్రీశ" యను పద్యములలో అద్వైత తత్త్వ పరాకాష్ఠ నిట్లు ప్రకటించిరి:-

"వంతగించిన నా మనోభ్రాంతినైన
వెలుపలను లోపలను నీవె కలసి మెలసి
వెలసియున్నావు నిన్నెట్లు వేరొనర్తు
గని విని నుతించి సేవింతుగాక శ్రీశ!"

ఇక 'ప్రకృతి ప్రబంధకర్త'లో ప్రకృతియే ఆ ఆదిపురుషుని ప్రబంధము వంటిదని ఈ సృష్టినంతను వర్ణించి ప్రతి చెట్టు, పుట్ట, ఫలము, పత్రము, కుసుమము, నిర్ఝరి నదీ జీవజాలము లన్నిటను ఆ పరమేశ్వరుని దర్శించి దర్శింపజేసి తరించిరి. అందుదాహరణముగా మాత్రము ఎత్తి చెప్పి పరిహరింపదగిన అక్షరమొక్కటియు లేకుండుటచే ఆ మహనీయుల కవితాశక్తికి జోహారు చేయుటే నున విధి.

వారు స్పృశింపని ప్రకృతి చెయిదములు లేవు. వారు వర్ణింపని భక్తిభావము లేదు. వారి "కావ్య కుసుమావళి" "ఏకాంతసేవలు" నుతికందని మహాగ్రంథములు. వారీ తెలుగు నేలను గాక ఈ భారతదేశమున మరో ప్రాంతమున జన్మించి యున్నచో రవీంద్రుని బోలి నోబిల్ బహుమతి నందుకొని యుండెడివారు. అద్వైతతత్త్వము ఆ ఉభయ మూర్తులలో ఆలోచనలలో పోకడలలో ఏకరూపమందిన అవతార పురుషులు వారు. రససిద్ధులు, భావుకులు, సాధకులు. ఆంధ్ర భాషా సరస్వతికి కిరీటములో వెలుగుల జిమ్మెడు మణిద్వయము.

"జయంతితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః"

# తరణి ప్రతిరూపును!

## శ్రీ కూచిభొట్ల వెంకటశాస్త్రి

మెలకువలో నేను
విఫల స్వప్నారణ్యాలలో
తప్పిపోతున్నప్పుడు
నా నిట్టూర్పులు
తరణి తీరుస్తున్న కాలశిల్పాన్ని
తడుముతాయి....
తరిగిపోని తలపు నెగళ్లలో
జ్వలిస్తాయి....
—తలగడలో తలదూర్చి నేను
ఎక్కడెక్కడో తిరిగి
అజ్ఞాతానుభూతుల్లో
తిరిగి ఆవిష్కరింపబడుతున్నప్పుడు
అనుభవాల స్మృతిని....!
అప్పుడు నా రూపం
గుప్పెడు గుండె చేస్తున్న చప్పుడు
అయితేనేం
అనంత సాగరానికి నేనే ఆకారం
అలసిపోని చైతన్య తరంగాల సాకారం!
తల విదల్చుకున్న నేను
తరణి ప్రతిరూపును
ఇప్పుడు నా పయనం
పడమరకు కాదు;
ప్రభాతాల తూర్పుకు!!

# అంతరంగంలో అక్షరం

నేను రోదసిలో విహరిస్తున్నప్పుడు
నక్షత్ర చరణ కిరణాలు
శీతల నయనాల రుప్పులు విప్పి
చీకటి రహస్యాలు ముచ్చటించుకుంటూ
నా నెత్తిపై నర్తిస్తాయి.
సుందర మొయిళ్ళ పల్లకిలో
మంద మందంగా పయనిస్తున్న చంద్రుడు
సుస్మిత హాసనారవిందుడై
నవ్వుల పువ్వులు రువ్వుతూ
సెలయేటి నవ్వడి సరాగాలు వినిపిస్తాడు.
బ్రతుకు వీణ తీగ తెగిపోయి
బాధల గాథలు స్మృతిగా పాడినపుడు
జీవితాన్ని స్వర్ణకలశంతో
అభిషేకించుకునే తపన
అంతరంగంలో అక్షరమౌతుంది.
గడచిన కాలం జ్ఞాపకాలమీద
నడచిన ఆశల నిక్వణాలు
ఉనికికీ ఊహకూ
ఊపిరి పోయాలని
ఆకాసాన్ని అవనిపైకి ఆహ్వానిస్తుంది.
అగణిత పాలపుంతల వలయాన్ని
కంఠాన అలంకరించుకున్న ఆకాశం
నిరంతర నిర్నిద్ర జీవాలమీద
తన కరుణ పరాగ రేణువుల
పరిమళాలు వెదజల్లుతుంది.
పాలిపోయిన ముఖాల్లోంచి
తెలిపోయిన కన్నుల్లోంచి
సమస్యల మంచుపొరల మధ్యలోంచి
రాగరంజిత వెలుగు కిరణాలు
అంతరంగాల్లో కర్పూర దీపకళికల్లా
ధరణికి ఆభరణాల్లా
అజరామరంగా పయనిస్తాయి.

# సామ్యవాదం

శ్రామికోదర జనిత ఆకలి
జ్వాలల కీలలను చల్లార్చే
అమృత రసమధుర పేటిక!
వసంత పవన విమల వాటిక!!
దీన హీన వ్యథార్త రోదనల
వేదనా స్మృతులను పారద్రోలే
కరుణా తరంగాల మూర్తి!
మమతానురాగాల స్ఫూర్తి!!
కృషిక జనావళి గుండెల
మౌనఘోషను స్పృశించే
సజల హిమశైల తుషార బాల!
సస్యశ్యామల సుఫలహేల!!
కార్మిక కన్నులు స్రవించిన
అశ్రు గీతాంజలికి స్పందించే
ప్రశాంత ప్రగతి రూపం!
నిశాంత హృదయ దీపం!!
నీరవ నిశ్శబ్ద నిశీధిలో
జీవన స్రవంతిని అలరించే
చైతన్య అలల శిఖరం!
సహస్ర కిరణాల ప్రభాతం!!

శ్రీ సి. కామేశ్వరరావు

## "ఏమండీ. ఆ భరించలేని నొప్పి ఏమైంది!"

"పోయిందే!"




మేలుపరచబడిన **అమృతాంజన్** వాడడంతో,

కోమలమైన **అమృతాంజన్‌**ను చాలా సులభంగా రాసుకోవచ్చు.

మృదువైన **అమృతాంజన్‌తో** చాలా సులభంగా 'మర్దనా' వేయవచ్చు.

తలనొప్పులను, వొళ్ళు నొప్పులను, కీళ్ళ నొప్పులను, కండరాల నొప్పులను మరియు బెణుకులను మేలుపరచబడిన అమృతాంజన్ మునపటికంటే **అతి** త్వరితంగా వుపశమింపజేయగలదు!

# మేలుపరచబడిన
# అమృతాంజన్

మీ మోముపై చిరునగవులను శీఘ్రంగా- తిరిగి వికసింపజేయుగలదు!

Amrutanjan Limited 

OBM 149 TG R

## శబ్దానికి స్తబ్దత లేదు

సారస్వత వికాసానికి
మూలాధారం శబ్దం
సంస్కృతి మనుగడకే
పట్టుకొమ్మ శబ్దం!
సాహితీ నందనవనంలో
ప్రవల్లిక శబ్దం!
సంగీత సామ్రాజ్యంలో
స్వరవిపంచి శబ్దం!
మధుర నాదాల కలయిక శబ్దం!
గుండె లబ్‌డబ్‌ల మధ్య
నలిగే లయ శబ్దం!
పదాల గుట్టల్ని దాటుకుంటూ
నిరంతరాన్వేషణలో పరుగులు తీసేదే శబ్దం!
నలుగురి కలయికే శబ్దం!
నవ్యత నిచ్చేదే శబ్దం!
నలిగేకొద్ది శబ్దం చేవదేరుతుంది!
కొత్తకాంతులు చిందిస్తుంది!
నత్తనడక్కి నడ్డి విరగ్గొట్టి
కొత్త నడత నేర్పేదే శబ్దం!
నిద్రాణులకి కొత్త పొద్దే శబ్దం!
శబ్దవిరించికే అప్పుడప్పుడు
కొరుకుడు పడదు శబ్దం!
శబ్దానికి స్తబ్దత లేదు!
శబ్దాన్ని గాల్లోకి వదిలినకొద్ది
ఎగురుతూనే ఉంటుంది
పైకి యింకా పైకి!
ఆకాశంలో మబ్బుల కావ్యాల్ని తాకుతుంటు
కమ్మని గీతాల్ని ఆలపిస్తు!

**శ్రీ చొక్కర తాతారావు**

## నిండుకున్న గుండె రిజర్వాయర్

కంటికెందుకింత ఆకలి!
ప్రతి దృశ్యాన్ని మాత్రలా మింగాలని చూస్తుంది
చేదు అనుభవాలకు ఆశల షుగర్ కోటింగ్ పూస్తుంది.
ఈ మనసు కసలు బుద్ధి లేదు
నా కళ్ళు చెబుతున్న కవిత్వపు కథలు ఒద్దికగా వినక
ఎగరాలని ఉబలాటపడుతోంది ఎక్కడెక్కడికో.
ఆలోచనల ఆకాశంలో ఎగురుతున్న
జ్ఞాపకాల గాలిపటాలను
కాలం ముక్కలు ముక్కలుగా నరుకుతుంది గాలి
గొడ్డళ్ళతో.
ఓ ఏకాంత సాయంత్రం ఒడ్డున కూర్చున్నప్పుడు
జ్ఞాపకాలు కెరటాలు కెరటాలుగా వచ్చి
మెదడుకు ఢీకొడుతుంటాయి.
ఒకొక్క జ్ఞాపకం
ఆలోచనలతో మనసును మండిస్తుంది.
ఒకొక్క అనుభూతి
అశాంతితో మనసును ముంచేస్తుంది.
నిండుగా ఉన్న రిజర్వాయర్ ఈ గుండె!
రెప్పల క్రెస్ట్ గేట్లు ఎత్తగానే
కన్నుల డాముల్లో ఉన్న కన్నీరు కవితలా పారుతుంది
పండిన భావాల పంటచేలతో స్నేహం కోరుతుంది.
కోర్కెల గాళ్ళతో సంబరాల అంబరం ముందు
నిటారుగా నిల్చున్న జీవితాన్ని
విధి కసిరి గిరాటేస్తుంది.
పాయలుగా చీలిన మనసు నదిలో
ఊయల లూగుతున్న ఆనంద నౌకాశకలాలు
కొట్టుకుపోతుంటాయి పూర్వుల గాలికి
సుదూర మరుపు తీరాలకి.

**శ్రీ జి. వి. ఆర్. చంద్రమౌళి**

# కలగూరగంప

## భారతీయ సాహిత్యంలో 'ఊర్వశీ' తత్వము

ఊర్వశీ పురూరవుల కథ ఒక ఉపాఖ్యానంగా మహాభారతంలో ఉన్నదని అందరికీ తెలిసిన విషయం. ఋగ్వేదంలోని పదవ మండలంలో కూడ ఈ కథ ప్రస్తావించబడింది. ఇరవయ్యవ శతాబ్దంలో పలువురు భారతీయ కవులు ఈ కథను ఆధారంగా చేసుకుని కవితలు కావ్యాలు రాశారు. వీరికి ఊర్వశి ఒక అపురూప సౌందర్యరాశిగానే కాక ఒక తత్వంగా, ఒక ప్రతీకగా భాసించింది. అనేకమంది భావకవుల కీమె కలలరాణి. ఊహల పట్టమహిషి. కాళిదాసు తన "విక్రమోర్వశీయం" నాటికలో ఈ కథను కథావస్తువుగా స్వీకరించి ఊర్వశీ తత్వానికి శ్రీకారం చుట్టాడని చెప్పవచ్చును. ఈ యుగంలో శ్రీ అరవిందులు ఊర్వశీ పేరిట రెండు కావ్యఖండికలను ఇంగ్లీషులో రచించారు. గురుదేవులు రవీంద్రనాథ టాగూర్ కూడ "ఊర్వశీ" అనే కవితను ఆంగ్లంలోనే రచించారు. తెలుగులో శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి తన ఊహాసుందరికి "ఊర్వశి" అనే పేరుతో పలు కవితలు రాసి నివాళు లర్పించినారు. హిందీ సాహిత్యంలో శ్రీ ఆర్. యస్. దినకర్ రచించిన ఊర్వశికి భారతీయ జ్ఞానపీఠం అవార్డు లభించింది. ఇవికాక శ్రీ గుడిపాటి వెంకటచలం తెలుగులో "పురూరవ" అనే నాటికను రచించారు.

ఇంద్రుని సభలో అతనిని నృత్యగానాలతో అలరించటానికీ, అతని సింహాసనానికి, రాజ్యానికి ఋషుల తపస్సులు చేటు కలిపిస్తున్నాయని అనిపించినపుడు ఆ తపస్సులని భగ్నం చేసి ఇంద్రుని అధికారాన్ని పరిరక్షించటానికి రంభ, మేనక, తిలోత్తమ, ఊర్వశివంటి అప్సరసలు నియమితులైనట్టు మన పురాణేతిహాసములలో చెప్పబడింది. ఇంతమంది అప్సరసల మధ్య ఒక్క ఊర్వశి మాత్రమే కవుల కావ్యాలకి నాయికగా ఇంత విస్తృతంగా ఎందుకు చేకొనబడింది అని అనిపించటం సహజమే! రంభ, మేనక, ఊర్వశి ఈ ముగ్గురు మూడు స్థాయిలలో మానవ చైతన్యాన్ని ఆకర్షించి వశీకరింపగలరని నానుడి. రంభ యొక్క ఆకర్షణ కేవలం శరీరానికి మాత్రమే అని ప్రాథమిక స్థాయిలోనే అనేకమంది ఋషులు రంభయొక్క ఆకర్షణకి లోనై తపోభంగం కలిగి పీగిపోతారని కథలు చెపుతాయి. రావణాది అసురలకు రంభ ఒక ఆకర్షణ. ఇకపోతే విశ్వామిత్రునివంటి రాజర్షులని మేనక జయించింది. ఎంత తపశ్శాలి అయినా ఆవేశ కావేషాలను జయించలేకపోయిన రాజర్షి విశ్వామిత్రుని హృదయాన్ని మేనక జయించి అతనిని వశపర్చుకుంటుంది. వీరందర్ని మించిన అప్సరభామిని ఊర్వశి. ఈమె మానవమేథస్సుని, ఆత్మనీ జయించగల సమర్థురాలు.

బ్రహ్మ సృష్టికి సవాలుగా నారాయణ ఋషి ఈమె ఊరువులనుంచి సృష్టించాడని అందుకే ఈమె ఊర్వశి అని ఈమె జన్మకథ. ఋషియొక్క తపశ్శక్తిచేత ఉద్భవించిన కారణంగా ఈమె మానవులనీ ఆధ్యాత్మికంగా వశం చేసుకోగలదు. పురూరవుని వంటి ఉత్తమవంశ సంజాతుడైన మహారాజు ఊర్వశి ఆకర్షణలో చిక్కుకోటాన్ని మానవుడు భగవంతుడిని చేరుకోటంకోసం పడే ఆరాటంగా చిత్రీకరిస్తారు కవులు. మానవుని దృష్టిని లౌకిక దృష్టినుంచి మళ్ళించి అలౌకిక లోకాలవేపు తీసుకునిపోయే ఒక శక్తివంతమైన సాధనంగా ఈ కవులందరిచేత వర్ణింపబడింది.

రవీంద్రనాథ టాగూరు తన "ఊర్వశి"లో ఊర్వశీ పురూరవుల ప్రేమగాథనీ అందులోని సౌందర్య తత్వాన్ని మాత్రమే గానంచేస్తే మహర్షి శ్రీ అరవిందులు మరికొంత లోతుకు వెళ్ళి ఊర్వశీ పురూరవుల కథని తాత్వికదృష్టితో పరిశీలించి చిత్రీకరిస్తారు. అయితే ఇందులోగూడ సౌందర్యదృష్టి ఉంది. రవి ఈ కథలోని ఆధ్యాత్మిక సౌందర్యాన్ని గానం చేస్తారు. పురూరవుడు వ్యక్తిగా, రాజుగా, ప్రేమికుడుగా బహుముఖాలతో దర్శనమిస్తాడు. మొదటగా తన మిత్రుడైన ఇంద్రుని సభనుంచి భూలోకానికి తిరిగివస్తున్న రాజుకి ఉషఃకాంతులు లోకాలని పునీతం చేసే శుభవేళలో హిమాలయ శృంగాల ధవళ కాంతుల మధ్య అనేకమంది అప్సరసలతో ఆడుతూ, పాడుతూ ఊర్వశి దర్శనమిస్తుంది. అంతలోనే ఆమెను కేశి అనే రాక్షసుడు అపహరించుకుపోతుంటే రాజు ఆమెని రక్షిస్తాడు. అప్పటికి పూర్తిగా తెల్లవారిపోతుంది లేత సూర్యుని బంగారు కాంతుల నడుమ మానవత్వానికీ, దైవత్వానికి నడుమ వారధి వారి చూపుల కలయికద్వారా నిర్మించబడిందని కవి వర్ణిస్తాడు. తరువాత పురూరవుడు ఊర్వశి కోసం భూలోకంలో తపించి

పోవటం, అమరలోకంలో ఊర్వశి పురూరవుని ధ్యానంలో పడి దేవసభలో నాట్యంచేస్తూ నారాయణుని పేరుకి బదులు పురూరవుని నామం ఉచ్చరించటం జరుగుతుంది దేవగురువు భరతుడు ఆగ్రహావేశంలో ఇచ్చిన శాపం ఆమెపాలిట వరమయి భూలోకానికి దిగివచ్చి పురూరవునితో సహజీవనం చేస్తుంది. తన నిజ రూపాన్ని పురూరవుడు వెలుతురులో చూసిన మరుక్షణం తాను అదృశ్యమవుతానని ఆమె రాజుకి ముందే తెల్పియచేస్తుంది. అయితే ఆమె లేని స్వర్గం దేవతలకు స్వర్గంగా భాసించదు. వారు ఒక అర్ధరాత్రివేళ పురూరవుడు మేల్కొనేటట్లు ఉరుములతో, మెరుపులతో విలయాన్ని సృష్టించి ఆమె నిజరూపాన్ని రాజుకు కనిపింపచేస్తారు. ఊర్వశి మళ్ళీ మర్త్యలోకం వెళ్ళిపోతుంది. తనకోసం దిగివచ్చిన దైవత్వం తననివీడి వెళ్ళిపోవడాన్ని భరించలేని రాజు ఆమెని అన్వేషిస్తూ ఊర్ధ్వలోకాలకు బయలుదేరి వెళ్తాడు. అతడు సాధనతో, తపస్సుతో ప్రేమబలంతో అధిగమించిన లోకాలను అరవిందులు అత్యద్భుతంగా వర్ణిస్తారు. కవి యొక్క ఆధ్యాత్మికశక్తి యొక్క ఔన్నత్యాన్ని ఈ వర్ణనలలో చూడగలము. గంగా పరిసర ప్రాంతాలను దాటి, హిమాలయ శిఖరాల నధిగమించి ఊర్ధ్వలోకాలవైపు పయనిస్తూ లక్ష్మీదేవిని, తన తల్లి ఇలను కలిసి, వారి ఆశీర్వచనంతో అమృత సేవనం చేసి అమరత్వాన్ని సాధించి చివరికి స్వర్గసీమను చేరుకొంటాడు. అయితే రాజుగా తన కర్తవ్యాన్ని మరిచి వ్యక్తిగత ప్రయోజనం కోసం పరిశ్రమించిన పురూరవుని కవి హర్షించరు. కాని అతని అన్వేషణలోని నిజాయితీని గుర్తించిన కారణంచేత అతనికి స్వర్గద్వారాలు తెరుచుకుంటాయి. అతని ప్రేమ ఫలించినప్పటికి రాజుగా విఫలుడైన పురూరవుడు పరిత్యజించిన పృథ్వి నిరంతరం పరిభ్రమిస్తూనే ఉంటుందని చెప్తూ అరవిందులు తన కవితను ముగిస్తారు. రాజు ప్రజలకు ప్రతినిధి. అలాంటపుడు వ్యక్తిగతంగా సాయుజ్యం సాధించటంతోనే నిలచిపోయిన పురూరవుని అరవిందులు ఆమోదించలేకపోతారు. వీరు రచించిన "సావిత్రి"లో రాజు అశ్వపతి తన తపోబలంతో దివ్యత్వాన్ని భూమికి రప్పించి, పృథ్వినే స్వర్గసీమగా మారుస్తాడని చిత్రీకరిస్తారు. మానవునికీ దైవానికి మధ్య అనుబంధం ప్రేయసీ ప్రియులది కాదు. తండ్రి బిడ్డలది. సావిత్రి అశ్వపతికి కుమార్తెగా భూలోకానికి వస్తుంది.

తర్వాత "ఊర్వశి" పేరుతో కవితలు రాసినవారిలో చెప్పుకోదగిన కవి శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి. వీరి ఊర్వశి తొలి ప్రేయసి! తొలి వియోగిని! "మున్నీటి తరగలకు, మిన్నేటి నురుగులకు తడయు నెడబాటేనె, విడని కౌగిలి నేనె." అంటుందీమె! తానురుజయై, జరయై, మృత్యువైన కవిపాలిటికీమె "దివ్య మందారసుమము! శ్రీ లలిత వైజయంతీ పరిమళమ్మ" ప్రేమభావము, సౌందర్యారాధన, భక్తి కలగలిసిన త్రివేణీ సంగమంగా కృష్ణశాస్త్రిగారి ఊర్వశి దర్శనమిస్తుంది. తనను మృత్యువుగా, గాఢాంధకార రేఖగా భావించుకొన్న కవి తన ఊహల సామ్రాజ్ఞి ఊర్వశి హర జటా పారిజాత మధువుగా త్రిజగతీపతి కోటీర దివ్య రత్నరాజినేలు వజ్రాల తురాయిగా కనిపిస్తుంది. మరొకచోట ఈమెను శర్వరీ వియోగ కపోల పాళికవు అని వర్ణిస్తూ ఆమె నిట్టూర్పు, ఆమె కన్నీరు అంటారు. కవియొక్క శూన్యజీవితాన్ని అమృతభరితం చేసిన సౌందర్య దీపం ఊర్వశి. ఈమె దేవకన్య అవునో, కాదో మనకి తెలియదు. కాని మానవచైతన్య పరిధిని విస్తరింపచేసి అతని భావనలను ఊహల స్వర్గసీమల ద్వారాలదాకా నడిపించుకుపోగల తేజోరాశి అనటంలో సందేహంలేదు. ఈ ఊర్వశి చదువుతుంటే ఈ ప్రపంచము ఈతిబాధలు గుర్తుకురావు. దిగి రాను దిగి రాను అని దివినుండి భువికి అన్న గంధర్వలోకపు కవితో మనం కూడ దివిని విహరించి వస్తాము.

శ్రీ చాగంటి గోపాలకృష్ణమూర్తిగారనే మరో తెలుగు కవి మరో "ఊర్వశి"ని సృష్టించటానికి పూనుకోవటం కావ్యానికి అంకురార్పణం చేయటం సుమారు పదిహేను సంవత్సరాల క్రితం జరిగింది. అది పూర్తిచేసి కవి ప్రచురిస్తే, తెలుగులో ఉద్భవించిన ఊర్వశిలలో మేటిదవుతుందనటంలో సందేహం లేదు.

వీటన్నిటికంటె అత్యుత్తమంగా కనిపించేది, అత్యుత్తమ సాహిత్య పురస్కారం అయిన జ్ఞానపీఠం అవార్డును పొందినది శ్రీ ఆర్. యస్. దినకర్ రచించిన "ఊర్వశి". అడుగడుగునా కవి పురూరవుణ్ణి ధీరోదాత్తుడు, ధీరలలితుడు, ధీరచిత్తుడు, ధీరశాంతుడు అయిన ప్రబంధ నాయకుడిగా చిత్రీకరిస్తాడు. ఇక్కడ చదువరుల నాకట్టుకునేది ఊర్వశియే కాదు పురూరవుడు కూడ. ఇంద్రియ శక్తులద్వారా అతీంద్రియ లోకాలను చేరుకోడానికి మానవుడు చేసిన ప్రయత్నమే ఊర్వశిని చేరుకోటానికి పురూరవుడు చేసిన ప్రయత్నం అని కవి పీఠికలో చెప్తారు. కవి సౌందర్య దృక్పథంయొక్క విరాట్స్వరూపం ఈ కావ్యం అంతటా కనిపిస్తుంది. మానవుని మనస్సుని ఊర్ధ్వలోకాలవేపు భగవంతునివైపు మళ్ళించగల దైవశక్తి ఊర్వశి. ద్వంద్వంలో పుట్టిన పురూరవుడు ద్వంద్వాతీతుడు కావడానికి ప్రయత్నం చేస్తాడు. రాజుయొక్క ధర్మబద్ధమైన భార్య ఔశీనరి అతని లౌకిక జీవితానికి ప్రతీక అయితే దీనిద్వారా అతడు చేరుకోవాలనుకునే అలౌకిక లోకాలకు ఊర్వశి ప్రతీక! ప్రాపంచిక

ధర్మాలపట్ల నిరసన లేదుకాని, ఎప్పటికైనా మానవుడు చేరుకోవాల్సిన ఆధ్యాత్మిక ఔన్నత్యానికి ప్రాపంచిక ధర్మం ఒక మెట్టు మాత్రమే అని దినకర్ ఈ కావ్యంద్వారా స్పష్టం చేస్తారు. రాజు పరిత్యజించిన ఔసీనరిపట్ల ప్రపంచానికి సానుభూతి ఉండవచ్చును. కాని రాజు ఆమెని వదిలి ఊర్వశి ద్వారా ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని చేరుకోవాలనుకోటం మానవ జాగృతి వికాసంలో ఒక భాగం అని కవి భావన. అడుగడుగునా రసస్ఫూర్తిని కలిగించే మధురకావ్యం శ్రీ దినకర్ రచించిన "ఊర్వశి".

ఇవికాక శ్రీ గుడిపాటి వెంకటచలం "పురూరవ" అనే నాటికను రచించారు. వీరి ఊర్వశి ఒక విలక్షణమైన నాయిక! పురూరవుడు ఊర్వశిని పరిచయం చేసుకోగోరి తనను తాను మొదట పరిచయం చేసుకుంటూ తాను సర్వ భూవలయ ఛత్రాధిపతిని అంటారు. "నేను సర్వభూవలయ ఛత్రాధిపతి మాణిక్య విరాజిత మకుట భూషిత పాదారవిందను, నాకు నమస్కరించ" మంటుంది ఊర్వశి. మానవునిలో అహంకారాన్ని, సౌందర్యాన్ని భరించలేని బలహీనతలని ఈమె ఎత్తిచూపిస్తుంది. అంతేకాదు, ప్రపంచంలో తనకి కనిపించిన ప్రతి సౌందర్యాన్ని స్వంతం చేసుకోవాలనుకునే మానవ ప్రకృతిని అవహేళన చేస్తుంది. చివరికి ఈ బలహీనతలని రాజై ఉండి అధిగమించలేని పురూరవుని త్యజించి తిరస్కరించి వెళ్ళిపోతుంది. సమాజం పట్లా, స్త్రీపట్లా సమాజం చూపిస్తున్న నిరాదరణపట్ల చలంగారికి కొన్ని నిర్దిష్టమైన అభిప్రాయాలున్నాయి. వీరి ఊర్వశి మామూలు మానవ ప్రేయసిలో పురుషుని అహంకారానికి దాసోహమనదు. అడుగడుగునా తన ఆధిక్యతని ప్రదర్శిస్తుంది. దాన్ని గుర్తించలేని రాజుని నిరసిస్తుంది.

ఈ విధంగా ఊర్వశి ఈ కవుల కావ్యాలలో కవితలలో రూపం దిద్దుకొని ఒక విశిష్టమైన తత్వానికి బీజంగా రూపొందింది. రాధ విశ్వవియోగినిగా, సీత విశ్వమాతగా, ఊర్వశి విశ్వప్రేయసిగా మన పురాణాలలో అభివర్ణింపబడ్డారని సుప్రసిద్ధ భారతీయాంగ్ల రచయిత శ్రీ కె. ఆర్. శ్రీనివాస అయ్యంగారు ఒకచోట వ్యాఖ్యానిస్తారు. వీరిపట్ల మన భారతీయుల అంతరంగంలో ఒక ప్రత్యేకమైన అభిమానం, ఆదరణ ఉన్నాయి. ఊర్వశిమీద పైన పేర్కొనబడిన రచనలు కవుల అంతరంగంలోని అమృతధారలని వెలికితెచ్చి ఊర్వశితత్వాన్ని మనకవగతం చేస్తాయి.

డా॥ కల్లూరి శ్యామల

# గోత్రం - ఒక పరిశీలన

భారతదేశంలో చాలా కులాల్లో గోత్రం ప్రముఖపాత్ర వహిస్తున్నది. ప్రతి కులంలో ఒక గుంపునుండి మరో గుంపును వేరు చేయడానికి ఉపయోగిస్తున్నది. ఒకే గోత్రం వుండేవారు అన్నచెల్లెండ్లు వరుసవుతారు. అందువల్ల సగోత్రీకులలో వివాహాలు నిషేధం.

గోత్రం_వివిధార్థాలు :

'గోత్రం' అనే శబ్దానికి వివిధార్థాలున్నాయి. గోత్రం అంటే 'గోశాల లేక ఆవులమంద నిలిచే ప్రదేశమనీ' 'స్వర్గాన్ని రక్షించునది అనగా అపత్యం. అపత్యం అనగా ఉత్తమ లోకాల నుండి పతనం లేకుండ చేయునది" అనీ అర్థం.

'వ్యక్తులగుంపు' అని ఋగ్వేదంలోనూ, 'రక్తసంబంధం కలిగిన వ్యక్తుల సమూహం' అనీ అధర్వణవేదంలోనూ పేర్కొనబడింది.

గోత్రమంటే "ద్విజశాఖకు మూలపురుషుడనీ, కూటస్థుడనీ అతని సంతతివలన కలిగిన పుత్రపౌత్రాది పరంపర" అని అర్థం కూడా కలదు. పాండిత్యం, ధనం, దాతృత్వం కలిగిన వ్యక్తి గోత్రంగా గుర్తింపబడుతున్నాడు. గోత్రం ఈ అర్థంలో బ్రాహ్మణుల్లో వాడబడుతోంది. క్షత్రియుల్లో గోత్రమంటే 'సంప్రదాయాన్ని తరతరాలుగా అందించటం" అనే అర్థముంది.

గోత్రాలు_చరిత్ర :

ప్రాచీన కాలంనుంచి గోత్రాలున్నట్లు శాసనాధారాలున్నాయి. క్రీ.శ. మొదటి శతాబ్దంనుంచి శాసనాల్లో గోత్రాల ప్రసక్తి కన్పిస్తుంది. అతి తెగకు చెందిన వర్ధనిక, రిష్టిసేన గోత్రానికి చెందినట్లు దుర శాసనాల్లో పేర్కొబడింది. రుద్రధామన్ కాలంలోని అంధవ్ శాసనాల్లో యశోదత్త, సేనికి గోత్రానికి జ్యేష్ట వీర ఔపసతి గోత్రానికి చెందినవారుగా పేర్కొబడినాయి.

క్రీ.పూ. మొదటి శతాబ్దానికి చెందిన మధుర శాసనంలో కాశీపుత్ర భాగభద్ర కౌష్ట గోత్రానికి చెందినట్లు చెప్పబడినాడు. మొదటి శతాబ్దికి చెందిన జైన్నిగుహ శాసనంలో మౌద్గలిపుత్ర మూలదేవ వత్స గోత్రానికి చెందినవాడుగా పేర్కొబడినాడు.

అబ్రాహ్మణులైన గుప్తులు (నాలుగవ శతాబ్ది) ధారణ గోత్రాన్ని స్వీకరించినారు. గుప్తుల కాలంనుంచి శాసనాల్లో

బ్రాహ్మణుల గోత్రాలు కన్పిస్తున్నాయి. ఈ కాలంనుంచి వ్యక్తి పేరుతో గోత్రాన్ని కలిపి చెప్పే ఆచారం కన్పిస్తుంది.

గుప్తుల కాలంకంటే ముందు శాసనాల్లో అరిష్టసేన, ఔపాశలి, కౌష్ఠ, కౌశిక, గజానన, గార్గ, గౌతమ, పరాశర, వశిష్ఠ, హారిత, సాలంకాయన, పైగ్రేవ, పైనిక, వత్స గోత్రాలు కన్పిస్తున్నాయి. ఇవి బ్రాహ్మణుల గోత్రాలో కాదో చెప్పడం కష్టం.

ప్రాచీనాంధ్ర శాసనాల్లో క్రీ.శ. ఏడో శతాబ్దంనుంచి గోత్రాలు కన్పిస్తున్నాయి. కొత్తూరు శాసనం (క్రీ.శ. 699-700) కుమారశర్మ భరద్వాజ గోత్రస్థుడిగా పేర్కొబడినాడు.

గోత్రం-ఉత్పత్తి :

గోత్రాలు వేదకాలంలోని ఋషులకు సంబంధించినవనీ, గ్రామ నామాలనుంచి ఏర్పడినవనీ, గణ సంకేతాంశాలనుంచి ఏర్పడినాయనీ, గ్రహకూటమి పేర్లతో ఏర్పడినవనీ, శివ సహస్ర నామావళి అపభ్రంశ రూపాలనీ - గోత్రాల ఉత్పత్తి గుర్చి భిన్నాభిప్రాయాలున్నాయి. ఈ అభిప్రాయాల సామంజస్యాన్ని తెలపడానికి, వివిధ కులాల్లోని గోత్రాల సేకరణ, పరిశీలన ఎంతైనా అవసరం.

నేటి సమాజంలోని గోత్రాలను గమనిస్తే ముఖ్యంగా ఋషినామాలు, గ్రామనామాలు, గణసంకేత నామాలు గోత్రాలుగ కన్పిస్తున్నాయి.

ఋషినామ గోత్రాలు :

ఈనాడు మన సమాజంలోని వివిధ కులాల్లోని గోత్రాలను పరిశీలిస్తే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యుల గోత్రాలు, కొన్ని శూద్రుల గోత్రాలు ఋషి సంజ్ఞలను తెల్పుతున్నాయి.

ఆర్యమతంలో స్వర్గమార్గాన్ని బోధించే మతగురువే వంశకర్తయి, గోత్రపురుషుడైనట్లు కీ.శే. తాతాసుబ్బారావుగారు పేర్కొంటూ ఈ విధంగా వివరించారు. "గోత్ర, వంశ శబ్దాలు పర్యాయపదాలు. పురాణాలలో ఋషులను గోత్రకరులని కొన్ని చోట్ల, వంశకరులని కొన్ని చోట్ల వాడారు. ఇంతేగాక అపత్యము, గోత్రము అని వాడుక కూడా ఋషులలో కనపడుతున్నది. అపత్యమంటే ఉత్తమ లోకాలనుంచి పతనము లేకుండ చేసేది. గోత్రమంటే స్వర్గమార్గాన్ని సురక్షితం చేసేది. ఈ విధంగా గోత్ర, అపత్య శబ్దాలు పర్యాయపదాలు. కొందరు మన ప్రాచీన సంప్రదాయాన్ని ఎరుగకుండ 'గో' శబ్దానికి ఆవులనే అర్థాన్ని మాత్రమే చెప్పి, గోత్ర శబ్దానికి వివిదార్థాలు వ్రాస్తున్నారు. వంశాభివృద్ధి కలిగితేనే కాని పితృదేవతలకు ఉత్తమలోకప్రాప్తి ఉండదని ఆర్యులు విశ్వసించేవారు."

విశ్వామిత్రుడు, జమదగ్ని, భరద్వాజుడు, గౌతముడు, అత్రి, వశిష్ఠుడు, కశ్యపుడు, అనే సప్తర్షులు, అగస్త్యుడు, భృగువు, అంగిరసుడు కలిసి గోత్రకర్తలుగా చెప్పబడుతున్నారు. నేటి సమాజంలో పై చెప్పిన ఋషినామాలు గోత్రాలు కలవారు బ్రాహ్మణుల్లో అధికంగా వున్నారు.

గ్రామ నామ గోత్రాలు :

గ్రామనామాలు కూడా గోత్రాలుగా చెప్పబడుతున్నాయి. ఉదా:- తంగెళ్ళ, రేచర్ల, కమ్మ, వెలమవారిలో ఎక్కువగా గ్రామనామాలు గోత్రాలుగ కన్పిస్తున్నాయి. గోత్రాలుగ గ్రామ నామాలు కుదురుకొన్న పరిస్థితిని మాగంటి బాపినీడు ఈ విధంగా వివరించారు. "కమ్మవారు ఆదిలో క్షత్రియులుగా ఉండినకాలంలో వారికికూడా బ్రాహ్మణులకులాగానే కాశ్యప, ఆత్రేయ, మానవ్యస, భారధ్వాజాది గోత్రాలుండినట్లు శాసనాధారాలున్నవి. కాని జైన, బౌద్ధ విప్లవాలలో ఈ వ్యవస్థలన్నీ తారుమారయిపోయినవి. కొన్ని శతాబ్దాల పిమ్మటగాని జైన, బౌద్ధమతాలలో కలిసిన ఆ క్షత్రియులు తిరిగి కమ్మవారుగానో, వెలమవారుగానో హిందువులలో చేర్చుకోబడడం జరుగలేదు. ఈ మధ్యకాలంలో వారు పూర్తిగా తమ గోత్ర, సూత్ర ప్రవరలను మరిచిపోయారు. అందుచేత మళ్ళీ హిందూమతంలో చేరేటప్పుడు వాళ్ళకు కొత్తగా గోత్రాలను ఏర్పరచవలసి వచ్చింది. ఈ రోజు కమ్మవారిలో అత్యధిక సంఖ్యాకులకు గల గ్రామ గోత్రాలన్నీ ఈ విధంగా ఏర్పడినవే. గోత్ర శబ్దానికి భూమి అనే అర్థం ఉండడంచేత ఆ కాలంలో వారు నివసిస్తూఉండిన గ్రామాల పేర్లే వారి గోత్రాలుగా ఏర్పడి ఉండవచ్చును. అయితే జైన, బౌద్ధ మతాలలో చేరడానికి పూర్వం తమకుండిన గోత్ర, సూత్రాదులను మరిచిపోకుండా జ్ఞాపకం ఉంచుకొన్నవారికి మాత్రం ఇప్పటికీ ఋషి గోత్రాలే నిలచివున్నవి."

కమ్మవారి గోత్రాలుగా ఏర్పడిన చాలా గ్రామాలు కమ్మనాడు, వెలనాడు, వేంగినాడుగా వెలువడిన ఆంధ్రదేశపు సరిహద్దులలోనివే. గ్రామనామాలే కాకుండా మూలపురుషుల పేర్లు, ఇష్టదేవతల పేర్లు, పుష్పాదుల పేర్లు కూడా గోత్రాలుగా ఉన్నాయి.

గణ సంకేతనామ గోత్రాలు :

రెడ్లు, కమ్మ, వెలమ మొదలైన అబ్రాహ్మణ కులాల్లో ఋషిగోత్రాలు ఎక్కువగా కానరావు. వీరి గోత్రాలు ఎక్కువగా

జంతువులను, ప్రకృతిలోని ఇతర వస్తువులను సూచిస్తుంటాయి.

ఉదా:- జంతుసూచక గోత్రాలు:- కోడి, చిలకల, పులి, మొసల్ల, ఏనుగు, నాగోల్ల.

వృక్షసూచక గోత్రాలు:- కానక్కాయల, గోవాకు, బుడంకాయ, జమ్మికట్టెలు, చంద్రకట్టెలు, కొర్రలు, దానిమ్మ.

జల, స్థల, సంఖ్యాసూచక గోత్రాలున్నాయి. ఉదా:- చెలిమనీళ్ళు, మూడు మేర్లు, వెయ్యిండ్లు, వెయ్యిరోళ్లు.

ఇవేకాక సంస్కృతికి సంబంధించిన ఆభరణ, ఆయుధ, ఔషధ, వస్త్ర, వస్తుసూచకాదులు గోత్రాలుగా ఉన్నాయి. ఉదా:- ముద్దుటుంగరాల, విల్లునంబుల, శొంటి, పట్టువస్త్రాల, ఉయ్యాల.

పై అంశాలు గోత్రాలుగా ఏర్పడడానికి కారణం—ప్రాచీనకాలంలో పితృదేవతల ఆత్మలు జంతురూపం వహిస్తాయని నమ్మేవారు. ముఖ్యంగా జలచరాలు, స్థలచరాలయిన కొన్ని జంతువులుగా ఆత్మలు రూపొందుతాయని వీరి విశ్వాసం. ఈ విధమైన మనస్తత్వధోరణి కల్గిన ప్రాఙ్మానవులు పితృదేవతల అంశకు ప్రతీకగా నిలిచిన జంతుజాలాన్ని ఆరాధించడం, వాటిని కులచిహ్నాలుగా గ్రహించడం జరిగింది. ఈ కులచిహ్నాన్నే గణసంకేతం అంటారు.

జంతువులు, వృక్షాలు, ప్రకృతిలోని ఇతర వస్తువులను సూచించే గోత్రాలుగా గణసంకేతదశ పరిణామకాలంలో తొలి మానవుల గుంపుల చిహ్నాలే గోత్రసంజ్ఞలుగా నిలబడి ఉండవచ్చునని నాయని కృష్ణకుమారిగారి అభిప్రాయం.

గోత్రాలు- ప్రాముఖ్యత :

భారతదేశంలో ఇంటిపేర్లకులాగే, గోత్రాలకూ చాలా కులాల్లో ప్రాధాన్యం ఉంది. శాసనాలు పరిశీలిస్తే గోత్రాలు బ్రాహ్మణుల్లోనే కాక అన్ని కులాల్లోనూ గోత్రాల ప్రాధాన్యత కన్పిస్తుంది. కాలక్రమంలో అబ్రాహ్మణ కులాల్లో గోత్రాల ప్రాముఖ్యత తగ్గింది. బ్రాహ్మణులు గోత్రాలు చెప్పింతర్వాతే పేర్లు చెప్పడం జరుగుతున్నది. కానీ అబ్రాహ్మణ కులాల్లో గోత్రం తెలుసుకోవాలంటే ఆ కుటుంబంలోని వ్యక్తుల్ని అడిగితే తప్ప తెలియడంలేదు. కొన్ని కుటుంబాలు గోత్రాలు చెప్పమంటే 'తెలియదు' అని చెప్పే స్థితి కూడా ఉంది.

నేటి సమాజంలో గోత్రాల ప్రాముఖ్యత అంతగా లేకపోయినా వివాహ సంబంధాలు నిర్ణయించుకోవడంలో మాత్రం ఇంకా ప్రాముఖ్యత కల్గివున్నాయి. అన్నీ కుదిరినా ఒకే గోత్రం అని తెలిసినపుడు ఆ సంబంధాలు కాదనుకున్న సందర్భాలు లేకపోలేదు. సగోత్రీకులు అంటే ఒకే గోత్రం కల్గినవారు రక్త సంబంధీకులుగా లెక్కింపబడ్తున్నారు. వీరిమధ్య వివాహ సంబంధాలు నిషేధం.

గోత్రాలు వంశపారంపర్యంగా సంక్రమిస్తున్నాయి. తండ్రి తర్వాత అతని కొడుకులకు, మనుమలకు ఇలాగే తర, తరాలుగ కొనసాగుతుంది. గోత్రాలన్నీ నిషేధాలుగా పరిగణింపబడ్తున్నాయి.

గోత్రాలు ప్రజల జీవన విధానాన్ని, సాంఘిక, సాంస్కృతిక జీవితాలను ప్రతిబింబిస్తుంటాయి. వివిధ కులాల్లోని గోత్రాలను సమగ్రంగా సేకరించి పరిశీలిస్తే సమాజ చరిత్ర నిర్మాణానికి, సమాజ సంస్కృతిని తెలుసుకోవడానికి అవకాశముంది. అంతేగాక గోత్రాల సమగ్ర స్వరూప అవగాహనకు వివిధ కులాల్లోని గోత్రాలను సేకరించి, పరిశీలించాల్సిన అవసరమెంతైనా ఉంది.

## ఉపయుక్త గ్రంథాలు :

ఇండ్ల పేర్లు, విప్రశాఖలు, గోత్రములు, ప్రవరలు- మునునూరి వేంకటశాస్త్రి, వీరభద్రపురం, రాజమండ్రి-1, 1973.

తెలుగు జానపద గేయగాథలు - నాయని కృష్ణకుమారి, నాగలక్ష్మి ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాదు. 1977.

ప్రాచీనాంధ్ర శాసనాలు (క్రీ.శ. 1100 వరకు)- బూదరాజు రాధాకృష్ణ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కళాభవన్, హైద్రాబాదు. 1971.

మాగంటివారి చరిత్ర - మాగంటి బాపినీడు, భారతీయ విజ్ఞానమందిరం 64, ఫోర్తు మెయిన్‌రోడ్, మద్రాసు-20.

హిస్టరీ ఆఫ్ ధర్మశాస్త్ర - పాండురంగవర్మ కాణె, వా. 11, మొదటిభాగం, భండార్కర్ ఓరియంటల్ రీసర్చ్ ఇన్‌స్టిట్యూట్, పూనె.

ది బ్రాహ్మణాస్ ఆఫ్ ఇండియా - చిత్రరేఖ గుప్త. సందీప్ ప్రకాశన్, ఢిల్లీ.

ఎ స్టడీ బేస్‌డ్ ఆన్ ఇన్‌స్క్రిప్షన్స్-

డా॥ ఎమ్. విజయలక్ష్మి

# నందివనపర్తి

పాలమూరు జిల్లాలో ప్రాచీన చరిత్రగల గ్రామాలు చాలా ఉన్నవి. వానిలో ఇది కూడా ఒకటి.

పూర్వం ఈ జిల్లాలో వనపర్తి పేర రెండున్నవి. ఒకదాన్ని సమస్తాన్ వనపర్తి అని మరోదాన్ని నందివనపర్తి అని పిలిచినారు.

సమస్తాన్ వనపర్తి స్థానంలో మొదట "పాతకోట[1]" అనే గ్రామం ఉన్నది. అది పాతకోట కాబట్టి అనంతకాలంలో వారు కొత్తకోటను స్థాపించినారు. ఈ పాతకోట ఉరఫ్ వనపర్తి కంటె నందివనపర్తి చాలా మొదటిది. దానికి పూర్వం "వహ్నిపురం" అని వ్యవహారముండేదట ముస్లిం ప్రభువులు దాన్ని "వన్‌ఫర్" అని పిలిచినారు. వారి రికార్డులలో గూడా ఇది ఇలాగే నమోదయింది కాని ప్రజలు మాత్రం "వనపర్తి" అని పిలుచుకున్నారు.

కాకతీయుల పిమ్మట ఈ ప్రాంతమంతా రాచకొండ వెలమ ప్రభువుల ఏలుబడిలో ఉన్నది. పిమ్మట సంస్థానాల కాలంలో దీన్ని "నల్లవెల్లి" దేశ్‌ముఖులు పాలించినారు. నల్లవెల్లి ఇపుడు దీని సమీపంలోనే ఉంది. అక్కడ ఆనాటి ప్రభువుల కోటగోడ సుమారు ఎకరంనర స్థలంలో వ్యాపించిఉన్నది. కాని ఇటీవల గ్రామస్థులు రాయి కొఱకు ఆ గోడను నేలమట్టం చేసినారు.

నల్లవెల్లి ప్రభువుల దగ్గర చిన్నతుళ్ళ గ్రామంయొక్క కరణాలు దేశపాండ్యాలుగా ఉన్నారు. ఇక్కడి ప్రభువులలో చివరివాడు మలహారిరావు అని చెబుతారు. మలహారి తెలుగుపేరు కాదు. మహారాష్ట్రి నామం.

పాలమూరు జిల్లాలో పూర్వం మగతల నారాయణపేటలను మహారాష్ట్రి వంశాలు పాలించినవి.

నారాయణపేటను పూర్వం లోకాయపల్లె సంస్థానం అని పిలిచినారు. దాన్ని పాలించినవారు దేవగిరి యాదవ వంశానికి చెందినవారు. ఈ వంశంలో వెంకట నారాయణరావులు చాలా మంది ఉన్నారు. వారి పేర్లకు చివరన "జాదవ్-పద్నవీస్" అనే ఉపనామాలు చేర్చబడి ఉన్నవి. వీరి దానపత్రాలు మోడీ లిపిలో ఉన్నవి.

ఈనాడు ప్రసిద్ధమైన యాదగిరి క్షేత్రాన్ని ఈ వంశంలోని ప్రథమ ప్రభువులే స్థాపించి అభివృద్ధికి పాటుపడినాడని చివరి వెంకట నారాయణరావు తనపేర నేటి నారాయణపేటను స్థాపించినాడని అక్కడివారు చెబుతారు.

ఈ వంశంలోని ఒక వెంకటనారాయణరావు "పద్నవీస్" గారి దానపత్రం ఒకటి నారాయణపేటలోని దీక్షిత వంశంవారి దగ్గర ఉంది. అది క్రీ.శ. 1689 నాటిది. దానిలో వారు దిల్లదాబాద్ (ఊటుకూరు) తాటికొండ, దౌలతాబాదులకు దేశ్‌ముఖ్ నాడగౌడులుగా ఉన్నట్టు వారి పాలనలో తాటికొండ, బాదేపల్లి, బూరుగుల, వెలిజాల పరగణాలున్నట్టు చెప్పబడింది. ఆనాటికి నారాయణపేట లేదు. దాని స్థానంలో "పళ్ల" అనే గ్రామం ఉన్నది.

ప్రస్తుతం మగతలలో ఖండేరాయని గుడి ఉంది. దానిలోని శాసనాన్ని బాలాజీరావు వేయించినాడు. అందులో మలహార మార్తాండ బాలాజిరావు పేర్కొనబడినాడు. ఈ శాసనం క్రీ.శ. 1815 నాటిది.

అందులో పేర్కొనబడిన మలహర-మార్తాండ-బాలాజీరావు ఒక్కడేనా, లేదా ముగ్గురా! శాసనాన్నిబట్టి స్పష్టంగా తెలియటంలేదు. ఈ శాసనంపై దానపత్రం పిమ్మట 126 సంవత్సరాలకు వేయించబడింది.

ఇపుడు మగతల-నారాయణపేటలు జతగాఉన్న గ్రామాలు కాబట్టి మనకీ గ్రామాలలో తెలిసే ప్రభువంశాలు రెండు వేరు వేరో లేక ఒక్కటేనో తెలిసికునే అవకాశం లేదు కానినల్లవెల్లి కోటనుండి నందివనపర్తిని పాలించిన ప్రభువుపై మగతల శాసనస్థుడు కాని లేదా ఆ వంశీయుడు కాని కావచ్చు అని పేరును బట్టి అనిపిస్తుంది.

లోకాయపల్లె వనపర్తి పెద్ద రామేశ్వర రాయల దండయాత్రలో నాశనమయిందని స్థానికుల కథనం. ఆ పిమ్మట అది వనపర్తి సంస్థానంలో చేరిపోయింది.

ఈనాటి షాద్‌నగర్ తాలూకా ఒకపుడు వనపర్తివారి క్రిందనే ఉన్నది. ఇప్పటి పారుఖ్‌నగర్‌కు మొదట జానంపేట అని పేరు. దాన్ని మొదటి సవై వెంకటరెడ్డిగారు స్థాపించి పాలించినాడు. అప్పటికింకా షాద్‌నగర్ ఏర్పడలేదు.

సవై వెంకటరెడ్డిపై నైజాం పక్షంనుండి పారుఖ్ అనే సుబేదారు దండెత్తి అతనిని చంపి దాన్ని వశపరుచుకున్నాడు. అపుడది నైజాం ప్రభువులక్రిందికి వెళ్ళి పిమ్మట కిషన్‌ప్రసాదు గారికి జాగీరుగా ఈయబడింది.

కిషన్‌ప్రసాదుగారు కాయస్థ వంశీయుడు. రెండవ సాలార్‌జంగు పిమ్మట మీర్‌మహబూబ్ ఆలీఖాన్‌గారి దగ్గర ముఖ్యమంత్రి హోదాలో ఉన్నాడు. ప్రజలతనిని "సదరె ఆజం బహద్దుర్" అని పిలిచినారు. ఈనాటి షాద్‌నగర్ ఈ మంత్రి

గారి పేరనే ప్రతిష్ఠింపబడింది. తరువాతి కాలంలో అది ఉపసర్గ లోపించి ఇప్పటి షాద్‌నగర్‌గా మిగిలింది.

కిషన్‌ప్రసాదుగారి జాగీరులో చాలా గ్రామాలున్నవి. వాని రెవిన్యూ-సెషన్-పోలీస్ అధికారాలన్నీ అతనికే ఉన్నవి. అందు చేత అతడు తమ గ్రామాలకు "అల్వాల"ను జిల్లా కేంద్రంగా చేసి పారుఖ్‌నగర్‌లో సొంత తాలూకా కచేరీ నడిపినాడు. అపుడతని జాగీరులో మొగుళ్లపంపు-చౌదరిపల్లె-మంగలిపల్లెతోపాటు నందివనపర్తి గూడా సొంత ఖస్బులక్రింద ఉన్నది.

2

ఈ గ్రామంలో సిద్దేశ్వర[2]—నందీశ్వర—ఓంకారేశ్వర అనే మూడు పెద్ద ఆలయాలున్నవి. వానిలో సిద్దేశ్వరాలయం అన్నిటి కంటె ప్రాచీనం. ఇది గ్రామానికి తూర్పుగా ఊరి వెలుపల ఉంది. ఇది ప్రాఙ్ముఖాలయం. ముందు ఒక పెద్ద కోనేరు గూడా ఉంది.

ఈ గుడిలో తూర్పుముఖంగా మూడు దక్షిణాభిముఖంగా ఒక గది ఉన్నవి. ప్రస్తుతం నడిమి గదిలో దక్షిణాభిముఖమైన గదిలో మాత్రమే శివప్రతిష్ఠలున్నవి. నడిమి గదికి మాత్రమే ద్వారపాలక ప్రతిమలున్నవి.

పూర్వం వర్షాలు లేనపుడీ స్వామికి కుంభాభిషేకాలు చేసే వారట. కాని ప్రస్తుతం నిత్య పూజలేవీ లేవు. ఇందులోని నంది భిన్నం చేయబడింది. ఔరంగజేబు కాలంలో ఆ పని జరిగిందట.

ఆలయ ప్రాకారంలో ఈ గుడి వెనుక చాలా నాగ ప్రతిమలు పడిఉన్నవి. అవి అన్నీ నల్లరాతివి. సాధారణంగా పాలమూరు జిల్లాలో ఒకటో అరో నాగప్రతిమలు లేదా నరనాగ ప్రతిమలు లేని గ్రామంలేదు. కత్తి డాలు ధరించిన ఈ నర నాగ ప్రతిమలు యుద్ధప్రియులు మంచి యోధులు అని సూచిస్తవి. కాని ఇవి ఏ కాలానికి చెందినది స్పష్టంగా తెలియదు. గ్రామస్థులు సంక్రాంతినాడీ నాగులను పూజిస్తుంటారు.

ఇక్కడి ఆలయాలలో చెప్పదగింది నందీశ్వరాలయం. దానిలో ఉండే నందినిబట్టియే ఈ గ్రామం నందివనపర్తి అయింది. ఈ నందిని గురించి యిక్కడ రెండు మూడు కథలు గూడ ప్రచారంలో ఉన్నవి.

పూర్వం అది శరీరం ధరించి గ్రామంలో తిరిగేదట. గ్రామస్థులకు మచ్చికపడి వారు శరీరం దువ్వుతూ ఉంటే ఒడలు నాకేదట. అది ఎవరిని నాకితె వారికానాడు అదృష్టం కలిసి వచ్చేదట.

ఒకప్పుడా ఊరి వెలుపల ఉండే నందిచెరువులో ముత్తారెడ్డి అనే కమ్మకాపు రైతు చెనిగె చేను పెట్టినాడు. అది పెరుగుతూ ఉండగా దినదినం దానిలోనికి ఒక పశువు అలవాటై మేసి పోసాగింది. అపుడిది పనిగాదని యజమాని ఒక రాత్రి గుతుపతో కాపువేసి దానిలో తెల్లని ఎద్దొకటి మేస్తు కనిపించగా వచ్చి కోపం పట్టలేక దాని కాలు విరుగగొట్టినాడు. అపుడది కుంటుతూ నందీశ్వరాలయం దగ్గరకు వచ్చి అదృశ్యమైపోయింది. నాటి నుండి యిక మళ్లీ కనిపించలేదు.

ఆ ఎద్దు అదృశ్యమయ్యే అపుడు ముత్తారెడ్డిగారికి ఈ గ్రామంలో కమ్మకాపులు బ్రతికి బట్ట కట్టకుందురుగాక! ఈ నంది చెరువు ఎప్పటికీ నిండకుండుగాక! అనే శాపవాక్కులు వినిపించినవి. అవి విని జడిసి అతడక్కడే నెత్తురు క్రక్కుకొని మరణించినాడు. ఆనాటినుండి యిక అక్కడ నేటివరకు కమ్మకాపులు నిలువలేదు. నందిచెరువు నిండలేదు. ఇపుడా నంది గుడికి సుమారు కిలోమీటరు దూరంలో ఒక పొలంలోని బండపై నంది పాదాల గుర్తులున్నవి. గ్రామస్థులు వాటినిపుడు ఆనాటి నందీశ్వరుడు తిరిగిన జాడలని చెబుతారు.

పూర్వం మెదక్-కరీంనగర్-మహబూబ్‌నగర్-వరంగల్ జిల్లాలు వీరశైవం బాగా వర్ధిల్లినగ్రామాలు కాబట్టి ఆ కాలంలో అక్కడి గ్రామాలలో ఇటువంటి కథలు చాలా పుట్టినవి.

పాలమూరు జిల్లాలో ఇపుడు పెద్ద పెద్ద నందులు చాలానే ఉన్నవి. వానిలో వడ్డమాని నంది గుడిలోని నంది. కలువకొలను[4] నందికోటీశ్వరాలయంలోని నంది. అలంపూరులోని నందిఆకారం లోను అందచందాలలోను బాగా ప్రసిద్ధంగా ఉన్నవి.

ఈ జిల్లాలో కలువకొలను ప్రాచీన నగరాలలో ఒకటి. ప్రస్తుతం అక్కడఉన్న నంది కోటీశ్వరాలయం జయలక్ష్మీపతి రాయుడు అనే గోనప్రభువు కట్టించినట్లు స్థానిక కైఫియతులవల్ల తెలుస్తుంది కాని అతని వంశాదిక వివరం కాలం తెలిపికునే ఆధారాలు లభించటంలేదు.

ఆ ప్రభువు సింహపద్మావతీదేవి భక్తుడట. ఆ దేవి కూడా ఇపుడెవరో? అతడు కలువకొలను, న్నిహూడూడు, పెద్ద పూడూరు, నందివనపర్తి అనే నగరాలను పాలించినాడట.

కలువకొలను-వడ్డవాని నందు లొకేసారి ప్రతిష్ఠింపబడి నట్లు ప్రజలు చెబుతారు. ఇపుడు నందికోటీశ్వరాలయం, నంది గుడినందులకు శిల్పసాదృశ్యంగూడా ఉంది. అవి నిరాడంబరంగా శాంతగంభీరంగా ఉన్న పెద్ద నందులు.

ఇదే కలువకొలను గ్రామంలో మరో శివాలయం ఉంది. దానికి పూర్వం ప్రసన్నవల్లభ దేవరగుడి అని పేరు. కొంత కాలం క్రిందట గ్రామంలో పాతకోట అడుగున నేలలో ఒక పెద్ద నంది దొరికింది. దాన్ని వారు తీసుకువచ్చి ప్రసన్నవల్లభ దేవర గుడిలో ఉంచగా ఇటీవల అది పాలమూరిలో పిల్లలమర్రి దగ్గర ఉంచబడింది. ఈ నంది మెడలో గంటలు, మువ్వలు, గొలుసులతో, వీపుపై నాగబంధం మొదలైన అలంకారాలతో ఎంతో సుందరంగా, సౌమ్యంగా ఉంది. ఇట్టిదే మరొకటి కూడా అక్కడ నేలలో ఉందని గ్రామస్థులు చెబుతారు.

ప్రస్తుతం నందివనపర్తిలో ఉండే నందిగూడ పై నంది వంటి పవితనంలోనే ఉంది. కాబట్టి ఈ రెండు నందులు ఏక కాలానికి చెందుతవి అనిపిస్తుంది. ఈ నంది పిల్లలమర్రి దాని కంటె మరికొంత పెద్దగా ఉంది.

శివాలయాలు భారతదేశమంతటా విస్తరించి ఉన్నా నందులకు మాత్రం ఆంధ్రదేశమే ప్రసిద్ధంగా ఉంది. కాశీప్రాంతపు నందుల కొమ్ములు తలపై వలయంగా ఒకదానివైపు ఒకటి వంగిఉంటవి. ఉజ్జయిని నందుల కొమ్ములు వలయంతోపాటు కొనలు వెనక్కిమళ్ళి కొంచెం విచ్చుకుంటవి. నేపాలు నందుల కొమ్ములు వెనక్కిసాగి ముందుకు వంగుతవి. తెలుగుదేశపు నందుల కొమ్ములు ఆ విధంగా కాక పొట్టిగా తలకు నిండుగా ఉండి అరవై కోణంలో పైకి చూస్తుంటవి.

అంతేకాక ఉత్తరభారతపు నందులు చెవులు క్రిందికి వ్రాలి కొన్ని స్థలాలలో నాలుకతో ముక్కును తాకుతూ ఉంటవి. ఆంధ్రదేశపు నందులావిధంగాకాక చెవులు రిక్కించి గంభీరంగా ఉంటవి. ఈలాగే అని పడుకున్న తీరులో కూడా భేదం ఉంది. ఉత్తరభారతపు నందులు శివుని కెదురుగా ఉండి నేరుగా అతనినే చూస్తుంటవి. 'తెలుగుదేశంలో' గూడా చాళుక్యుల కాలంవరకు ఆ విధంగానే ఉన్నవికాని కాకతీయుల కాలంలో వీసి వోజులో వయ్యారాలు వొలకసాగినవి. ముందరి ఎడమకాలు ఎత్తి మెడను కుడివైపు కొంచెం మలిచి అపుడు లేవటానికి ఉంకిస్తున్నట్టు ఉంటవి. వనపర్తి నంది ప్రస్తుతం యిదే భంగిమలో ఉంది.

స్తంభాల పనితనంలోగాని నంది పనితనంలోగాని ఇది అన్నివిధాలా సిద్ధేశ్వరాలయానికంటె తరువాతిది. స్థానికులిది క్రీ.శ. 1425 ప్రాంతంలో రాచకొండ ప్రభువు రేచెర్ల సింగ భూపాలుడు ప్రతిష్ఠించినాడని నమ్ముతున్నారు. దానికి నిదర్శనంగా ఇపుడీ గ్రామానికి పడమట ఒక సింగవరం అతనిపేర నిలచిఉంది.

ప్రజల నమ్మకం ప్రకారం క్రీ.శ. 1425లో రాచకొండ గద్దెపై ఉన్నవాడు మూడవ సింగభూపాలుడు. అప్పటివరకు తెలంగాణా ప్రాంతమంతా వారిక్రిందనే ఉన్నది. అప్పటివరకు వారు శైవులే కాబట్టి ఇక్కడి నందీశ్వరాలయం అతని ప్రతిష్ఠనే కావచ్చు.

తెలంగాణంలోని ఆలయాల పాలిటికి ఔరంగజేబు గోలకొండ దండయాత్ర ఒక పీడకల. ఎనిమిది నెలలు నిర్విరామంగా సాగి 21-9-1687 నాటికి ముగిసిన ఆ ముట్టడి దేశంలోని ఎన్నో ఆలయాలను ధ్వంసంచేసింది. వానిలో కొన్ని మసీదులైనవి. మరికొన్ని మాయమైనవి.

ధ్వంసమైన పిమ్మట యిక్కడి నందీశ్వరాలయాన్ని అడిగే దిక్కు లేకుండపోయి చాలాకాలం గడిచింది. అపుడు కొన్నేండ్ల క్రిందట వాసుదేవరావుగారనే కలెక్టరుగారిక్కడి నందిని మ్యూజియానికి తరలించాలని చూసినాడుకాని అది కదలలేదు. అతని పిమ్మట గ్రామంలోని ఓంకారేశ్వరాలయ పూజారి పప్పు సుబ్బయ్యగారు ఆ నందీశ్వరుని తమ ఆలయానికి తరలించాలను కున్నారుకాని అతడపుడుకూడా కదలలేదు. కాలం మాత్రం అతనిముందు కదులుతూనే పోయింది.

ఆలాఉండగా ఒకపుడక్కడ లావూని భూముల పై అధికారంలో నాగేందర్‌రావు అనే నాయబ్ తహసీల్‌దారు వచ్చి నాడు. ఆయన అల్వాల నివాసి. హరిజనుడు. ఆయన ఒకప్పు డొక పెండ్లికి ఆ దారిని మోటారుసైకిలుపై "మీర్‌ఖాన్"

పేటకు వెళ్ళుతున్నాడు. అపుడు నందిగుడి గుడి దగ్గరకు రాగానే బండి ఆగిపోయింది. ఆయన దిగి దాన్ని పరిశీలించినాడు. ఏ లోపం కనిపించలేదు. కాని ఎన్నిసార్లు పెడల్ త్రొక్కినా బండి స్టార్టు కాలేదు మొరాయించింది. అపుడతడు నందీశ్వరునికి ఎదురుగా వచ్చి దండంపెట్టి మళ్ళి బండి ఎక్కినాడు. అదిక ఏమీ ఎదురు చెప్పకుండా యధాప్రకారంగా సాగిపోయింది. ఆ రాత్రి అతనికి నందీశ్వరుడు కలలో కనిపించి తన గుడిని పునరుద్ధరించ వలసిందని ఆదేశించినాడు.

ఈశ్వరు డెపుడు ఎవరిని ఏ రూపంలో కరుణిస్తాడో ఎరుగలేము. అతని అనుగ్రహానికి జాతి, వయోభేదా లడ్డురావు.

ఆ స్వప్నంతో అతడు దృఢసంకల్పుడై ఆలయోద్ధరణకు కంకణం కట్టుకున్నాడు. ఆయన అసలు సిసలైన హరిజనుడు కాబట్టి తన సంకల్పానికి గ్రామస్థులెవరు సహకరించకున్నా తలపెట్టిన పనికి వెనుదీయలేదు.

ఆలయం అడుగంతా బాగుచేయించి నలువది అడుగుల చదరం అయిదడుగుల ఎత్తుగల వేదిక కట్టించి దానినిండ గిల్ల నింపించి ఆలయానికి మరికొన్ని స్తంభాలు కూడా మహాబలిపురం నుండి తెప్పించి దానికి మళ్లీ పూర్వరూపం యిచ్చినాడు.

ఆ నిర్మాణం తలపెట్టిన పిమ్మట గ్రామస్థులెవరూ సహక రించకపోగా అతడు హరిజనుడు కాబట్టి ఆటంకాలు గూడా కలిగించ చూచినారట. ఆ సందర్భంలో అతడు నిరాశో పహతుడు కాగా కలలో ఈ తడవ నాగేంద్రుడు కనిపించి నీకు ఈ ఆలయోద్ధరణకు ఏలాటి ఆటంకాలు కలిగినా భయపడవద్దు అని ధైర్యం యిచ్చినాడట.

అతనిపై శివానుగ్రహం సంపూర్ణంగా కలిగింది. కాబట్టి కలిగిన ఆటంకాల నెదుర్కొని నిలిచినాడు. నిర్మాణం పూర్తి అయ్యేవరకు పాలు పండ్లు మాత్రమే ఆహారంగా తీసికుంటు దీక్ష వహించినాడు. అతని దీక్షకు అంతవరకెవరికీ కదలని నందీశ్వరుడవలీలగా లేచినాడట. అతనిక్రింద రెండు తామ్ర పత్రాలు లభించగా వానిని మళ్లీ యధాపూర్వంగానే ఉంచి క్రొత్తగా కట్టిన వేదికపై నందీశ్వరుని, ఆలయాన్ని ఎప్పటివలె నిలిపి నాడు. అంతేకాక ఆ వేదికపై నాలుగు మూలలలో వరుసగా కుమారస్వామి - అంజనేయుడు - అంబ - గణపతి - మూర్తులను చిన్నగుడులు కట్టి నిలిపి ఆలయంముందు ఈశాన్యంగా చిన్న కల్యాణమండపం కూడా కట్టించినాడు.

ప్రాచీనాలయాలను పునరుద్ధరించటమే కాదు. వానికి నిత్య పూజారులు, పూజ చేసేవారికి తగిన వసతి కూడా అవసరం.

నాగేందర్‌రావు హరిజనుడు కనుక ఆలయంయొక్క పూజకు గ్రామంలోని బ్రాహ్మణులెవరూ సహకరించలేదట. అందుచేత ఆయన ఒక మనుబ్రహ్మను నెలకు 125| రూ. వేతనంతో పూజారిగా నియమించి అక్కడ యాత్రికుల వసతికి పదేను గదులుకూడా కట్టించినాడు.

ఈ ఆలయానికి ముస్లిం ప్రభువుల కాలంలో దానం చేయ బడిందే రెండు వందల ఎకరాల భూమి ఉన్నదట కాని అది అంతా హిందువుల దురాక్రమణలో ఉండగా నాగేంద్రరావుగారు ఆలయం ప్రక్కగా అందులోనుండి రెండెకరాల భూమిని కొని స్వామికి మళ్ళీ దానంచేసి దానిలో ఒక బావిని త్రవ్వించి అది పూజారిగారి జీవనోపాధి కుద్దేశించినాడు.

ఈ ఆలయోద్ధరణ క్రీ.శ. 1967 ఫిబ్రవరిలో ప్రారంభ మయింది. దీనికి అతనికి సుమారు నాలుగు లక్షల వ్యయం అయిందట. అయితే చిత్తశుద్ధిగా చేసిన ఏ పని వృధాకాదు కాబట్టి ఈ తర్వాత అతనికి ప్రమోషన్ కూడా వచ్చిందని చెబుతారు.

ఉద్ధరణానంతరం ఈ ఆలయానికి స్థానికుడైన కొండూరు లింగయ్యగారు చుట్టూ ఇనుపచువ్వలు వేయించినాడు.

ఈ గ్రామంలో చెప్పదగిన మరో గుడి ఓంకారేశ్వ రాలయం. దాన్ని పాముపాటి లింగయ్య అనే వైశ్యుడు కట్టించి నాడు. ఆయన హైదరాబాదు నివాసి. నయాపూల్ దగ్గర అక్బర్‌జా బజారులో ఉండేవాడు. ఆలయాన్ని కట్టించిన తరువాత ఆయన దానిపేర పదివేల డొనేషన్ను వసూలుచేసి 1450 ఎకరాల భూమి కొని ఆలయానికి ఒక శాశ్వతభృతిని ఏర్పరచినాడు. ఈ భూమి నందివడ్డెమాను-సింగారం-తాటిపర్తి-కురుమిద్దె గ్రామాలలో ఉంది.

లింగయ్యగారు దేవీ ఉపాసకుడు. ఆయనకు దేవీ ప్రత్య క్షాన్ని గురించి అనేక కథలు ప్రచారంలో ఉన్నవి. ఆయనకు ఎందరో శిష్యులు కూడా ఉన్నారు. వారిలో పాపన్న పేట

దొరసానిగారీ ఆలయానికి మూడుపుట్ల యిత్తడి పాత్రసామాను దానం చేసింది.

ఇదిగూడ ప్రాజ్మ్ఖాలయం. దీనిముందుగూడ పెద్దకోనేరు దానిలో సత్రాలు ఉన్నవికాని ఇపుడది పాడుబడింది. శిథిలం కాలేదు కాబట్టి వాడుకలో ఉంచవలసినట్లుగానే ఉంది.

ఓంకారేశ్వరాలయంలో శివప్రతిష్ఠతోపాటు గంగాపార్వతి శంకరుల ఉత్సవ విగ్రహాలున్నవి. శివునికి కుడివైపున గణపతి, ఎడమవైపున అమ్మవారు శిలామూర్తులున్నవి. ఈ స్వామికి ఫాల్గుణ బహుళ పాడ్యమినుండి తదియవరకు కల్యాణోత్సవం జరుగుతుంది.

ఓంకారేశ్వరునికి కుడివైపునగల గదిలో కోదండరామ ప్రతిష్ఠ ఉంది. ఈ ప్రతిష్ఠగూడ లింగయ్యగారి శిష్యురాలు పాపమ్మ దొరసానిగారే చేసింది. శ్రీరామనవమికి ఈ స్వామికి కల్యాణోత్సవం నడుస్తుంది.

ఓంకారేశ్వరునికి ఎడమవైపు గదిలో దత్తాత్రేయ ప్రతిష్ఠ ఉంది. ఆ స్వామిని బి. ఏ. రామారావుగారనే స్మార్తుడు ప్రతిష్ఠించినాడు. మాఘ శుద్ధ విదియకు ఇక్కడ దత్తజయంతి నడుస్తుంది.

ఈ ఆలయ సముదాయం విశాలమైన ఆవరణలో కట్టబడింది. గర్భాలయాలన్నిటిపైన ఒక మోస్తరు శిఖరాలున్నవి. ఆవరణలో చుట్టూ ఒక గది వెడల్పు కప్పు ఉంది. దానికి నలువైపుల మహాద్వారాలున్నవి. ఈ ద్వారాలపై గదులు కట్టబడినవి కాబట్టి వెలుపలివైపున ఈ ఆలయ సమూహం ఒక జాగీర్దారుగారిల్లువలె కనిపిస్తుంది.

ప్రాకారంలో దక్షిణద్వారం దగ్గర కన్యకాపరమేశ్వరి ప్రతిష్ఠ ఉత్సవ విగ్రహం కూడా ఉన్నవి. ఉత్తర ద్వారం దగ్గర ఆంజనేయ ప్రతిష్ఠ దానివెనుక లింగయ్యగారి సమాధి ఉన్నవి. ఆయన సమాధి దగ్గర పాదుకలు కృష్ణసర్పంవలె ఉన్న కుటిలదండం ఉంచబడినవి. ఈయన ఆరాధన ఫాల్గుణ శుద్ధ విదియ తదియలలో జరుగుతుంది.

నందీశ్వరాలయం ఉద్ధరింపబడినా అది హరిజనోద్ధరణ కాబట్టి గ్రామస్థులకు ప్రస్తుతం ఈ ఆలయమే పెద్ద దిక్కుగా ఉంది. ఆస్తులు బాగానే ఉన్నా గ్రామస్థుల కెవరికీ దీని నిర్వహణపై శ్రద్ధ ఉన్నట్టు కనిపించదు. లేకుంటె ఇది ఎంతో వృద్ధికి రావలసిన సముదాయం.

ప్రస్తుతం ఇది పప్పు సుబ్బయ్యగారు అనే స్మార్తుని ఆధీనంలో ఉన్నది. ఆయన పూజారిగారిని పెట్టి పూజ చేయిస్తున్నాడు.

పూర్వం ఈలాగే లింగయ్యగారివంటి మహానుభావు లెవరెవరో ఆలయాలు కట్టించి వానికి ఆస్తులు సమకూర్చినారు. అయితే అవిపుడు నారాయణుని విడిచి నరుని హస్తగతమై పోతున్నవి.

1. పాతకోట పుల్లయ్యగారు బ్రహ్మోత్తరఖండం రచించినాడు.
2. సిద్ధేశ్వరాలయం మరొకటి (షాద్) అమ్మపల్లి దగ్గర గల గుట్టపై ఉంది. ఆ స్వామిపై మిత్రుడు నిడుగొండ యాదగిరిగారు సుప్రభాతాన్ని కూడా రచించినాడు.
3. పూర్వం నాగర్ కర్నూలు తాలూకాలో నేటి గంగారం పడమట గల గుట్టనుండి ఒక జాలువాగు బయలుదేరి మడుగులు కడుతు వచ్చి నల్లవాగులో కలిసింది. అది చూచి గోన ప్రభువు జయలక్ష్మీపతిరాయడు మొదటి మడుగు దగ్గర గంగాదేవిని ప్రతిష్ఠించి గంగవరం, రెండవదాని దగ్గర మహాదేవుని ప్రతిష్ఠించి మహాదేవపురం, మూడవదానిదగ్గర ఇపుడు వడ్డవానిలో ఉండే నందిని ప్రతిష్ఠించినట్లు ప్రజలు చెప్పుకుంటారు. ఆనాటి మడుగులు కాని ఆజాలు కాని యిపుడు లేవుగాని ఈ గ్రామాలు మాత్రం ఒకే వరుసలో నిలిచిఉన్నవి.
5. కలువకొలను మొదట అక్కడగల ఒక కలువలకొలనునే ప్రధానంగా చేసికొని స్థాపించబడింది. ఆనాటి కొలను అడుగు ఇపుడు నంది కోటీశ్వరాలయం దగ్గర ఉంది. సంస్కృతంలో ఈ గ్రామానికి "కైరవకాసారపురం" అని వ్యవహారం.

—శ్రీ కపిలవాయి లింగమూర్తి

# గ్రంథ విమర్శలు

## గీతాభాష్యం

[శ్రీ శంకరా'స్ గీతాభాష్య - ఆంగ్లానువాదం : శ్రీ సి. వి. రామచంద్ర అయ్యర్, ప్రచురణ: భారతీయ విద్యాభవన్, కులపతి కె. ఎం. మున్షీమార్గ్, బొంబాయి 400 007, వెల: రు. 100]

భారతీయ తాత్విక జీవనాన్ని ప్రభావితం చేసిన ప్రస్థాన త్రయంలో భగవద్గీత మధ్యమణి. ఈ ప్రస్థానత్రయానికి త్రిమతాచార్యులు మాత్రమే కాకుండా అనేకులు భాష్యాలు, వ్యాఖ్యలు సంతరించారు. అయినా అగ్రతాంబూలం ఆచార్య శంకరులదే. శతధా విభిన్నమైపోయిన భారతీయ సమాజాన్ని ఏకాత్మవాదంతో ఏకత్రితం చేసిన సమన్వయవాది శ్రీ శంకర భగవత్పాదులు.

సంక్లిష్ట జీవన సంఘర్షణలతో నిరంతరం అలమటించి పోతున్న మానవుడు నిత్యజీవితంలో ఎదురయ్యే సమస్యలను నిబ్బరంగా ఎదుర్కొని, సమర్థవంతంగా కర్మాచరణం చేయటానికి, కర్తవ్యాన్ని నిర్వర్తించటానికి సుగమమైన మార్గాన్ని నిర్దేశిస్తోంది భగవద్గీత. అలాటి భగవద్గీతకు "తదిదం గీతా శాస్త్రం సమస్త వేదార్థసార సంగ్రహమ్" అంటూ భాష్యాన్ని సంతరించారు శంకరులు. అగాధమూ, దుర్గ్రాహ్యము అయిన బ్రహ్మవిద్యను సరళ మధుర సుందరభాషలో కరతలామలకం చేశారు. ఆ భాష్యాన్ని అనేక భాషలలోకి అనువదించిన పండితులు తమ ప్రజలకు ఆ అమృతాన్ని పంచిపెట్టారు. ప్రపంచంలో అధికసంఖ్యాకులు మాట్లాడుకునే ఆంగ్లభాషలోకి ఆచార్యుల భాష్యాన్ని అనువదించి ప్రస్తుత గ్రంథాన్ని సంతరించిన ధన్యజీవి కీ॥శే॥ రామచంద్ర అయ్యర్. ఈ ఉద్గ్రంథం వెలుగు చూడటానికి కారణభూతులు ప్రముఖగాయని శ్రీమతి ఎం. ఎస్. సుబ్బులక్ష్మి, ఆమె భర్త శ్రీ సదాశివం. ఎంత చక్కని కూడిక!

శ్రీ అయ్యర్ 1905 లో చిదంబరంలో జన్మించారు. రామకృష్ణమఠ విద్యార్థి గృహంలో వుంటూ 19వ ఏటనే గణిత శాస్త్రంలో బి. ఏ. ఆనర్స్ పట్టా సాధించారు. 36 ఏళ్ళ ఉద్యోగ జీవనంలో ఆయన తాసిల్దారుగా రిటైరైనారు. 1979లో మరణించారు. ఇవి సాధారణ వివరాలు.

ఇక ఆయన ఆధ్యాత్మిక జీవనంలో ఎంతో అదృష్టవంతులు. ప్రెసిడెన్సీ కళాశాలలో చదివే కాలంలోనే అందరూ "అన్న" అని గౌరవంగా పిలిచే శ్రీ ఎన్. సుబ్రహ్మణ్య అయ్యర్ అనే అధ్యాపకుడు ఆయనపై అపార ప్రభావముద్ర వేశారు. తరువాత ఆయన స్వామి బ్రహ్మానందకు ప్రియ శిష్యుడై ఉపదేశం పొందారు. వేదాంత, మంత్రశాస్త్రాలలో అపరిమితాధికారాన్ని సాధించారు. తరువాత రమణమహర్షికి చేరువైనారు. ఉద్యోగ విరమణానంతరం ఆయన కంచి పరమాచార్యులను సేవించి మంత్రశాస్త్రాన్ని ఔపోసన పట్టారు. చివరి రోజులలో ఆయన శ్రీ సత్యసాయిబాబాపట్ల ఆకర్షితులైనారు.

భగవద్గీతకు శ్రీ శంకరులు వ్రాసిన భాష్యాన్ని ఆంగ్లంలోకి అనువదించే గురుతర బాధ్యతను "అన్న" ఆయనకు ఒప్పగించారు. ఆయన చేసిన అనువాదాన్ని ప్రముఖ తత్త్వశాస్త్ర పండితుడు ప్రొఫెసర్ పి. శంకరనారాయణన్ ఆమోదించి అచ్చుకావాలని ఆకాంక్షించారు. అయితే శ్రీ అయ్యర్ మరణించిన 9 సంవత్సరాలకు కానీ యీ గ్రంథం అచ్చుకాలేదు. ఈ బృహత్కార్యాన్ని భారతీయ విద్యాభవన్ చేపట్టటం అభినందనీయం.

"భాష్యం" అనే పదానికి చాలా అర్థాలు చెప్పారు పండితులు. "ఆక్షిప్య భావణాత్ భాష్యం" - ఒక విషయాన్ని ప్రశ్నించి, సమాధానించి, దానిపై మరల ప్రశ్నించి నిగ్గుతేల్చి సిద్ధాంత స్థాపన చేయటం భాష్యలక్షణమని కొందరు చెప్పారు.

"సూత్ర సూచితార్థోప పాదనేపి భాష్యమ్" - సూత్రమునందు లేదా మూలమునందు సూచితమైన అర్థాన్ని, భావాన్ని సంపాదించటం భాష్యం అని మరికొందరన్నారు. "సూత్రార్థో వర్ణ్యతే యత్ర వాక్యైః సూత్రానుసారిభిః। స్వపదానిచ వర్ణ్యతే భాష్యమ్ భాష్య విదో విదుః" — సూత్రాన్ని అనుసరించే మాటలతో లేదా వాక్యములతో దాని అర్థాన్ని వివరించేది, వ్యాఖ్యాతృ పదములను కూడా విపులీకరించేది భాష్యము అని భాష్య విదులు అంటారు. ముందుగా మూలము తరువాత ప్రతిపదార్థము,

తాత్పర్యము, భావము, సిద్ధాంత ప్రతిపాద్యము, ఆశంక, సమాధానము అనే క్రమంలో శ్రీ శంకరులు భగవద్గీతకు భాష్యాన్ని సంతరించారు.

త్రిమతాచార్యులకూ తమ సిద్ధాంతాలకు అనువైన భావాలు లభించాయి "గీత"లో! అదలాఉంచి మొత్తం భగవద్గీతలో స్థూల దృష్టికి "స్వవచన వ్యాఘాతాలు" కనిపిస్తాయి. "స్వధర్మే నిధనం శ్రేయం" అన్న కృష్ణుడే "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అంటాడు. సర్వధర్మములనూ విడిచి-అన్నప్పుడు స్వధర్మం మాటేమిటి? కర్మ చేసి తీరాలన్నవాడే జ్ఞానం ఉత్తమమైనదంటాడు! ఎలా? మరి భక్తి మాట ఏమిటి? ఇవన్నీ "గీత"ను "స్థూలరేఖ"గా చూచేవారికి కలిగే సందేహాలు.

ఈ ప్రశ్నలకూ, సందేహాలకూ శ్రీ శంకరులు సమాధానాలు అందించారు తమ భాష్యరచనలో. జ్ఞానం ఆధార భూమికగా భగవంతునిపట్ల భక్తితో కర్మాచరణం చేయాలంటారు కొందరు. అంటే జ్ఞానభక్తి, కర్మ మార్గాలు మూడూ కలిసి పోతాయన్నమాట!

అయితే శ్రీ శంకరులు కర్మమార్గాన్ని, జ్ఞానమార్గాన్ని విభిన్న మార్గాలుగా స్థాపించారు. ఇవి రెండూ రెండు భిన్న భిన్న మనోస్తరాలపై వున్న సాధకుల కోసం ఉద్దేశించినవని ఆయన తీర్పు. భగవద్గీతాక్రమం సాధకుని క్రమ పరిణామాన్ని సూచిస్తుందని, సాధనలోని విభిన్న దశలను బోధిస్తుందని గుర్తిస్తే "స్వవచన వ్యాఘాతాలు"గా కనిపించేవి విడిపోతాయి. పైగా ఒక్కొక్క యోగం సాధకుని "తాహతు"బట్టి నిర్ణయించిన "సిలబస్" వంటిదని ఆచార్యులు వివరించారు. ఈ విషయాన్ని శ్రీ అయ్యర్ తన పీఠికలో స్పష్టం చేశారు. ఇది సరైన దర్శనం. భక్తి విషయానికివచ్చినా దానికి శ్రీ శంకరులు యిచ్చిన నిర్వచనం యిలా వుంది" సాత్మానుసంధానం భక్తి దిత్యభిదీయతే," "స్వస్వరూపాను సంధానం భక్తిరిత్యభిదీయతే" (వివేక చూడామణి). ఇది ఆయన అద్వైత వాదానికి ఉపబలకమైనమాట.

ఇక అనువాదం విషయానికి వస్తే అదో "బ్రహ్మవిద్య" సంస్కృతభాషలో - అందులోనూ ఆత్మవిద్య, వేదాంత శాస్త్రాలకు సంబంధించిన పారిభాషిక పదాలకు సరైన ఆంగ్లపదం దొరకటం కష్టం. ఆ కష్టాన్ని సులభంగాదాటారు శ్రీ అయ్యర్! తన అనువాద విధానాన్ని ఆయన 'ముందుమాట'లో వివరించారు. ఒక ఉదాహరణ చూపి ముగిస్తాను. భగవద్గీతలోని రెండవ అధ్యాయంలో 16వ శ్లోకంలో గీతాచార్యుడు యిలా అంటాడు. "నాసతో విద్యతే భావో నా భావో విద్యతే సతః। ఉభయోరపి దృష్టోఽన్త స్త్వనయో స్తత్వ దర్శిభిః॥" దీనిలో మొదటి పాదానికి "అసతః=అసత్తునకు సత్యము కానిదానికి, భావః= ఉనికి, నవిద్యతే=లేదు. సతః=సత్యమైనదానికి, అభావః= లేకుండుట, నవిద్యతే=లేదు" అని అర్థము. ఇక్కడ "అసతః" అనుదానికి "అవిద్యమానస్య" అని శంకరులు అన్నారు. దీనిని వివరిస్తూ "అవిద్యమానస్య శీతోష్ణాదేః సకారణస్య నవిద్యతే, నాస్తిభావః భవనమ్ అస్తితా" అని అన్నారు. ఇది స్వపద వివరణం. దీనికి శ్రీ అయ్యర్ ఆంగ్లానువాదం యిలా సాగింది-

"ఆఫ్ ది అన్‌రియల్, సచ్ ఏజ్ కోల్డ్ అండ్ హీట్, టుగెదర్ విత్ దెయిర్ కాజెస్, దేర్ యీజ్ నో ఎగ్జిస్టెన్స్, నో బీయింగ్", ఇంకా చూడండి — "నహి శీతోష్ణాది సకారణం, ప్రమాణైః నిరూప్యమాణమ్, వస్తు సంభవతి-వికారోహిసః-వికారశ్చవ్యభిచరీతి-ఘటాది సంస్థానమ్ చక్షుషా నిరూప్యమాణమ్ మృద్వ్యతికరేణ అనుపలబ్ధేః అసత్ — తథా సర్వోపి వికారః కారణ వ్యతికరేణ అనుపలబ్ధే అసత్" దీనికి శ్రీ అయ్యర్ యిలా అనువాదం చేశారు - "కోల్డ్ అండ్ హీట్ ఎక్సెట్రా టుగెదర్ విత్ దెయిర్ కాజెస్, దో పెర్‌సీవ్‌డ్ బై ది సెన్సెస్, ఆర్ నాట్ ట్రూలీ ఎగ్జిస్టెంట్. దె ఆర్ ఓన్లీ మోడిఫికేషన్స్; అండ్ ఎవిరి మోడిఫికేషన్ యీజ్ ట్రాన్సిటరీ, ఫర్ ఎగ్జాంపుల్, ఎ ఫార్మ్ సచ్ ఏజ్ ఎ పాట్, దో సీన్ బై ది ఐ, యీజ్ నాట్ రియల్, బికాజ్ ఇట్ యీజ్ నాట్ పెర్‌సీవ్‌డ్ ఎపార్ట్ ఫ్రమ్ ది క్లే. సో ఆల్సో, ఆల్ మోడిఫికేషన్ యీజ్ అన్‌రియల్, బికాజ్ యిట్ యీజ్ నాట్ పెర్‌సీవ్‌డ్ ఎపార్ట్ ఫ్రమ్ ది కాజ్. ఆల్సో, బికాజ్ బిఫోర్ ఇట్స్ ఆరిజినేషన్ అండ్ ఆఫ్టర్ ఇట్స్ డిస్ట్రక్షన్ ఇట్ యీజ్ నాట్ పెర్‌సీవ్‌డ్ (జన్మప్రధ్వంసాభ్యామ్ ప్రాగూర్ధ్వంచ అనుపలబ్ధే), ఏజ్ ఏన్ ఎఫెక్ట్ సచ్ ఏజ్ ఎ పాట్ యీజ్ అన్‌రియల్. ఘటాదే మృదాది కారణస్యచ తత్కారణ వ్యతికరేణ అనుపలబ్ధే అసత్త్వమ్"

ఇలా శ్రీ శంకరులు ఎంత సరళమైన సంస్కృతభాషలో తమ భాష్యాన్ని వెలయించారో అంత సరళమైన ఆంగ్లంలో అనువాదాన్ని సంతరించారు శ్రీ అయ్యర్. ప్రస్తుతకాలంలో సంస్కృతం అంటే చిన్నచూపు వున్నా ఆంగ్లానిది పెద్దపీటే కాబట్టి భగవద్గీతకు శ్రీ శంకరులు వ్రాసిన భాష్యాన్ని యీ అనువాదం ద్వారా ఆనందించవచ్చు. "శంకర భారతీ విజయతే నిర్వాణ సంధాయినీ"

—వల్లభాచార్య

# చర్మవ్యాధులకు




## అతి గాఢంగా పనిచేసే
## అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెంట్

చర్మవ్యాధులకు ఉపయోగపడే సాధారణ ఆయింట్‌మెంట్లు ఎక్కువగా చర్మం లోపలకు ప్రవేశించలేవు. కాని అమోఘమైన చర్మరోగ నివారణ ఔషధాలు విశిష్టంగా చేరిఉండడంచేత అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెంటు మాత్రము లోపలకు ప్రవేశిస్తుంది. సాధారణ చర్మవ్యాధులను అతి శీఘ్రంగా నిర్మూలించి చర్మాన్ని పూర్వస్థితికి తెచ్చి సహజంగాను ఆరోగ్యవంతంగాను ఉంచుతుంది. అమృతాంజన్-డెర్మల్ ఆయింట్‌మెంట్ తామర, గజ్జి, దురద ఇతర చర్మ రోగాలకు ఆదర్శమైన నివారిణి. నేడే కొనండి!

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

**Amrutanjan Limited** 

757-TG

## బెజవాడ దుర్గామల్లీశ్వరాలయం శాసనములు

[బి. యన్. శాస్త్రి, మూసీ పబ్లికేషన్స్, 3-4-245/1 లింగంపల్లి, హైదరాబాదు-500 027, వెల రూ. 100/-]

బెజవాడలో ఇంద్రకీలాద్రిపైనున్న మల్లేశ్వరాలయ ప్రాంగణమున సుమారు 100 శాసనములు స్తంభములపైన, గోడలపైన తొలచబడియున్నవి. వీటిలో అధికభాగము కేంద్ర ప్రభుత్వ శాసన పరిశోధన శాఖవారిచే సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్ సంపుటములో ప్రచురింపబడెను. ఆ సంపుటము ఇప్పుడు లభ్యమగుటలేదు. చరిత్ర పరిశోధకులకు ఆ కొరత తీర్చుటకై శ్రీ శాస్త్రిగారు ఈ గ్రంథమును తయారుచేసిరి. ఇందు కేవలం శాసన పాఠములేగాక గ్రంథానిలో కొంత చరిత్రాంశ మును, స్థానిక గాథలను కూడ చేర్చిరి. శాసనములందు పేర్కొన బడిన దాన విశేషములు, దీపములు, భూములు, ఆవులు, మేకలు ఇత్యాది వివరములు తెలుపు పట్టిక నొకదానిని తయారుచేసిరి. దీనినిబట్టి శాసన విషయములను సులభముగా తెలుసుకొనవచ్చును. పలు శాసనములకు ప్రతిబింబములనుగూడ జతపరచిరి. తుదిలో అకారాదిసూచి గలదు.

గ్రంథము పరిశోధకులకు మిక్కిలి ఉపయోగకరమైన దనుటలో సంశయము లేదు. చరిత్ర ప్రాముఖ్యము గల శాసనము లనేకమిందు గలవు. రెండవ యుద్ధమల్లుడి (క్రీ.శ. 927-934) శాసనము, వాటిలో ముఖ్యమైనది. ఆ శాసన స్తంభము మల్లేశ్వ రాలయమువద్ద లేకున్నను దానినిందు చేర్చిరి. అందు కొన్ని తెలుగు పద్యములున్న విషయము తెలుగు వాఙ్మయ పరిశోధకు లకు తెలిసినదే. 11వ శతాబ్దినుండి 17వ శతాబ్దివరకు ఆ ప్రాంతము నేలిన మాండలికుల చరిత్రకీ శాసనములు ముఖ్య మైనవి.

గ్రంథములో అనేక ముఖ్యాంశములున్నను లోపములు గూడ బహుళముగా గలవు. అచ్చుతప్పులు ముఖ్యమైనవి. శాసన పాఠములను కొన్ని తావులలో యథాతథముగా స్వీకరించ వీలుగాకున్నది. ప్రతిబింబములు గూడ స్పష్టముగా లేకపోవుట వలన ఉపయోగము తక్కువగా నున్నవి. ఈ రెండు లోపముల వలన గ్రంథమునకు కొంత విలువ తగ్గుచున్నదనిపించును.

## ముఖలింగ దేవాలయ చరిత్ర-శాసనములు

[బి. ఎన్. శాస్త్రి, కాకతి పబ్లికేషన్స్, 3-4-424/5, నారాయణగూడ, హైదరాబాదు-29, వెల: రూ. 100/-]

తెలుగుదేశంలో కళింగ ప్రాంతమని చరిత్ర ప్రసిద్ధమైన శ్రీకాకుళం జిల్లాలో ముఖలింగ నగరముంది. అది తూర్పు గాంగ రాజులకు రాజధాని నగరమని చరిత్రకారులు నిశ్చయించిరి. అచట ఆ రాజులచే రేఖా విమాన వాస్తు సంప్రదాయములో నిర్మింపబడిన మధుకేశ్వర దేవాలయము మిక్కిలి రమ్యముగా నుండును. దాని గోడలమీద స్తంభములమీద సుమారు నూట యేబది శాసనములు చెక్కబడియున్నవి. అవి అన్నియు ఆ దేవునికి రాజులు, మంత్రులు, సేనాపతులు, సామంతులు తదిత భక్తులు ఇచ్చిన దానములను తెలుపుచున్నవి. వీటిలో సుమ పది శాసనములు ఆ గ్రామమువద్దనే అనియంక భీమేశ్వరాల ములో నున్నవి. ఈ 147-8 శాసనాలు సౌత్ ఇండియ ఇన్‌స్క్రిప్షన్స్ 5వ సంపుటములో ప్రకటించబడెను. కాని గ్రంథము ఇపుడు లభ్యమగుటలేదని శ్రీ యన్. రమేశన్‌గా శ్రీ యన్. ముకుందరావుగారు 'టెంపుల్ ఇన్‌స్క్రిప్షన్స్ ఆ ఆంధ్రప్రదేశ్' అనే శీర్షికతో శ్రీకాకుళం జిల్లాలో గల నారాయ పురం, ముఖలింగము, శ్రీకూర్మములలో గల శాసనము నన్నింటిని ఒక సంపుటములో కూర్చి ఆం.ప్ర. దేవాదాయశా ద్వారా ఇటీవల ప్రచురించిరి. శ్రీ బి. యన్. శాస్త్రిగారు ముఖ శాసనముల మాత్రమే యీ గ్రంథములో ముద్రించిరి. కొ ముఖ్య శాసనములకు ప్రతిబింబములు చేర్చిరి. ఈ ప్రచురణ విపులమగు చరిత్రాంశమును జేర్చిరి. అందు తూర్పు గాం రాజుల చరిత్ర, గజపతిరాజుల చరిత్ర కలవు.

మధుకేశ్వరాలయమును గూర్చి శాసనములద్వారా తెలియ వచ్చుచున్న సమాచారమును సంక్షిప్తముగా తెలిపిరి. ఆ గుడి యందున్న కొన్ని ముఖ్య శిల్పవిశేషములనుగూడ ఛాయాచిత్రము లతోబాటు వివరించిరి. చరిత్ర పరిశోధకులకు ఈ గ్రంథము మిక్కిలి సహకరించుననుటలో సందియము లేదు.

—పి. వి. పరబ్రహ్మశాస్త్రి

Printed & Published for Nageswara Rao Estates Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247